# మిక్కిలి సరసమైన
# ధర కలిగిన డిటర్జెంటు బిళ్ల




**శ్రీమతిగారూ, ఇదిగో మీకోసం బోనస్**




టాటా
ఉత్పత్తి

బోనస్ నిజమైన బోనసు. బోనస్‌లో ఉతుకుడు శక్తి బాగా నిండి ఉన్నది. అందు చేత తక్కువ బోనస్, తక్కువ శ్రమతో ఎక్కువ బట్టలను అత్యంత తెల్లగా, కాంతివంతముగా ఉండేటట్లు ఉతకవచ్చును. బోనస్ ఎటువంటి నీటిలోనైనా సరే అమితమైన నురుగు నిస్తుంది. ఎందువల్లనంటే బోనస్ ఉత్తమంగా ఉతికే డిటర్జెంటు—సబ్బు కాదు.

ఉత్తమ ఫలితాలకు, బట్టలను బాగా నాన బెట్టండి. ఉపయోగించిన తరువాత బోనసును పొడి ప్రదేశంలో ఉంచండి.

**బట్టలను అత్యుత్తమంగా ఉతకటానికి నేడే వాడండి**

# బోనస్

—ప్రశస్తమైన డిటర్జెంటు

CMTB-9-244 TEL

వస్తున్నాను మీ ఓట్లకోసం.
నన్ను గెలిపిస్తే మళ్ళీ వస్తాను
అయిదు సంవత్సరాల తర్వాత!!

చలన చిత్ర సమర్పించు

# మహమ్మద్ బిన్ తుగ్లక్







ఆర్ట్:
విజయ
స్టిల్స్
బలరాం

శ్రీ వెంకటేశ్వర

దర్శకత్వం
B.V.ప్రసాద్

నిర్మాత:
V.జగన్మోహనరావు

మాటలు: దాసరి నారాయణరావు • సంగీతం: హనుమంతరావు

# ఉత్తరాలు

## నవలారచయితలకి మనవి

ప్రస్తుతం చాలా సీరియల్ నవలలు 20 వారాలకి మించి కూడా కొనసాగుతున్నాయి. వాటిని చదవటం కష్టంగాలేదు కాని నాది ఒక మనవి.

సంవత్సరంలోని 52 వారాలలో ఇంచుమించు సగం ఒక సీరియల్ నవలకే అయిపోతే పాఠకులు నాలుగు నవలలు చదవటం కన్నా వీలుపడదు!

ఎన్నో విదేశపత్రికలలో పెద్ద రచయితల నవలల్ని 10 వారాలకి మించకుండా వేస్తూ ఉండటం గమనించాను.

ఇదే పద్ధతిని తెలుగు రచయితలు కూడా అనుసరిస్తే పాఠకులకి ఒక సంవత్సరంలో 10 నవలలైనా చదివే అవకాశం ఉంటుంది.

సీరియల్ నవలలు రాసే వారందరూ నా మనవిని గురించి ఆలోచించి 10 కాకపోయినా 12 అయినా వారాలు మించని నవలలు రాయటానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను.

కె.వి.రావు (మదరాసు)

## కథలు

ఒక్కలు కథ చదివాను. ఆ కథలో చివర రవుడి తెలుగు వాడివి కాబట్టి బ్రతికిపోయావు...... అంటాడు—ఆమాట రాయడంతో రచయితగారి ఉద్దేశ్యం....

ఎ.బి.ఆర్. ప్రసాద్ రెడ్డి (గుంటూరు)

* * *

డా. కే. రావ్‌గారి ఊహాలోకంలోని లక్షలు మజాగా ఉన్నాయి. నిర్భాగ్యురాళ్ళ సాగరత్నాలు, ఉద్యోగస్తులు శంకరాలు చాలామంది కనిపించేరు తెలుగుదేశంలో. కాని ఆ 'బాస్టర్డు' గళ్ళలుంగీవాడు ఎక్కడా కనిపించలేదు— కథలలోను, సినిమాలలోను తప్ప. యింకా వెతుకుతున్నాను. కనిపిస్తాడనే ఆశకొద్దీ.

రావు (మదరాసు)

## సీరియల్

మరో మూడువారాల్లో ఈ ప్రేమయాత్ర ముగిసిపోతుంది అని కాంతారావు అనగానే అయ్యో అనిపించిందంటే నమ్మండి పరిమళాసోమేశ్వర్‌గారూ! దాంపత్య జీవితంలో మాధుర్యాన్ని ఎంత చక్కగా చిత్రించారండీ. భార్యాభర్తలు అంటే కీచులాటలు, అపోహలు, లేకుంటే మంచి భార్యకు చెడ్డ భర్త ఈ రకంగా సాగిన రచనలు చదివి కన్నెపిల్లలు హడలిపోతూ ఊహించుకుంటారు దాంపత్యజీవితాన్ని. అలా కాకుండా దాంపత్యజీవితం ఎంత తియ్యగా సాగించవచ్చునో మీ నవలద్వారా యువతీయువకులకు చక్కని శైలిలో బోధించారు. ఈ రకమైన నవల వ్రాయాలంటే కొంతకాకుంటే కొంతయినా ఆ రకమైన చక్కటి దాంపత్య జీవితం అనుభవించిన వారే వ్రాయగలరు. ఏమంటారు? మీరు నా ఎదురుగా ఉంటే ఇలా మీ నవల గురించి నేనొక నవల చెప్పెయ్యగలను. కాని ఇది ఉత్తరం అయిపోయింది. ఇంతకంటే ఎక్కువ వ్రాస్తే ప్రచురించరుమరి!

శ్రీమతి పెమ్మరాజు ఇందిర (వాల్తేరు)

* * *

ఈ వారం (11–2–72) పత్రికవీక్లీలో ఫిల్మలతో ప్రేమయాత్ర చదివాక యీ లేఖ వ్రాయాలనిపించింది. ఈ సంచికలో శ్రీమతి పరిమళాసోమేశ్వర్ కల్యాణి, కాంతారావుల మైసూరు యాత్రను వర్ణిస్తూ, కొన్ని పొరపాట్లు వ్రాశారని తెలియజేయటకు విచారిస్తున్నాను. రచయిత్రి అన్నట్లు రవివర్మ చిత్రాలు వగైరా వున్న భవనాన్ని జగన్మోహన్‌ప్యాలెస్ అనే పిలుస్తారు. జగన్మోహన్‌మహల్ వాడుకలో లేదు. రవివర్మ చిత్రాల్లో వైవిధ్యం అంతగా లేకపోవచ్చు గాని, విసుగుమాత్రం కలగదు నాకు. ఏ రసజ్ఞుడైనా, ఆ చిత్రాలు చూసినా ప్రతిదాంట్లోనూ ఏదో ఒక నిగూఢమైన మధురభావాన్ని గ్రహించగలడు. కళాహృదయం ఎక్కువలేని వారికే బహుశా విసుగు కలుగుతుందేమో!

రచయిత్రి వ్రాసినట్లు—బృందావన్ గార్డెన్సులో స్పెషల్ ఇల్యూమినేషన్ బుధ, శని ఆదివారాల్లో వుంటుంది. శుక్రవారం వుండదు. ఈ చిన్నపొర













# తెలుగు సందేశాలతో ఉగాది గ్రీటింగ్ కార్డులు

ఉగాది తెలుగు పండుగ—తెలుగువారి తొలి పండుగ. సంవత్సరాది సందర్భంగా ఒకరికొకరు పంపించుకొనే శుభాకాంక్షల సందేశాలు తెలుగు భాషలో మాత్రమేగాకుండా, తెనుగుతనం ఉట్టిపడుతూ వుండడం సముచితం కనుక ప్రముఖ కవుల కవితలనుకూడాచేర్చి, అనేక రంగులలో 12 రకాల ముచ్చటైన గ్రీటింగ్ కార్డులను అన్ని వర్గాలవారికి, అన్ని అంతస్థులవారికి అన్ని విధాలుగా అందుబాటులో వుండగల విధంగా ప్రచురించాము.

వసంత ఋతువు చిత్రీకరణతో మూడు కార్డులు: (1) వసంతరాగం, (2) వసంతోదయం, (3) వాసంత విలాసం - కవరుతో ఒక్కొక్కటి 60 పైసలు; శిల్పకళాఖండాలతో మూడు కార్డులు: (4) అమరావతీస్తూపం (5) నాగార్జున పూర్ణకుంభం (6) ఒరంగల్లుకోట తోరణద్వారం - కవరుతో ఒక్కొక్కటి 45 పైసలు; గ్రామీణజీవన దృశ్యాలతో మూడు కార్డులు: (7) పంచాంగ శ్రవణం (8) బుడబుక్కలవాడు (9) సోదెమ్మ కవరుతో ఒక్కొక్కటి 35 పైసలు; పిల్లల కార్డులు మూడు: (10) కోకిల బాసలు (11) చిలకమ్మ పెండ్లి (12) పాపల ఆటలు - కవరుతో ఒక్కొక్కటి 25 పైసలు.

ఇంగ్లీషు సందేశాలతో మరొక ఆరు కార్డులు: ఇంగ్లీషులో సందేశాలు కావాలని కోరేవారికొరకై వసంతఋతువు చిత్రాలుగల మూడు కార్డులు (ఇవికూడా ఒక్కొక్కటి 60 పైసలే) శిల్పకళాఖండాలుగల మూడు కార్డులు (ఇవికూడా ఒక్కొక్కటి 45 పైసలే) మొత్తం ఆరు కార్డులు ఒక్క ఇంగ్లీషు సందేశాలతోనే ప్రచురించాము.

పన్నెండు తెలుగు కార్డుల సెట్టు: రు. **7/-** ఆరు ఇంగ్లీషు కార్డుల సెట్టు: రు. **4.75**. తెలుగు, ఇంగ్లీషు కార్డులు రెండూ కలిసి మొత్తం 18 కార్డులుగల కంబైండు సెట్టు: రు. **11/-** సెట్టుల ధరలలో వాటిని రిజిస్టర్డు పోస్టులో మేము పంపడానికయ్యే ఖర్చునుకూడా చేర్చాము. మామూలుపోస్టులో పంపజాలము. అచ్చగా తెలుగు సెట్టు, అచ్చగా ఇంగ్లీషు సెట్టు, అచ్చగా తెలుగు ఇంగ్లీషుల కంబైండ్ సెట్టు-ఇలా ఏ సెట్టు కావాలంటే ఆ సెట్టును మాత్రమే పంపగలముగాని చిల్లరగాగాని ఆ సెట్టులో కొన్ని, ఈ సెట్టులో కొన్ని ఎంచుకోడానికి వీలులేదు. మార్చి 10వ తేదీ వరకే సెట్లు పంపగలము. *కాంపుల్స్ లేవు. వి.పి.వి. పద్ధతిలేదు. పోస్టల్ ఆర్డర్‌గాని, మనియార్డరుగాని పంపకుండా ఉత్తరాలు వ్రాయవలదని వినతి. పట్టణప్రాంతాలలో మాత్రమేగాక పల్లెపట్టులలోకూడా డీలర్లు కావాలి. వ్యాపార వివరాలకు వెనువెంటనే వ్రాయ కోరుతున్నాము.*

*మాకు మీరు వ్రాసే ఉత్తరాలన్నీ ఇంగ్లీషులోనే వ్రాస్తే మాకు సౌకర్యం. అందుచేత దయచేసి ఇంగ్లీషులోనే ఉత్తరాలు వ్రాయండి.*

**Script Arts**

**8, State Bank Street, Post Box No. 2248**
**MADRAS 2 Phone: 85103**

*సెట్లు కొరకై వ్రాసే వారు తమ చిరునామాను పూర్తి వివరాలతో స్పష్టంగా ఇంగ్లీషులోనే వ్రాయాలని మరీమరీ మనవి చేస్తున్నాము.*

పాట్లు తప్పితే, మొదటనుంచి యువకహృదయాలని. గిలిగింతలకు గురిచేస్తూ కథను నడుపుతున్న పరిమళ గారి నేర్పుకు (సాహసానికి కూడ)నా అభినందనలు.

—ఏ. యస్. చక్రవర్తి (మైసూరు)

* * *

ఈ వారం 11—2—72 సంచికలోని యర్రంచంద్రశేఖరం గారి సీరియల్ గూడుచేరినపక్షులు అసజంగా ఉంది. లక్ష్మి ప్రసవవేదనచే బాధపడుతూందని వ్రాశారు రచయితగారు, మరి అంత బాధలోనూ ఆమె భర్తతోనూ, వదినతోనూ మాటాడి అందరి దగ్గరా శలవు తీసుకుని చనిపోవటం విడ్డూరంగా ఉంది. ప్రసవవేదనతో బాధపడే స్త్రీ ఎలాంటి



# ఉత్తరాలు

వరకయాతన అనుభవిస్తుందో రచయితగారికి తెలియదులా ఉంది.

పిండి వేంకటవిజయకుమార్ (హైదరాబాద్)

## ముఖచిత్రం

విజేత శ్రీమతిఇందిరాగాంధి ముఖచిత్రం అత్యంత ప్రశంసనీయంగా వుండి సంచికకు నిండుతనాన్ని కలిగించింది. ఆర్టిస్ట్‌కు నా అభినందనలు.

పర్వాసుదేవరావు, (ఖమ్మం)

* * *

భారతరత్న శ్రీమతిఇందిరాగాంధి ముఖచిత్రంతో వెలువడిన సంచిక చాలా ఆకర్షణీయంగా యుంది. ఇంతవరకూ శృంగారమే ప్రధానాంశముగాయున్న సీరియల్ పిల్లలతో ప్రేమయాత్రలో ఈవారం కొత్తమలుపు తీసుకురావటంతో ముందుముందు ఎలా వుంటుందో ఊహించుకోలేకుండా ఉన్నది.

సర్వాసత్య నారాయణప్రసాదు (విజయవాడ)

* * *

మనప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి గారి ముఖచిత్రం పత్రికకు క్రొత్తవన్నె చేకూర్చినది. ఎప్పుడూ సినీతారల ముఖచిత్రాలేగాక, అప్పుడప్పుడయినా ఇలాంటి ముఖచిత్రాలు వేయగలరని ఆశిస్తున్నాను.

పి. బి. సుందర్ రెడ్డి (విజయవాడ)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 25-2-72

శ్రీ విరోధికృన్నామ సం॥ ఫాల్గుణమాసం॥ శుక్రవారం

సంపుటము: 65 సంచిక: 27

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31.20 |
| 6 మాసముల చందా | 15.60 |
| 3 మాసముల చందా | 7 80 |


## విషయానుక్రమణిక


టికెట్లు దొరకని నాయకులు
దెబ్బతిన్న పులులు అపాయం! - జాగ్రత్త!


సోషలిజం సోషలిజం సోషలిజం
ఆఁ...., ఆ మాట దానిక్కూడా పట్టుబడింది


కామన్‌వెల్త్
పాకిస్తాన్
బంగ్లాదేశ్


బంగ్లాదేశ్‌లో భారత సైన్యం...


... వాళ్లది దౌర్జన్యం అని ప్రచారం చేయడానికి ఇదే అదను


ఛ..ఛ.. మనల్ని క్రుంగదీసే శారు!
మార్చి 25 నాటికల్లా భారత సైన్యం ఉప సంహరణ!

# పిల్లలని కొట్టడంకూడా ఒక జబ్బే!

ఇటీవల వైద్యశాస్త్రంలో అనేకమైన కొత్త రహస్యాలు తెలిశాయి. వీనిని ధర్మశాస్త్రంలోకి తేసుకు రావలసి వుంది. అందుకుగాను డాక్టర్లు, లాయర్ల మధ్య చర్చ అవసరము కన్పిస్తున్నది. ఇటువంటి సమస్యలను చిన్న పిల్లలను కొట్టడం మొదలుగాగల దురలవాటును గురించింది ఒకటి, ప్రధానమైంది కూడాను.

చిన్నపిల్లలమీద దౌర్జన్యకం జరపడం అన్నదానిని ప్రపంచంలో అనేక సమాజాలు నిరసిస్తూనే వచ్చాయి. ఇందుకోసం శాసనాలు మొదలైన కట్టుడులు ఏర్పడిన సందర్భాలు వున్నాయి. ఇటీవల కొంతకాలం వరకు ఈ పిల్లలను కొట్టడం అన్నది ఎప్పుడోగాని జరిగే నేరంకాదని అనుకుంటూ వుండేవారు. వట్టి పనికి మాలిన వాళ్ళు అటువంటి పనులకు పాల్పడేవాళ్ళని గూడా అనుకుంటూ వచ్చారు.

అయితే పిల్లలను బాధించడం అన్నది అంత అపురూపంకాదనీ, సర్వసామాన్యంగా జరుగుతూ వస్తున్న దేనని 1962 లో బాగా బయటికి వచ్చింది. ఆ 1962 లో అమెరికాదేశపు వైద్యుడు— హెన్రీ కెంప్ అనే ఆయన ఒక కరపత్రం ప్రకటించారు. పిల్లలను బాధించడం దుర్లక్షణాలు అన్న విషయంపై ఆ కరపత్రం ప్రకటించబడింది. కేంప్ తన ఈ కరపత్రంలో దదాపు 749 లో కేసులను పరిశీలించారు. ఈ అన్ని కేసులు ఆ పిల్లలను కొట్టడానికి సంబంధించినవే. ఆ కొట్టడం గూడా తరచు కొట్టడం. తల్లిదండ్రులు, సంరక్షకులు పిల్లలను కొడుతూ వుంటారు. ఈ కేసులు అటువంటివి. ఈ కేసులు 749 లోను 78 మంది పిల్లలుచనిపోయినవి వున్నాయి.

ఆ మరుసంవత్సరం బ్రిటన్‌లో గూడా ఇటువంటి పరీక్షతో గూడిన సమాచారం ప్రకటించబడింది.

ఆ తర్వాతనుంచి వరసతప్పని పద్ధతిలో ఇటువంటి సమాచారాలు ప్రకటించబడుతున్నాయి.

1970 లో పరిస్థితి ఎంత విషమంగా తయారైందంటే, ఆరోగ్య విభాగాధికారులు డాక్టర్లకు ఈరకం పరిస్థితిని గురించి ఎరుకపరుస్తూ ఒక మెమొరాండంను జారీచేశారు. ఆ విభాగం చెప్పిన లెక్కల ప్రకారం ప్రతి సంవత్సరం ఈ రకమైన దెబ్బలు తినడం అనే పద్ధతివల్ల దాదాపు 3 వేలమంది శిశువులు, చిన్నపిల్లలు, గాయపడటమో, లేక అంగవికలులు కావడమో జరుగుతోంది. సంవత్సరంలోపు పిల్లలు దదాపు 40 మంది చొప్పున ఇటువంటి బాధలకు గురిఅయి ప్రతిసంవత్సరం మరణిస్తున్నారు. ఇటువంటి సందర్భాలను గురించి అప్రమత్తంగా వుండవలసిందని, అట్లా వుండటం వల్ల అటువంటి కేసులను న్యాయస్థానాలలో పెట్టడమో, శిశుసంక్షేమ సంస్థలకు అప్పగించడమో చేయవచ్చునని డాక్టర్లకు, వైద్యవృత్తి చేస్తున్నవారికి ఆ మెమొరాండం మూలకుగా తెలియజేయడమైంది. ఒక చిన్న కుర్రాడు లేక కుర్రదానియందు ఎముకలు విరగడము, తీవ్రమైన గాయాలు, తరచు తలదెబ్బలు, లేక ఆ పిల్లలు పైకిరాలేక పోవడము—అటువంటివి కన్పిస్తే, అవి అన్నీ ఆ పిల్లలను పెద్దవాళ్ళ కొట్టడం వల్ల, వారిని సరిగ్గా చూడకపోవడం వల్ల సంభవించినవేనని గ్రహించవలసిందిగా కోరారు. ఏ చిన్న పిల్లకాయ అయినా హటాత్తుగా కారణం కన్పించకుండా చనిపోతే, లేక పిల్లకాయకు తగిలిన దెబ్బకు, తల్లిదండ్రుల అందును గురించి చెప్పిన ఉదంతానికి పొంతన కుదరకపోయిన స్థితి వుంటే, అప్పుడు గూడా ఆ పిల్లకాయి ఏదో పైనపేర్కొన్నటువంటి బాధలకు గురిచేయబడినట్లు చెప్పే అవకాశము వున్నట్లు గ్రహించవలసిందిగా కూడా ఎరుకపరిచాయి.

ఇటువంటి విషాదకథనకాలలో కొన్ని సామ్య లక్షణాలు వుంటున్నాయి. ఇటువంటి బాధలు మగపిల్లలకు వున్నంతగా ఆడపిల్లలకు వుండవు. ఇటువంటి చెయిదాలు ఎక్కువగా ఇళ్ళలోనే జరుగుతాయి. ఆ కొట్టే పెద్ద వాళ్లలో మగవారికంటే, ఆడవాళ్ళు ఎక్కువ. స్త్రీ గర్భిణిఅయినప్పుడు, ఎడపిల్లలను కల్గివున్నప్పుడు, పిల్లలను ఎక్కువగా కొడుతూ వుంటుంది. పిల్లలను కొట్టేవారికి చాలామంది పరిపాటిగా ఏదోవిధమైన యాతనలో వుండటం వుంటుంది. అయితే ఇటువంటి వ్యక్తులను మానసిక రుగ్మతరీత్యా వర్గీకరించడం ఇంకా కుదరలేదు. ఈ పిల్లలను కొట్టే తల్లిదండ్రుల జాతిలో నూటికి ఐదుగురు మాత్రమే మానసిక రుగ్మతలు కలవారు కన్పిస్తున్నారు.

పిల్లలను కొట్టటం అన్నది ఎక్కువగా ఆ పిల్లలు ఏడుపు మొదలు పెట్టినప్పుడు, లేక అన్నం తినము అని మంకుపట్టుపడుతూ వున్నప్పుడూ సాగుతూ వుంటుంది.







పిల్లలను పెద్దవాళ్ళు కొట్టిందిలేనిది నిదానం చేసేందుకు అనుసరించవలసిన పద్ధతులంటూ ఇంకా స్పష్టంగా ఏవీలేవు. కాని అట్లా పిల్లలను కొట్టడం పరిపాటి విషయం అన్న ప్రాతిపదిక మీద లక్షణాలను అన్వేషించవలసి వుంటుంది. ఆ పిల్లలను కొట్టే తల్లిదండ్రులతో వ్యవహారం గూడా కష్టమైనపని. ముఖ్యముగా అక్కడ చూడవలసింది ఒక్కటే. పిల్లకాయ ప్రాణం రక్షించడం అన్నది. అది ఆ దెబ్బలు తిన్న పిల్లలను తక్షణం ఆస్పత్రిలో చేర్చడం వల్ల సాధ్యం అవుతుంది. ఆస్పత్రిలో చేర్చినప్పుడు, ఆ కేసు యొక్క ఆనుకూలను గురించిన దర్యాప్తు గూడా తేలిక అవుతుంది. అయితే వైద్యుడు, మానసిక వ్యాధి నిపుణుడు, స్థానిక ఆరోగ్యాధికారులు, ఇంకా ఇతరులు గూడా సహకారంతో పని చేయవలసి వుంటుంది.

ఒక పిల్లకాయను బాదినప్పుడు, దానిని గురించిన రుజువు తేలికగా దొరకదు. తల్లిదండ్రులు ఎప్పుడూ పిల్లకాయను కొట్టినట్లుగా ఒప్పుకోరు. ఎంత సాక్ష్యం అక్కడ వున్నా, వారి వద్దతే అంట. మొండిగా వుంటుంది. ఈ సందర్భంలో మరీ క్లిష్టంఅవుతూ వుండే కారణం గూడా అక్కడ వుంటుంది. తల్లిదండ్రులిద్దరూ ఈ బిడ్డలను బాదడంలో భాగస్వాములై వుంటారు. అందువల్ల వారిలో ఒకరిని గురించి ఇంకొకరు నిజం చెప్తారని అనుకోరాదు. అటువంటి సందర్భంలో డాక్టర్లు ఆ తల్లిదండ్రులకు ఆ పిల్లలను అప్పగించాలి అంటే ఎంకొచిస్తారు. అనుభవం ఎట్లా వుంటుంది—అంటే— ఒకసారి పిల్లకాయలను కొట్టడం జరిగిన తర్వాత, ఆ కొట్టడం తల్లిదండ్రులకు దాదాపు అలవాటైపోతుంది.

ఇటువంటి చాల బాధ కేసులను గురించి న్యాయశాస్త్రరీత్యా ఏమైనా చేయవచ్చుగదా అంటే, ఏ దేశంలోనైనా ఇటువంటి కేసులు నూటికి కోటికి ఏవో కొన్ని కొన్ని మాత్రమే వైద్యులదాకావస్తాయి. ఆ వైద్యుల దగ్గరకు వచ్చిన కేసులలో అతికొపిని

మాత్రమే కోర్టులదాకా వెడతాయి. అప్పుడుగూడా అక్కడ నివారణ చర్యలు తీసుకోవడం జరగదు. అక్కడ సాక్ష్యం పుట్టడం, తల్లిదండ్రుల నుంచి పిల్లలను వేరుచేయడం బాగుండదనుకోవడం వంటి సమస్యలు వస్తాయి.

అందువల్ల చాల బాధ కేసుల్లో చాలావరకు వారికి తగిలిన దెబ్బలను నయం చేయడం, ముందుముందు అటువంటి అఘాయిత్యాలు జరగకుండా చూడటం వంటి పనులు మాత్రం కొంతవరకు సాధ్యం అవుతూ వుంటాయి. ఇటువంటి పనులు తల్లిదండ్రులతో మాట్లాడి, వారి విషయమై తగు పర్యవేక్షణతో వుండటము ద్వారా సాధించబడుతూ వుంటాయి. ఇక్కడ నిజంగా తల్లిదండ్రులకు గూడా వైద్యం జరగడం ముఖ్యం అనిపిస్తుంది. ఆ వైద్యం ఆ పిల్లలు కొట్టే తల్లిదండ్రులను జాగ్రత్తగా మార్గంలో పెట్టడంగా కొనసాగవలసి వుంటుంది. ఈ సందర్భంలో న్యాయశాస్త్రము, వైద్యశాస్త్రము కలిసి పనిచేయువలసిన అగత్యం వుంది.

పిల్లలను కొట్టేవారికి శిక్ష విధించడం వంటి కేసులవలన ప్రయోజనం ఏమైనా వుంటుందా? ఈ విషయంలో శిశు వైద్యనిపుణులు, మానసిక శాస్త్ర నిపుణులు ఒక్క మాట గట్టిగా చెబుతున్నారు. అటువంటిది సాధ్యం కాదంటున్నారు. పిల్లవానిని కొట్టిందని తల్లిని కైదులో పెట్టడం స్పష్టంగా హేతువిరుద్ధంగా వుంటుంది. ఆమెకు ఇంకా పిల్లలు వుంటారు. ఆ పిల్లలను గూడా తల్లికి దూరం చేయడంవల్ల ఆ సమస్య పరిష్కారం కావడం లేదు. తండ్రిని కైదులో పెట్టవచ్చు కదా అంటే. కుటుంబాన్ని పోషించేనాథుడు వుండడు. ఆ భారాన్నిగూడా తల్లే నెత్తిమీద వేసుకోవలసి వస్తుంది. ఆ తల్లి గూడా పిల్లలను కొడుతూ వుండేదే గనుక, మానసికంగా రుగ్మతకలదని తేలివున్న విషయం అయి వుంటున్నది. చిన్న పిల్లలను ఇట్లా బాధపెట్టే వారిని శిక్షించడంవలన ఇతరుల మీద దాని ప్రభావము వుంటోందన్న సాక్ష్యం ఏమీ లేదు. ఉన్న సాక్ష్యం ఏమి చెబుతున్నదంటే, ఈ గందరగోళం అంతా ఉద్రేకాలతోను, ఆవేశాలతోను కూడినటు




వంటిదని, అంతేగాక అందుకు హేతువు గూడా ఏమీ కన్పించదని, అది అనుకోకుండా చేస్తున్నపని అని తెలుస్తున్నది. అట్లా పిల్లలను కొట్టడంవల్ల కలిగే ఫలితాలను గురించి ఎరుకగూడా లేకుండా ఆ కొట్టడం జరుగుతూ వున్నది.

ఇది ఒక పెద్ద సహజసంబంధమైన సమస్యగా రూపుకట్ట పూరుకుంది. ఇక్కడ న్యాయస్థానాలు ఏదోవిధమైన నిర్మాణాత్మక దృష్టి వహించి పని చేసేట్లు చూడవలసిన అవసరం గూడా ఏర్పడుతున్నది. ఇందుకు సంబంధించి ఏమి శాసనాలు చేసినా అవి పట్టు విడుపు కలిగి వుండాలి. అవసరమైన శిశువు పోషణ భారంగా, కొంతకాలంపాటు తల్లిదండ్రులకు దూరంగా జరిగే ఏర్పాటును గురించి గూడా ఆలోచించాలి. ఎంతకాలం ఇది అవసరమో అంతకాలమే అది జరగాలి. తల్లిదండ్రులను శిక్షించడం అనే పద్ధతి కుదరదు. కాబట్టి సాధ్యమైనంత వరకు వారిని సరిదిద్ది, వారిలో మార్పు తీసుకువచ్చేందుకు ప్రయత్నం జరగాలి. ఇటువంటి స్థితి సర్వసాధారణంగా వారి వారి సమాజ స్థితిని బట్టి సంభవం అవుతూ వుంటుంది. అంతేగాక ఇరుగు పొరుగు వారికి గూడా కొంత ఇటువంటి విషయాలలో విద్యను గరపాలి. ఏదన్నా క్రూరమైన పని, లేక దుర్మార్గం అయినపని అని వారికి అనిపించిన దానినుండి ఇరుగు పొరుగువారు తప్పుకుపోతూ వుంటారు. ఆ విషయం జోలి మనకెందుకు అనుకుంటారు. అందువల్ల అటువంటి తప్పుకు తిరగడం మంచిదికాదని, అది ఒక మానసిక రుగ్మత అని, కొంత సహాయము, కొంత అవగాహనతో వారు వ్యవహరించాలని ఆ ఇరుగు పొరుగు వారికి అర్థం అయ్యేట్లు చెప్పవలసి వుంటుంది. పిల్లకాయలను పడగొట్టే తల్లిదండ్రులు క్రమక్రమంగా ఇరుగుపొరుగు అంటే గిట్టనివారు, ఏకాకులు అయిపోతారు. పిల్లకాయలను కొట్టడం అనే వారి దురలవాటు వారికే భయంకరంగా తయారవుతుంది. అందుచేత వారు ఇతరులకు ముఖం చూపించలేని వారుగా తయారవుతారు. పిల్లకాయలు దెబ్బలు తిని తిని పనికిరాని వాడుగా అయిపోయినప్పుడుగాని, ఆ తల్లిదండ్రులకు అసలు పరిస్థితి అర్థం కాదు.

ఈ రకమైన బాధాకరమైన పనులయొక్క లక్షణాలను ఇరుగుపొరుగువారికీ, ఆ మాటకు వస్తే, తల్లిదండ్రులకు, ఎరుకకాగలట్లు చేస్తే, లేయా తల్లిదండ్రులయినవారికి చిన్నప్పుడు అదుపాదరాల్లు కరువైపోయినన్న కారణంవలంచి వారికి తెలియకుండానే ఈ రకమైన దురలవాటు ఉత్పన్నం అవుతున్నదని, మనస్సుకు విశదం కాగలట్లు చేస్తే, అప్పుడు, ఈ పని శిశువులను బాధించే ఈ రకమైన బాధలను చాలావరకు నివారించడం సాధ్యం అవుతుందనే చెప్పవచ్చు.

—జాన్ రోవాన్ విల్సన్

(సౌ. వ. సే.)

## హరి రామ్



# మాణిక్య మహల్

పాలంకి వెంకట రామచంద్రమూర్తి



మాజీ జమీందారు రాజా త్రివిక్రమ రావ్ బహద్దరు వారికి గౌరు నాయుడు నమ్మినబంటు. రాణీ హేమయమ్మారావు వారికి గూడా ఆకాసావాడు విశ్వాసపాత్రుడే. వాడానాడు సరాసరి జనానా నుండే వచ్చి, రాజావారి సమక్షంలో నిలిచి నమస్కరించి 'తమతో ఒక్క సంగతి మనవి చేద్దామని వచ్చాను ప్రభూ' అన్నాడు.

'మళ్ళీ, 'ప్రభూ' అనే అంటున్నావ్! ఏవ్రా ప్రభు వింకాను?' అన్నా రాయన.

'మా జమీందారుగారేనా ఇలా సెల విస్తోంది!' అన్నాడు నాయుడు.

'ఇంకా జమీందారేమిటి నాయుడూ? చింత చచ్చినా పులుపు ఉన్న దంటావేమిటి? జమీందారీ పోయింది గనక ఇప్పుడెవరైనా నన్ను 'రాజా బహద్దర'నీ, 'ప్రభువ'నీ పిలిస్తే వెటకారమనిపించి కంపరమెత్తి పోతోంది.'

నాయుడు ఆయనతో ఏకీభవించలేదు. 'అదేమన్నమాట దొరా? తమ కిప్పుడు మాత్రం కలిగినలోపం ఏమిటి? ఈ భవంతియే చేస్తుంది రెండు లక్షల రూపాయలు!'

'రెండు లక్షలు కాదు; లక్షా యాభై వేలు ఇస్తామంటూ ఎవరొచ్చినా అమ్మేస్తాను. ఇంకో పాతికవేలు తగ్గించమన్నా తగ్గిస్తాను.'

నాయుడు నివ్వెరపోతూ, 'ఏమని సెల విచ్చారు దొరా? అమ్మెయ్యడమా? మీతాత గారు రామనారాయణంగారు స్వయంగా అజమాయిషీ చేస్తూ కట్టించిన ఈ మాణిక్య మహలును అమ్మేస్తారా? దీనికేం లోపం వచ్చిందని? మరామత్తు చెయ్యడం కొంచెం అశ్రద్ధ ఐందికాని తాజమహలుని తలదన్నే భవంతికాదా దొరా ఇది?'

త్రివిక్రమరావు, 'కవిత్వం కట్టిపెట్టి విను; ఈ మహలును నువ్వు చెప్పినట్లు మరామత్తు చేయించాలంటె ఇప్పుడున్న అప్పు మరో నలభైవేలు పెరుగుతుంది.

'తమరు తలచుకుంటే అప్పు తీర్చెయ్యడం ఎంతసేపు దొరా?'

'తీర్చెయ్యాలనే నిశ్చయించుకున్నాను. ఈ మాణిక్య మహల్‌ని అమ్మేస్తాను. దీని వెనకాల ఉన్న ఇరవై యకరాల తోటా నివేశన స్థలలకింద విక్రయిస్తె రెండు లక్షలదాకా రావచ్చు. దానితో అప్పు తీరి పోతోంది, ఈమేడ విక్రయిస్తే వచ్చేసొమ్ము

పుచ్చుకుని ఏ హైదరాబాదో చెక్కాపోయి, ఓసలభైవేలిచ్చి చిన్న యిల్లొకటి కొంటాను.

'ఎందుకు దొరా ఆ యిల్లు?'

'ఎందుకేమిటి? ఉండడానికే.'

'ఏనుగు వెళ్లి పిచిక గూడులో ఇమడ గలదా ప్రభూ?'

త్రివిక్రమరావుగారు నవ్వుతో, 'పూర్వపు రోజులలో ఐతే నీ స్తోత్రానికి మెచ్చుకుని నీ మెడలో ఓ ముత్యాల హారం వేసేవాణ్ణోరా నాయుడూ. కాలం మారి, నా హోదాలన్నీ హారతి కర్పూరంలా హరించి పోయాయి— పోతేంలే. పోయినది పొల్లు, ఉన్నది గట్టిని... మిగిలిన దానిలోంచి కొంత పెట్టి ఒక చిన్న ముద్రణాలయం కొంటాను.'

'ఏం సెలవిచ్చారూ, ముద్రణాలయమా?'

ఔనురా; అచ్చాఫీసు. ప్రచురణసంస్థ ఒకటి ప్రారంభించి, మంచి పుస్తకాలను అచ్చువేయించి అమ్మకం పెడితే జీవితం గడిచిపోదూ?'

'రాణీగారు ఈమాట వింటే నామొహం తగలేస్తారు!'

'సుధ్య నీ మొహం తగలెయ్యడం దేనికి?...సరేకాని ఆవిణ్ణింకా మీరు 'రాణీగారు'నే ఉబ్బేస్తున్నారన్నమాట.'

'అదేమిటి బాబూ అలా సెలవిస్తారు? మానాలికను కోసిపారేస్తే కిందపడ్డాకకూడా అది 'రాణీగారు, రాణీగారు' అనే అంటుంది కాని—'

'చాల్లే తెపు...సమయంచూసి ఆ 'రాణీ' గారికి నా ఆలోచన తెలియచెయ్యి'

రాణీ హేమాయమ్మ రావుగారు మహలు మరామత్తు విషయమే సెలవిచ్చి పంపగా ఆ సంగతిని రాజాగారికి మనవి చేద్దామని వచ్చిన నాయుడికి ఇంక మనవి చేయవలసిన దేదీలేక అతడు దొరగారివద్ద సెలవు తీసుకుని వెళ్లిపోయాడు.

* * *

దివాణం గుమాస్తా సుందరామయ్య భార్య మీనాక్షమ్మ రాణీ హేమాయమ్మారావు గారి ఎదుటపడి, నమస్కారం పెట్టింది.

'ఏమమ్మా; బొత్తిగా కనపడ్డం మానేశావ్?' అని ప్రశ్నించింది రాణీగారు.

'ఐతే మావారు తమతో మనవి చెయ్య లేదండి?' అన్నది మీనాక్షి సవినయంగా.

'ఏమని?'

'మా రెండోపిల్లకి పెళ్లి సంబంధం నిశ్చయమైంది కదండీ? ఆ పనుల్లో మునిగి సతమతమౌతున్నాను.'

'అలాగా? సంతోషం...ఐతే, కాబోయే అల్లుడు చదువూ, వసతీ ఉన్నవాడేనా?'

'ఏదో కొంచెం ఉన్న వాళ్లేనండి.'

'బాగుంది... పెళ్ళి ఎప్పుడు?'

'ఈ పున్నమి వెళ్లిన తదియనాడేనండి. మూఢం వస్తోందని చెప్పి వ్యవధి లేకుండా పెట్టేశారు ముహూర్తం.'

'అలాగా? ఐతే పెళ్లి పనులన్నీ త్వర త్వరగా చేసేసు కోవాలి.'

'అంతా తమ దయ. పెద్దపిల్ల పెళ్ళికి తమరు సాయం చేశారు. అది మేనరికం గనుక కట్నం కానుకలూ ఆట్టే లేకుండా తెమిల్చేశాం. తమరు దయచేసిన బియ్యం, కందులూ, గుమ్మిడిపళ్ళూ, అరటిగెలలూ వగయిరా సామగ్రి సంతర్పణకు కలి సొచ్చింది. ఇప్పుడు ఆ విషయమే మనవి చేసుకుందామని వచ్చానండి'

'నాకు తోచిన సాయమేదో చేస్తాను లెండి,

మీనాక్షమ్మ మొహం చాటంత చేసు కుని, 'తమ సంగతి నాకు తెలుసుగా 'రాణీ హేమాయమ్మారావుగారి చేతికి ఎముక లేదని' మా వారితో నేనెప్పుడూ అంటూనే ఉంటాను. కల్పవృక్షాన్ని ఆశ్రయించుకున్న మాకు లోటేమిటి?' అని వంగి నమస్కరించి, నిష్క్రమించింది.

* * *

పదిరోజులయాక త్రివిక్రమరావ్ బహద్దరు సుందరామయ్యను పిలిచి, 'లంక భూమిని అమ్మగా వచ్చిన పన్నెండువేలూ షావుకారు అప్పుకింద చెల్లు పెట్టించి ప్రామిసరీనోటు తీసుకొచ్చారా?' అని అడిగారు.

'పదివేలే చెల్లు పెట్టించానండి.'

'తక్కిన సొమ్ము ఏం చేశారు మరి?'

'అమ్మగారు కావాలని పుచ్చుకున్నారండి.'

త్రివిక్రమరావ్ నిట్టూరుస్తో 'అంచేత ఆ నోటు బాపతు బుణశేషం ఇంకా ఉన్నదన్నమాట! అది మళ్లీ వింధ్యపర్వతంలా పెరిగిపోతుంది!' అని విసుక్కున్నాడు. 'నేను చెప్పినట్లు ఆ అప్పుచీదాగా చెల్లించి రాక ఇలా చేశారేమిటి?'

సుందరామయ్య వినయంగా, 'నేనం చెయ్యను బాబూ? రాణీగారు కావాలంటే ఇవ్వనని ఎలాగనగలను? పాతికేళ్ల నుండి మీ నౌకరీ చేస్తున్నాను. వారు ఎప్పుడు ఎంతకావాలన్నా తీసి ఇవ్వడమే కాని మరో మామూలు లేదండి మరి. తమరు కూడా ఇందుకు ఎన్నడూ అభ్యంతరం చెప్పలేదు.'

'అది సరేనయ్యా. పరిస్థితులెలా మారి పోయాయో మీకూ తెలుసుగా?'

'చిత్తం. నేనుకూడా అమ్మగారికి ఆ సంగతి చూచాయగా సూచిస్తూనే ఉన్నానండి.'

'సూచించడం కాదు; స్పష్టంగా నే చెప్పాలి' అన్నారు త్రివిక్రమరావ్ గారు.

'చిత్తం. తమరూ వాయూ ఓసారి సంప్రదించుకుంటే ఏ ఇబ్బందీ ఉండదండి.' అని లౌక్యంగా సూచించి సుందరామయ్య సెలవు తీసుకున్నాడు.

* * *

పెండ్లి పనులతో సతమతమౌతోన్న మీనాక్షమ్మ లోపలకు వస్తోన్న భర్తను చూడటంతోనే, 'ఏమండీ, పిల్ల పెళ్లి అన్న ధ్యాసేలేకుండా దివాణంలోనే కూచుంటున్నారే వెళ్లి' అంటూ నిలేసింది.

'కూచోకపోతే ఎలా? నౌకరీయా మరో హటా? నలుగురం పనిచేసేవాళ్ళం. జమీందారుగారు ఒక్కొక్కణ్ణే మానిపించేయడం వల్ల మిగతా ముగ్గురు గుమాస్తాల పనికూడా నా నెత్తినే పడింది' అన్నాడు సుందరామయ్య.

'అదేమిటీ? ఎందుకు మానిపించే శారలా?'

'ఎందుకేమిటి? పరిస్థితులు మారి పోయాయి. వారి వ్యవహారాలు ఓగట్టెక్కేక నేనుకూడా మరోచోట నౌకరీ చూసుకో వలసిందే' అంటూ సుందరామయ్య వసారా కేసి చూశాడు. అక్కడ సామగ్రి కన బడడంతో అతడు మెచ్చుకుంటూ.

'నేను తెస్తానని కూచోకుండా సరుకు లన్నీ తెప్పించేశావన్నమాట! బియ్యంబస్తా ఏనా అది? ఔను కాని ఏకంగా అన్ని గుమ్మిడికాయలు కొన్నావెందుకూ?'

'కొన్నానంటారేమిటి? రాణీగారు పంపించారు'

సుందరామయ్య ఆశ్చర్యపోతో, 'రాణీ గారా? హేమాయమ్మారావుగారే పా?' అన్నాడు,

వారుగాక మరెవరు పంపుతారు? లంక భూములున్న జమీందార్లు గనక మనమీద అభిమానం కొద్దీ ఆ లంకలతో పండిన గుమ్మడివళ్ళనుకూడా పంపేరు.'

'ఇంకా లంక లెక్కడున్నాయి మీనాక్షి?' అంటూ ఆయన నిట్టూర్చాడు. 'రాజా గారు లంకభూమి అంతా అమ్మేశారు!'

'అలాగా? ఐతే ఈ గుమ్మడి వళ్ళెక్కడివి మరి?'

'అదే నేనూ ఆలోచిస్తున్నాను.'

* * *

రాజాగారు చెప్పమన్న విషయం రాణీ గారికి మనవి చెయ్యడానికి గౌరునాయుడు ఆనాటినుంచి ఎన్నిసార్లో వెళ్ళి చూశాడు కాని, వీలు చిక్కిందేకాదు. ఆశ్రితు లెవ రైనా ఉండడమో లేక అతడు ఎదుట పడడంతోనే రాణిగారు ఏదో పని పురమా యించి పంపెయ్యడమో జరిగేది. దరి మిలా ఆమె మనవరాలి బారసాలకు వెళ్ళ వలసొచ్చింది. సుందరరామయ్య యింట కూడా శుభకార్యం జరిగింది కాని నాయు డికి స్వామికార్యం అలాగే ఉండిపోయింది. ఆనాడెలాగైనా రాజాగారి సందేశాన్ని రాణీ గారికి అందించి తీరాలన్న నిశ్చయంతో ఆ సేవకుడు బయల్దేరేడు. కాని గౌరన్నను చూసీ చూడటంతోనే ఆమె 'నాయుడూ సుందరరామయ్యగారికి ఇలాంటి బుద్ధి పుట్టిందేమిటి?' అన్నది.

'ఏమిటండమ్మగారూ?'

'సొమ్ము కావాలంటే 'లేదు' అనే వాడు!'

ఆ అదును చూసుకుని నాయుడు రాజాగారు చెప్పమన్నది చెప్పేసి, గుమాస్తాగారి తప్పేమీ లేదని సూచిస్తే తీరిపోను. కాని ఏ యెండ కాగొడుగు పట్టే నైజం ఆ ఖాసావానిలో తలయెత్తి రాణీగారిని సంతోషపెట్టాలన్న ధోరణిలో 'వీసుకు పెత్తనమిస్తే ఏమవుతుందండి మరి?' అంటూ గుమాస్తామీదే దెబ్బ వేశాడు!

'ఈయన కెవరిచ్చారు పెత్తనం?'

'ఎవరిస్తారు? మా దొరగారే. వారి కెవడం దేనికి లెండి. తమరుమాత్రం పొతుకు పాలుపొయ్యడం లేదూ?'

'ఏమిటి నాయుడూ నువ్వనేది? ఎవరి క్కూలు?'

# మాణిక్యమహల్

'గుమాస్తాగారి మాటేమండమ్మ రూ' ఆనాడు బజారులో బియ్యం, పప్పులూ, గుమ్మడికాయలూ—సమస్తం నాచేత కొని పించి పెళ్ళికని ఆయనింటికి మోయిం చారు కదూ తమరు?'

ఆమె నాలిక కరుచుకుని, మీనా క్షమ్మతో అవన్నీ 'అంగడిలో కొని తెచ్చిన వని చెప్పలేదు కదా నువ్వు కొంపదీసి?' అన్నది.

'నేనెందుకు చెపుతాన్లెండి. కాని 'పని కట్టుకుని అలా పంపడం ఎందుకూ?' అని మనవి చేస్తున్నానంతే.'

'ఎందుకేమిటి నాయుడూ? ఆశ్ర

## ఓం నమః శివాయ

కం॥ హరుని నిరంతర నిరత
హాయిగా మానసిక శివుని
పూజింతున్
హిమగిరి నా వాడే
హీనను కాను హరుడే హర్షించి
దీవించున్॥

కం॥ హుంకరించడు, కడుతృప్తుడున్
హూతనాథుడు, సంభూతుడు,
సర్వోత్తముడు
హృదయేశునికి నర్పింతు
హౄనుథామ పదయు హృదయ
సదానందుడున్॥

కం॥ హెద స్మిద స్వాంత స్వతంత్రుడు
హేతువేమని యడుగడు అద్భుత
ఆనందుడు
హైందవ ముఖ్య దేవుడున్
హొయ్య లెరుగడు, హింసింపడు,
హితుడు మిత్రుడెప్పుడున్॥

కం॥ హోదాలేని నిరర్థక
హౌలదారుడు శంకరు డుండ
శంకింపనేనయ్య
హంసనుగాను, ఉవిదను
హః హ నేనెంత ధన్యను,
దిగంబరుని దాసిన్॥

రచయిత్రి : శ్రీమతి సరస్వతీగిరి.

యించుకున్న వాళ్ళకి చెయ్యకపోతే ఎలా మరి? ఇంతకీ, చేసింది చెప్పకూడదు. నువ్వెక్కడా అనకు సుమా' అన్నదామె.

అంతలో జమీందారుగారే అక్కడకు వచ్చారు. 'దొరగారు దయచేస్తున్నారు' అని చెప్పి, నాయుడు తనువచ్చిన పని నెరవేర్చకుండానే పోవలసి వచ్చింది.

త్రివిక్రమ రావ్ బహద్దరు హేమా యమ్మారావుతో, 'మనం కొన్ని సంగతులు మాట్లాడుకోవాలి' అన్నారు.

'ఏమిటవి ?'

'మన దేవిడీలో ఖర్చులెక్కువై పోతు న్నాయి.'

'పదిమంది ఉన్న కుటుంబంలో ఖర్చు లుండవూ?'

'ఉండవనికాదు; జను తగ్గినకొద్దీ ఖర్చు కూడా తగ్గాలి.'

'తగ్గించేస్తున్నాంగ ?'

'నేను గుర్రాలను అమ్మేశాను. జాగీరా లను వదుల్చుకున్నాను. నౌకర్లనీ, గుమాస్తాలనూ ఒక్కొక్కరినే మానిపిం చేస్తున్నాను. కాని ఏం లాభం? నేను ఎంత కూడికచేసినా ఖర్చు అలాగే ఉంటిపోతోంది!'

'నన్నేం చెయ్యమన్నారు చెప్పండి' అన్నది హేమాయమ్మారావుగారు.

త్రివిక్రమరావు బహద్దరు సీరియస్గా, 'ఆమధ్య గుమాస్తాగారి నడిగి తీసుకున్న రెండువేలూకాక మళ్ళీ సొమ్ము కావాలన్నా రుట దేనికి? ఏ గంగలో కలిపిందా సొమ్మంతా?' అని ప్రశ్నించారు.

ఆమె, 'అంతా' అంటున్నారు, ఎంత? రెండువేలే కదా? పెద్దబ్బాయి కొడుకు బారసాలకి వెయ్యి రూపాయలిచ్చి వజ్రపు టుంగరం చేయించి పట్టుకువెళ్ళేను జ్ఞాపక ముందా?' అన్నది.

'ఇప్పుడు మనవరాలి బారసాలకుకూడా అంతా ఖర్చుపెట్టి చక్కావచ్చారన్నమాట!'

'అంతా ఎంతండీ? ఖర్చులన్నీ అదుపు లోకి తెచ్చుకోవాలని నాకుమాత్రం తెలి యదూ? అందుకే అసలు వెళ్ళడమే మానేద్దామనుకున్నాను. తీరా వెళ్ళేసరికి మనవరాలికి వాళ్ళు నాపేరు పెట్టేరు.'

'పేరు పెట్టడంలో తమరు మెత్తబడి పోయారన్నమాట!'

'మెత్తబడడానికి ఏముంది? 'తమ పేరు పెట్టేరు, మనవరాలికేం బహుమతి ఇచ్చా

రమ్మిగాదూ?' అంటే ఏం చెప్పను? తాహతుకు తగ్గట్టు చెయ్యాలికాని మొండి చెయ్యి చూపించి రావటం ఎలాగ?'

'తాహతు, తాహతు!' ఏమిటా తాహతు?' అంటూ చిరాకును ప్రదర్శించారు రావ్‌బహద్దరు.

హేమాయమ్మారావుగారు నిర్ఘాంత పోయింది.

'తమరీవేళ ఇలా మాట్లాడుతున్నారేమిటి?' అని అడిగింది. ఆయన సర్దుకుని మర్యాదగానే, 'చూడండీ, ఆ ప్రహరీగోడ గచ్చు పోవడంతోనే ఒక్కొక్క ఇటుకే ఎలా ఊడివస్తోందో' అన్నారు.

'నాయుడుతో చెప్పేను మరామత్తు చేయించ వలసిందిగా తమతో మనవి చేయమని.'

'నేను చెప్పదలచినదదికాదు. ఒక్కొక్క ఇటుకే ఊడిపోతే కోటగోడలా ఉన్న ఆ ప్రహరీ నామరూపాలేకుండా పోయినట్లే మనం జాగ్రత్త పడకపోతే మన సంసారం కూడా శిథిలమైపోతుంది.'

'ఇలాంటి అవాచ్యపు మాటలు అనుకోకూడదు.'

'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. యదార్థాన్ని చూడమంటే కళ్ళు మూసుకుంటే ఎలాగ?'

'నేనేం కళ్ళు మూసుకున్నాను? తమరు ఎలా చెపుతే అలాగనే చేస్తాను.'

'ఈ గోడకూ మేడకూ మరామత్తు చేయించడం మన సాధ్యంకాదు. ఈ భవంతిని అమ్మేస్తే కొన్నవాళ్ళు బాగుచేయించి విలవెడతారు.'

ఆమె నిర్ఘాంతపోయింది. 'ఏమిటి తమరనేది? అమ్మేశాక ఎక్కడుందామని?'

'మరో ఊరుపోయి, ఉండవచ్చు.'

'జన్మభూమిని వదిలేసిపోవడమా? ... 'ఇదేం ఆలోచన?' అన్నట్టుగా చూసిందామె. 'తమకీ ఆలోచన ఆ గుమాస్తాగారు చెప్పేడా?'

'మధ్య ఆయనను అనడందేనికి?' మళ్ళీ సొమ్ముకావాలంటే ఇవ్వనన్నాడనా?'...... త్రివిక్రమరావు చిరాకు హెచ్చింది. 'ఖజానాలో రూపాయిలచెట్టు కాస్తోందనా తమ ఉద్దేశం? బంగారం పెట్టే బొత్తు ఏనాడో వచ్చిపోయిందన్న సంగతి గుర్తించడంలేదు తమరు ఇంకా!' అన్నాడాయన.

కోపంలోకూడా భార్యను మన్నించడం మరవలేదా జమీందారు. హేమాయమ్మారావుగారికది వెటకారంగానే తోచింది. ఆమె గద్గదికతో. 'ఎందుకూ తమకీ చిరాకు? ఇంతకూ నేనుచేసిన నేరమేమిటి?' అంటూ మొదటికొచ్చింది మళ్ళీ.

* * *

త్రివిక్రమరావు బహద్దరు వారు మాణిక్యమహల్ వగైరా విక్రయించి మరో చోటుకుపోయి పొదుపుగా కొత్త జీవితం ప్రారంభించాలన్న ప్రసక్తితెస్తూనే ఉన్నారు. కాని సంభాషణ ఎప్పుడూ అనుకోనివిధంగా ముగిసి ఆయనకు చిరాకూ, హేమాయమ్మారావుగారికి గద్గదికా వచ్చేవేకాని ఆయన ఆశించిన ఫలితం కనపడలేదు. కళ్ళెంలేని గుర్రాలవలె ఖర్చులు పరిగెడుతూనే ఉన్నాయి.

పెళ్ళియి కాపురానికి వెళ్ళిన గుమాస్తాగారి రెండవ కుమార్తె చూలింతయ్యి ఏడవనెలలో పుట్టింటికివచ్చింది.

సుందరరామయ్య మీనాక్షమ్మ ఇచ్చిన కజ్జికాయను భక్షిస్తూ, 'గోనాపూర్ణం పెట్టేరు లోపల. నేతితో చేసినవిలాగ ఉన్నాయి వియ్యాలవారింటినుండి అమ్మాయి తెచ్చినవా?' అని ప్రశ్నించాడు.

మీనాక్షమ్మ, 'మన వియ్యాలవారి మొహానికి నేతి పిండివంటలు కూడానా?' అంటూ ఈసడించింది, 'మా అమ్మాయిని తీసుకోవ్వామని చెపితే హేమాయమ్మారావు గారు నూడిద పంపించారు' అని అసలు సంగతి బయటపెట్టింది.

'ఆవిడ పాపం మనలను ఎప్పుడూ మరిచిపోటంలేదు' అన్నాడు సుందరరామయ్య,

'మనల్నేమిటి? ఎవర్నీ మరచిపోరు రాణీగారు.'

* * *

మరికొన్ని నెలలు గడిచాయి. త్రివిక్రమరావు బహద్దరొకనాడు ఒక ఉత్తరాన్ని చేతపట్టుకుని లోపలకు వచ్చారు.

'ఎక్కణ్ణుంచండీ జాబు?' అని అడిగేరు హేమాయమ్మారావుగారు.

'వియ్యాలవారు రాయించారు. సపరివారంగా రామేశ్వరయాత్రకు వెళుతున్నారుట. దారిలో ఇవతెల్నుండి ఉదయానికి రైల్లో దిగి మన యింటికి వేంచేస్తున్నారు.'

ఆమె, 'బాగుంది; రాక రాక ఇన్నాళ్ళకు వస్తున్నారు.' అన్నది.

'పరంతా సిబ్బందితో దిగుతున్నారంటే తమకు సంతోషంగానే ఉన్నదన్నమాట!' అన్నారు మాజీ జమీందారు.

ఆమె నిర్ఘాంతపోతో 'అదేమిటి అలా అంటున్నారు. తమకు మాత్రం ఆనందం



## మాణిక్యమహల్

కాదూ?' అన్నది.

'పూర్వపు రోజులలో ఐతే నాకూ సంతోషమే. కాని సపరివారంగా వస్తోన్న ఆ విశ్వామిత్ర మహారాజును విందులతో తృప్తి పరచడానికిప్పుడు నా వద్ద కామ ధేనువు వట్టి పోయింది!'

'ఏమిటి తమరనేది?' అన్నదామె.

'వినండి. మనం కూడా ఏ క్షేత్రానికో వెడదాం. ఈ సాయంత్రమే బయల్దేరుతే సరిపోతుంది. ఆవలెల్లుండి సుందరరామయ్య రైలుస్టేషనుకు వెళ్ళి, వియ్యాలవారు సామాన్లను ప్లాట్‌ఫారం మీదకు దించ కుండానే మనం ఉభయులం కూడా ఊళ్ళో లేమని'ని చెప్పేస్తాడు — అంతకన్నా మెరుగైన ఆలోచన కూడా తట్టుతోంది. ఆవలెల్లుండి దాకా ఆగడం కాకుండా, ఇప్పుడే ఓ టెలిగ్రాం ఇప్పిస్తే తీరి పోతుంది ఊళ్ళో లేమని. మనం ఎక్కడికీ కదలనే అక్కర్లేదు. కేవలం అబద్ధమాడి నట్లవుతుందని తోస్తే దగ్గరగా ఉన్న అన్నవరమో, సింహాచలమో చూచి రావచ్చు.' అన్నాడాయన.

ఆమె పెదవి విరుస్తూ, 'ఏమాలోచ నండీ ఇది? ఇంత బ్రతుకూ బ్రతికి చివరకు ఇదా మర్యాద?' అన్నది.

'మర్యాద కాదని తెలుసు. కాని వారిని ఇంటిమీదకు రప్పించుకుని మన బండారం బయటపెట్టుకునే కన్న ఇది నయం కాదూ?' అన్నారాయన.

ఆమెకు నచ్చలేదు. 'మనకు వచ్చిన లోపమేమిటండీ?' అనేసిందామె.

అనుకున్ననాటికి వియ్యాలవారు దిగేరు. త్రివిక్రమరావు బహద్దరు సుందర రామయ్య, నౌకరునాయుళ్ళతో స్టేషనుకు వెళ్ళి స్వాగతమిచ్చారు. ఆయన అంతకు పూర్వం పనిలో నుండి మానిపించేసిన నౌకర్లనందరినీ హేమాయమ్మారావుగారు కబురుచేసి రప్పించింది. మాణిక్య మహలు పూర్వ వైభవంతో ఒక్కసారి వెలిగింది మళ్ళీ. హేమాయమ్మారావుగారు వియ్యాల వారిని వెడతామన్నరోజున వెళ్ళనిచ్చింది కాదు. 'రాక రాక దయచేశారు! ఇదేం పరాయిచోటు కదా కదా' అంటూ పట్టు పట్టి ఆపేసింది. వియ్యాలవారికే కాక వారితో వచ్చిన కాపులకు కూడా కొత్త బట్టలు పెట్టి పంపితే కాని ఆమెకు తృప్తిగా లేదు.

వియ్యాలవారు వెళ్ళేక సుందరరామయ్య, 'ఏం నాయుడూ, చీటికీ మాటికీ పచ్చనోట్లు తెచ్చి మార్చేవాడివి; అంత సొమ్మూ ఎక్కడిది?' అని ప్రశ్నించాడు.

'లోని గుట్టు పెరుమాళ్ల కెరుక' అన్న సామ్యం ఎరుగవు గనకనా?' అన్నాడు నాయుడు నర్మగర్భంగా.

'అమ్మగారు జవహరీలోంచి తీసి ఇచ్చి అమ్మెయ్యమన్నారేమిటి కొంపతీసి?' అన్నాడు సుందరరామయ్య.

'మెల్లిగా మాట్లాడవయ్యా. నగ అమ్మేనని తెలిస్తే దొరగారు నా బుర్ర తీయించేస్తారు!'

'ఆ మాత్రం ఆయన ఊహించుకో లేరనా, నాయుడూ?...అమధ్య దొరగా రేమన్నారో తెలుసా?'

'చెప్పండి.'

'ఏ ఈతగాడూ కూడా మునిగిపోతున్న వాళ్ల సహకారం లేకపోతే వాళ్ళను రక్షించలేడు సరికదా, వాళ్ల చేతగానితనం వల్ల తను కూడా మునిగిపోతాడు!' అన్నారు.'

'నిజమే. దొరగారు కోరినట్లు అమ్మగారు ఆదా చెయ్యలేక పోతున్నారు. తిర్చే నోరూ, తిరిగే కాలూ' అలాగే 'పెట్టే చెయ్యి' కూడా ఊరుకోలేదు మరి.' అన్నాడు నాయుడు.

* * *

కవులమనీ పండితులమనీ, ఉద్దాం పద్యులమనీ ఘనాపాఠీలమనీ చెప్పు కుంటూ రాజాగారి ధర్మానానికి వచ్చిన వారిని సుందరరామయ్యే పంపివేస్తూ ఉండే వాడు, పెరటిగుమ్మాన వెళ్ళి హేమా యమ్మారావుగారిని చూసినవారికి మాత్రం తృణమో, పణమో ముడుతోనే ఉండేది.

ఒకనాడు పుస్తకం ఒకటి పోస్టులో బంగీగా వచ్చింది. అమ్మగారికని తెలియక నాయుడు పార్సిలు విప్పి గ్రంథాన్ని త్రివిక్రమరావుబహద్దరు బల్లమీద పెట్టేడు. ఆయన యాధాలాభంగా అట్ట తెరిచి చూసేసరికి శ్రీ శ్రీ శ్రీ రాణీ హేమాయమ్మారావు వారికి కృతిని సమ

ర్పించినట్లుగా ఉంది. ఆమె గ్రంథాన్ని అచ్చువేయించుకోడానికిచ్చిన భూరివిరాళం పీఠికలో పేర్కొనబడింది.

కోవెలముందు కోనేటికి పావంచాలు నిర్మించారు. గచ్చుమెట్లకైన సొమ్ము రాణీగారినుండియే లభించిందన్న సంగతి కూడా రాజాగారి చెవినిపడింది.

మళ్లీ ఓసారి చెప్పిచూద్దామని ఆయన ఒకనాడామెతో, 'సీతా సావిత్రీ, చంద్రమతి దమయంతి — వీరి చరిత్రలన్నీ తమకు తెలుసుకదా' అన్నారు.

'ఇప్పుడు వాళ్ల ప్రసక్తి ఎందుకొచ్చింది?'

'వాళ్ల కథలన్నీ వినడమేకాని వారిలో ఒక్కర్నీ అనుసరించలేకపోయారు తమరు?'

'తమ మాటలేమిటో అర్థం కావటం లేదు నాకు.'

'పట్టాభిషేకానికి సిద్ధమైయున్న సీతాదేవి పరిస్థితి మారిందని తెలియడంతోనే పట్టుచీరలు వదిలి నారబట్టలతో బయల్దేరింది. తమరుమాత్రం నాసలహా చెవిని పెట్టేరుకాదు. ఈ పూవులమ్మిన చోటు వదలి బైటపడదామంటే నచ్చింది కాదు తమకి.' అన్నారాయన.

ఆమె ఏం సమాధానమిచ్చేదో కాని అంతలో నాయుడు ఒక కుండ పిడతను పట్టుకుని ఆఫీసు హాలువైపుకు పోతో కనపడ్డాడు.

'అదేమిటి నాయుడూ?'

'తారు దొరా. గుమాస్తాగారు రాసుకుంటోంటే పైదూలంనుండి చెదపురుగుల తుట్ట వచ్చి బిట్టామీదపడిందండి. ఆ దూలానికి పట్టిద్దామని పట్టుకెడుతున్నాను' అన్నాడు నాయుడు.

'ఆకాశం విరిగిపడుతోంటే చాతకపక్షులు ఆపగలవా నాయుడూ? ఈతారుతో ఆచెద వదిలేదనా ఉద్దేశం? నేను అప్పులనుండి విముక్తి పొందడం ఎలా అసాధ్యమో ఆ దూలాలు చెదను వదల్చుకోడంకూడా—'

హేమారాయమ్మారావుగారు వింటూ ఊరుకుంటే తీరిపోను. కాని ఆమె, 'మరామత్తు చేయించండి అంటే చేయించారు కాదు' అన్నది.

ఆయనకు ఒడలు తెలియనంతగా కోపం వచ్చింది. అదివరలో ఎన్నడూ సంబోధించని విధంగా, 'ఛీ, మూర్ఖురాలా! మహలు మరామత్తు అంటూనే అందరికీ తలకో కట్టుకాపీకి పంచి పెడుతున్నావ్?' అన్నా

# మాణిక్యమహల్

రాయన స్మరుక్షణంలో.

నౌకరు ఎదురుగా ఉన్నాడన్న సంగతి గుర్తుకొచ్చి, 'ఇంత అసభ్యంగా ప్రవర్తించానేంటి?' అన్న దిగులుతో అక్కడ నుంచి వెళ్ళిపోయారు

ఆయన ఆఫీసు గదిని ప్రవేశించే సరికి సుందర్రామయ్య టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాడు. రిసీవరు పెట్టేశాక, 'ఎవరండీ?' అని ప్రశ్నించారాయన,

మార్వాడీ జీవన్‌లాల్ వద్ద నుంచి రాణీగారు సొమ్ము తెప్పించారుటండీ చెల్లు పెట్టించమంటున్నాడు.' అన్నాడు సుందర్రామయ్య

'శభాష్, ఉన్న అప్పులు చాలక వారు కూడా నాపేరట ఋణాలు చేస్తున్నారన్న మాట! అహ్హహ్హా! చెడిన కాపురానికి ముప్పేమిటి గనక? వెయ్యనిండి పోనుగాని సుందర్రామయ్యగారూ, మీకు ఎన్ని నెలల జీతం బకాయిపడింది?' అన్నారాయన.

'ఇప్పుడా ప్రసక్తి దేనికిలెండి'

అంతలో నాయుడక్కడకు రావడం జరిగి ఆయన, 'గౌరన్నా, నీ బాకీ కూడా ఎంతో చెప్పు' అన్నారు

'ఇన్నాళ్ళూ తమ ఉప్పు తిని బతికేము. నాకు బాకీ యేమిటి దొరా? ఎన్ని జన్మలైనా తమ ఋణం తీర్చుకోగలనా ప్రభూ?' అన్నాడు నాయుడు.

'ఇంకా 'ప్రభూ' అంటూనే వున్నావురా మువ్వు? ఎండి మోడై పిట్టలెగిరిపోయిన చెట్టులా వున్న నన్ను పట్టులాగ ఇంకా మీరిద్దరూ అంటిపెట్టుకునే ఉన్నారు .. మాతోబాటు మీరు కూడా నాశనమైపోక వెళ్ళి మరోచోట నౌకరీ చూసుకోండి ... సుందర్రామయ్యగారూ, మొన్న ఫర్నిచరు కొంటానని వచ్చినవాడితో, మరీ తక్కువకడిగేడని బేరం కుదరక, పొమ్మన్నాను వాడికి కబురుచేసి ఎంత ఇస్తే అంతే పుచ్చుకుని ఆ సొమ్ము లోంచి మీ జీతం బకాయిలు చెల్లుపెట్టుకోండి' .. అన్నారాయన

* * *

లారీలలో ఫర్నిచరు తీసుకుపోవడంతో మాణిక్యమహలు అలంకారాలు తీసివేసిన ముసలి ముత్తయిదువలా కనపడింది.

దరిమిలా మూడునాళ్ళపాటు తెరిపి లేకుండా వర్షం కురిసింది ప్రహారీలో దక్షిణభాగం కూలిపోయి మెరక నీరంతా యేర్పై వచ్చి మహలును కోనేటి నడుమ మండపంలా మార్చివేసింది గౌరునాయుడి నాయనమ్మ తన యెనభై యేళ్ళ జీవితంలో కోటలో అంతగా నీరు నిలవడం ఎన్నడూ చూడలేదంది.

వాల్గవ రోజు ఉదయానికి కొంత నీరు తియ్యడంతో సింహద్వారం వరకూగల మెరకరోడ్డుమాత్రం, యేటిలో సగం మునిగి ఉన్న మొసలి వీపులాగ పైకి కనపడుతోంది.

'ఈవరదకు ఎక్కడెక్కడి పాములూ జంతువులూ కొట్టుకొస్తున్నాయండి నీరు తీసి తేమపోయేవరకూ మరెక్కడికైనా మారడం మంచిదేమోనంది' అని సూచించాడు సుందర్రామయ్య.

'ఇక్కడినుండి ఏకంగానే మారిపోవాలని ఏనాడో అనుకున్నాము' అన్నారు త్రివిక్రమరావుగారు

ఆయన కోటగుమ్మంవైపు యథాలాపంగ చూసి, 'వాళ్ళంతా ఎవరు?' అన్నారు.

ఆ గుంపులో ముందున్నవాడు మార్వాడీ జీవన్‌లాల్ అని ఆయనే గుర్తుపట్టేరు తక్కిన వాళ్ళెవరో కూడా గ్రహించి, 'కుళ్ళిపోతోన్న శవాన్ని పసికట్టేటట్టున్నాయి రాంబందులు!' అన్నారు

'ఫర్నిచరును చీకటిపడ్డాక తీసుకు వెళ్ళండి' అంటే ఆ లారీవాళ్ళు వినిపించుకున్నారుకాదు దొరా' అన్నాడు నాయుడు.

'లారీలలోపోతోన్న సామాను మాడ్డంతో అనుమానం కలిగి, మిగిలిందేదో దక్కించుకుందామని వస్తున్నట్టున్నారు షావుకార్లంతా నేను అనుకున్నట్టు జరిపి ఉంటే పైసలతోసహా అప్పులన్నీ వీళ్ళచేత చెల్లుపెట్టించడమేకాకుండా, మిగిలిన సొమ్ముతో మాకు లోటులేకుండా కాలక్షేపం—

ఆ క్షణంలో కొండవిరిగి పడ్డంత చప్పుడై ఆయన వెనక్కి తిరిగేరు. రాళ్ళూ పెంకులూ జరజరా జారుతూ కనబడ్డాయి 'అమ్మగారు లోన ఉండిపోయినట్టున్నారు!' అంటూ అదుర్దాగా అరిచాడు నాయుడు త్రివిక్రమరావుగారు అంతఃపురంలోకి బాణంలా పరుగెత్తి వెళ్ళేరు. ఆయనను రానిచ్చి పై కప్పు కూడా కూలి పడిపోయింది. మహాలు సమాధిగా మారిపోయింది! ●



ఈనెల 4వ తేదీన ప్రధానమంత్రి తిరుపతివెళ్ళి శ్రీ వెంకటేశ్వరస్వామిని దర్శించారు. తీర్థాన్ని అందుకుంటున్న శ్రీమతి గాంధిని చిత్రంలో చూడవచ్చు.

**కె. ఎస్. డి, సికింద్రాబాదు**

ఆడవాళ్ళను తాటక శూర్పణఖలుగా చిత్రించి వారికి కోపం వచ్చినప్పుడు అప్పడాల కర్రలతోను, గరిటెలతోను భర్తల గుండులమీద టపీమని కొట్టడము ఆ సదరు గుండులు తిరుపతి గోపురాల్లాగా ఉబ్బటములాంటి కార్టూనులు యీమధ్య ఎక్కువై పోతున్నాయి.

చేసేదేం వుంది స్వప్నాదేవి, అవి మగవారి తీరని కోరికలు

**టి. ఎస్. ఎస్. ?**

మీరు యింతటి సామర్థ్యము వీలా సంపాదించారో ఆ చిదంబర రహస్యం కాస్త చెప్పవలయునని కోరుతున్నాను,

కష్టపడి పనిచేసి— సంపాదించిన అనుభవాన్ని అనుభవమే అనాలి. చిదంబర రహస్యం కాదు.

**పి. డి. ఎస్, హైద్రాబాదు**

న్యాయంలేని రాజ్యానికి మిమ్మలను రాణీచేస్తే మీరు పాలించ కలరా ?

మహారాజులాగా లాస్ ఆఫ్ ది వైల్డ్ను అమలు పరిచేస్తా. త్వరగా ఆ రాజ్యంలో నాకు రాణి చెయ్యండి దొరస్వామిగారూ. కిరీటం సిద్ధంగా ఉంది

**బి. ఎస్. ఆర్, బి. ఎస్. బి, కోహీరు**

నాటి రాజులడబ్బు రాళ్ళపాలు. మరి నేటి మంత్రులడబ్బు ?

ఎన్నికల పాలు.

**రాంబాబు, ఎలమంచిలి**

'వివాహాలు స్వర్గంలోనే జరుగుతాయి.' అంటారు ఎంతవరకు నిజం ?

పూర్తిగానిజం. అంతేకాదు. అవి కొనసాగడం నరకంలో అన్నది కూడా నిజం!

**ఎ. వి. ఆర్. ప్రొద్దుటూరు**

మనిషి మాటపై నిలబడడు. ఎందుకని?

కాలూని నిలబడ్డానికి స్థలమేది—మాటమీద! అరవసరంగా శ్రమపడాలని కొంచెం విశాలమైన అబద్ధం మీద హాయిగా నిలబడుతాడు.

**డి. ఎస్. ఎన్, కలికిరి**

పుట్టినింటి నుంచి వివాహమై అత్త యింటి కేగిన ఆడపడుచు తాను నెరవేర్చ వలసిన కర్తవ్యమేమిటి? అత్తమామల సేవా? భర్త సుఖమా? ఆడుగుపోరుగుల ఆదరణా?

కొత్తపెళ్ళికూతురు తిరిగనాటిన మొక్కలాంటిది నాకీ వడలిపోకుండా కొత్త చిగుళ్ళు తొడగాలంటే —అత్తమామలూ, భర్త యిరుగూపొరుగూ కూడా దోహదం కల్పించాలి. అత్తమామల సేవకోసమే కాదు కోడలు. భర్తసుఖం కోసమేకాదు—పెళ్ళాం. ఇరుగుపొరుగుల మెప్పుకోసమేకాదు—సంసారం...




**బి. ఎమ్. డి, కొవ్వూరు**

బహుమతులు అడిగే వారిని ఏమనాలి?

గ్రహించి యివ్వటంలో ఎంతో అందం ఉంది—అడిగాక యిచ్చినదానికంటే. నిజానికి అడిగితేయివ్వనే అక్కరలేదు—సారీ అంటే చాలు!

**ఎస్. ఆర్. డి, గుంటూరు**

కొత్త రచయితలను ప్రోత్సహించ డానికి పత్రికలవారు ఎంతవరకు కృషి చేస్తున్నారు ?

సాధ్యమైనంత వరకూ!

ఒక రచయిత ఒకదానికంటే ఎక్కువ ఆర్టికల్స్ ఒకే కవరులో పంపితే అంగీక రిస్తారా ?

అంగీకరిస్తారు— అదనపు పోస్టేజి కట్టుకోవలసి రాకపోతే. అంచేత తగిన బరువుకు తగిన తపాలా బిళ్ళలు అంటించండి!

**పి, ఔవూరు**

నేను మాట్లాడిన ప్రతిమాటా తనను విమర్శించేనని తనమీద పెట్టుకుని వాద నకు దిగుతూ వుంటుంది.

ఏం లేదు— లోచని ఆడవాళ్ళంతా చేసే పనే అది.

**జి. ఎ, సిరిసిల్లా**

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు మూగవారని విన్నాను నిజమేనా ?

నిజమే. అయితేనేం! వారు మానసికంగా నిత్య యవ్వనులు. సౌందర్యోపాసి. వెండి జుట్టులో తెల్లని వస్త్రాలతో ఎవరినైనా యిట్టే ఆకర్షిస్తారు.

**వి. వి. ఎల్. పొందూరు**

వివాహానికి ముందు సహనాంకి రాణిగా ఉండే యువతి వివాహానంతరం సౌఖరాణి అవుతుంది ఎందుచేత?

కళ్ళ పొరలు కాస్తా జారి, కాళ్ళు నేలకి ఆనుతాయి కదా— అందుచేత. జీవిత వాస్తవాలను కున్న కుర్రాడు తిరా భార్య వస్తే హాయిగా వాకిలికి నియోగిస్తాడు. అన్నపానాదుల కుండే ప్రాముఖ్యత సంసారంలో పడ్డాక— దాంపత్యజీవితమూ, నిత్య నూతనమూ అయిన ప్రేమకి ఉండదు. అంచేత పెళ్లి తరవాత కూడా భార్యాభర్తలు ప్రేమికుల్లా ఉండగలగాలంటే ఒక్కటే మార్గం— ఎవరి వ్యక్తిత్వాన్ని ఎవరి ప్రత్యేకతలని వారు నిలుపుకొంటూ ఒకరి మీద ఒకరికి గౌరవంతో బాటు, ఒకరితో ఒకరికి స్నేహం కూడా ఉంచుకోగల్గాలి. అదేమంత సులభం కాదు

**జె. కె. వి; విశాఖపట్నం**

ఆశావాది ఎవరు?

'నేనొకరు మాటగా చెప్పేదేమిటంటే' అని ఉపన్యాసకుడు అంటూంటే గబగబా జోళ్ళు తొడుక్కుని వెళ్లడానికి సిద్ధపడేవాడు.

**అరుణకుమార్ కర్నూలు**

ఆడవారిని 'వీకర్ సెక్సు'గా చెప్పుకుంటారు. ఎందువలన?

ఎవరండీ అలా చెప్పుకుంటున్నది?

**ఎన్. ఆర్. ఎస్. తాళ్ళప్రొద్దుటూరు**

నిజానికి విలువలేదు. అబద్ధానికీ ఉంటుంది అంటారు యీ కాలంలో. ఎందుచేత ?

అబద్ధం నమ్మినంత సులభంగా నిజాన్నెలాగ నమ్మేయడం సార్? నిజానిది సీలగొంతుక. అబద్ధానిది కంచుకంఠం కదా?

**డి. జె. ఆర్. విజయవాడ**

తెలివి తేటలకి నిర్వచనం ఏమిటి?

చేతకాని తనాన్ని, అజ్ఞానాన్నీ కవర్ చేసేవేనంటే తెలివితేటలంటే.

**పి. ఎస్. ఆర్. విశాఖపట్నం**

అభ్యుదయ వాదులు, విప్లవ వాదులు' కమ్యూనిస్టులు, సోషలిస్టులు, వీరంతా సామాన్యుని కేం చేస్తారు ? ఏం చేశారు?

దెవిల్డు ఎనిథింగ్ ఫర్ ది వర్కర్, బట్, వికమ్ ఒన్!!

**కే. ఆర్, కె.ఎస్, కె.జె.కె.ఎ, కాజాలు**

జీవితంలో విజమైనతోడు ఏది?

ఉత్సాహం, అది చస్తే యింకే బరువులూ మోయలేం—యీ ప్రపంచంలో.

**సి హెచ్. సిహెచ్. ఆర్. విశాఖపట్నం**

స్వేచ్ఛ స్వతంత్రం, హక్కులూ అంటూ అరుస్తారేగాని ఎదుటివారికీ అవి వుంటాయని యీ కాకిగోలచేసేవారు ఎందుకు గ్రహించలేరు?

ఎవరికైనా సరే, వ్యక్తిగత స్వేచ్ఛకి అంతులేదు— కాని ఎంత దాకా?— 'నువ్వు ఎదుటి వాళ్లకి న్యూసెన్సుగా తయారు కానంత వరకే' నన్న సంగతి కూడా, యీ కాకిగోల చేసే స్లోగన్‌మాంగర్స్ గ్రహిస్తే బాగుండును! ●

సీరియల్

# గూడు చేరిన పక్షులు





యర్రం చంద్రశేఖరం

### జరిగిన కథ

లక్షాధికారి గారాల ముద్దుబిడ్డ శశిరేఖ. తండ్రి ఆదరంతో తనతోపాటే మెడిసిన్ చదువుతున్న ప్రసాదును ప్రేమిస్తుంది. యుద్ధరంగంలో సైనికుల చికిత్సకోసం ప్రసాదు వెళ్ళాడు. విరహంతో తల్లడిల్లుతున్న శశిరేఖను స్నేహితురాలు వాణి అనునయిస్తుంది. వాణికి శశిరేఖ రహస్యమంతా తెలుసు. అందుకే ఆమెని ఎగతాళి పట్టించింది. రేఖ గురించి ఆలోచించుకుంటూంటే ఆనాటి పెళ్ళిచూపుల తతంగం జ్ఞాపకం వచ్చింది. తలుచుకుని బాధపడ్డాడు ప్రసాద్. రేఖతో తన పెళ్ళి నిశ్చయమై పోయిందని తలచుకుని మురిసిపోయాడు. సూర్యం ప్రసాద్ తమ్ముడే. అతను జబ్బుతో తీసుకుంటూ హాస్పిటల్‌లో జాయినయాడు. సూర్యం అన్నగారు దగ్గర లేకపోవడంతో ఎలా చెడిపోయిందీ తలచుకుని బాధపడ్డాడు. తండ్రి ప్రసాద్‌ని పోగొట్టుకున్నాక చాలా బాధపడ్డాడు. రమణయ్యా గత స్మృతులు అలన్నీ కలచి వేసున్నాయి. ప్రసాద్ ఆచూకీ ఇచ్చిన డాక్టరికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు రమణయ్య.

## 11

## డాక్టర్ విశ్వం

క్రితం రోజు వచ్చిన పోస్టు చూడసాగాను. నిన్న తీరనందువల్ల ఆ ఉత్తరాలను ప్రక్కగా పెట్టి ఉంచాను. ఆ ఉత్తరాలలో పొడుగుగా ఉన్న కవరొకటి నన్ను ఆకర్షించింది. దానిపై వ్రాయబడి ఉన్న వ్రాతను గుర్తించగలిగాను. అది ప్రసాదు దగ్గరనుండి వచ్చిన ఉత్తరం. కవరు చింపాను. నాకు వచ్చిన ఉత్తరంలోనే అమ్మాయి రేఖకు కూడా మరొక కవరు ఉంది. నాకు వ్రాసిన ఉత్తరాన్ని పూర్తిగా చదివాను. ఆరోగ్యంగా ఉన్నట్లు, యుద్ధం ఆగిపోయే సూచనలున్నందున త్వరలోనే యింటికి రాబోతున్నట్లు వ్రాశాడు ప్రసాదు నాకు ఎంతో సంతోషం కలిగింది. వెంటనే అమ్మాయి రేఖను పిలుచుకురమ్మని నా ఎదురుగా ఉన్న రాధకు చెప్పాను. ఆమె పిలవడానికి వెళ్ళింది. కొంచెంసేపట్లో రాధ ...రేఖ యిద్దరూ వచ్చారు.

'ఏమిటండీ నాన్నారూ...పిలిచారట!'

'అవునమ్మా...ప్రసాదు నీకు ఉత్తరం వ్రాశాడు...త్వరలో వస్తాడట!'

నా మాటలు విన్న అమ్మాయి ముఖంలో జ్యోత్స్న రేఖలు వెల్లివిరిశాయి ఉత్తరాన్ని ఆదుర్దాతో అందుకొని సిగ్గుపడుతూ అక్కడినుండి వెళ్ళి పోయింది. నా హృదయం ఆనందంతో నిండిపోయింది. అమ్మాయి సంతోషమే నా సంతోషం...ఈ రోజు ఆదివారం ... సాయంత్రం డిస్పెన్సరీ మూసి వేస్తాము కాస్త విశ్రాంతిగా ఉంటుంది. ఎవరో పేషెంట్లు వచ్చిన అలికిడి కావడంతో నా ఆలోచనలకు అంతరాయం కలిగింది. ఒకరు...యిద్దరు...ముగ్గురు...వరుసగా అరగంటవరకు పేషెంట్లు వచ్చారు. వారిని చూసి పంపించాను. భోజనం వేళ కావడంతో అమ్మాయి రేఖను వెంటబెట్టుకొని యింటికి బయలుదేరాను.

భోజనంచేసి విశ్రాంతిగా పడుకున్నాను. ఆలోచనలు నన్ను ముసురుకున్నాయి, ఇక ప్రసాదు త్వరలోనే వచ్చేస్తాడు. రేఖా ప్రసాదుల వివాహం అతను రాగానే జరిపిస్తాను ...వైభవంగా. ఆ విధంగా సంతోషకరమైన ఆలోచనలు కలగడంతో నిద్ర దూరమైంది నాకు. గతం గుర్తుకు వచ్చింది. అమ్మాయి రేఖ చిన్ననాటి సంగతులు స్ఫురణకువచ్చి నా ఆలోచనలు గతంలోకి మళ్ళాయి. ఒకరోజు నేను ఆస్పత్రినుండి యింటికి వచ్చాను. శశిరేఖ హాలులో, సోఫాలో కూర్చుని ఉంది. ముఖ వైఖరి చూస్తే ఎందుకో అలిగినట్లు కనిపించింది.

'అమ్మా శశీ...!'

'...............'

'ఇక్కడ ఒంటరిగా కూర్చున్నావేం?— అలా దిగులుగా ఉన్నావేం తల్లీ ?'

'...............'

'నిన్నెవరేమన్నారమ్మా ? మాట్లాడవేం ?'

'నాన్నగారూ...'

నేను నాలుగుసార్లు పలకరించిన తర్వాత ఒక్క మాట మాట్లాడింది అమ్మాయి. మాట్లాడితే కన్నీరు క్రిందికి జార్చడానికి సిద్ధంగా ఉన్నాయి ఆమె కళ్ళు.

'ఏం జరిగిందమ్మా ..నాతో చెప్పవూ?' దగ్గరకు తీసుకొని బుజ్జగిస్తూ అడిగాను.

'నేను...నా స్నేహితురాళ్ళు అందరమూ కలిసి ఆడుకుంటున్నాము. కొద్దిగా చీకటి పడగానే 'ఇక ఉంటే అమ్మ కోప్పడుతుంది.' 'ఈ రోజు అమ్మతో సినిమాకు వెడుతున్నాను,' 'నేనూ మా అమ్మ పేరంటానికి

వెడుతున్నాం శశీ!' అని తరటూ అంతా పరుగెత్తుకు వెళ్ళిపోయారు. మరి...మరి ...నాకు అమ్మేదండీ నాన్నగారూ...?'

బాధతో కృంగిపోయాను. శశి ఊరికే తన తల్లిని గుర్తుచేస్తూ ఉండడం...నేను బాధపడడం పరిపాటైపోయింది ... ఏం చేయను? ఏ లోటూ లేకుండా పెంపకం సాగుతున్నా అమ్మాయి తల్లిని మరిచిపోవడం లేదు. ఎప్పుడూ తల్లిని గురించి ప్రశ్నల వర్షం కురిపిస్తూనే ఉంటుంది, ఇక సాధ్యం కాదు...మరిపించడం.

'మీ అమ్మ చనిపోయింది.'

'చనిపోయిందా...? మరెప్పుడూ చెప్ప లేదేం...నాకు ?'

'ఇప్పుడు చెబుతున్నాను గదమ్మా!'

'చనిపోయినవారంతా ఎక్కడికి వెడతారు ?'

'దేవుడి దగ్గరికి.'

'అయితే నేను కూడా దేవుడి దగ్గరకూ ...అమ్మ దగ్గరకూ వెడతాను నాన్నగారూ!'

'తప్పమ్మా...అలా అనకూడదు. దేవుడు నిన్ను రానివ్వడు.'

'ఎందుకు రానివ్వడు ? మరి...అమ్మ వెళ్ళిందిగా...? అమ్మను రానిచ్చాడుగా!'

'ఏకర్థమయ్యేలా ఏలా చెప్పగలనమ్మా?'

శశిని ఎత్తుకొని ముద్దాడుతూ బాధతో లోపలికి వెళ్ళాను.

'చెప్పు నాన్నా...

'ఏం చెప్పనమ్మా ?'

విసుగుపడుతూ సోఫాలో కూర్చున్నాను. పాపకు తెలిసీ, తెలియని వయసు, పరిస్థితిని అర్థం చేసుకోలేదు. ఊరుకోదు. ఎంత చికాకుపెట్టినా ఓర్పుతో సహించాను. ఈ రోజు యింత మొండిగా ప్రవర్తిస్తుం దేమిటి ? తెలిసీ, తెలియని ప్రాయంలో ఉన్న ఈ పాపను ఎలా సముదాయించటం ?



వీలితో కష్టం మీద ఆ మాట మరిపించి సముదాయించాను. అప్పటికిక గండం గడిచి నట్లే!

శశిని బడికి పంపించేశాకే నేను ఆస్పత్రికి వెడుతూ ఉండేవాడిని. అన్ని సదుపాయాలూ... సౌకర్యాలు పాపకు అమిరే ఏర్పాట్లు చేశాను. అయినా ఏదో ఒక లోపం జరుగుతూనే ఉండేది. బాధపడడం తప్ప ఏమీ చేయలేకపోయేవాడిని. అలా కొంత కాలం జరిగిపోయింది.

ఒకరోజు ఆస్పత్రినుండి యింటికి బయలుదేరే ప్రయత్నంలో ఉన్నాను. అంతలో నర్సు లోపలికి వచ్చి 'ఈ రోజు మీరు డిస్చార్జి చేసిన పేషెంటు సీత మీతో మాట్లాడుతానంటుంది డాక్టర్! లోపలికి పంపమంటారా ?'

'ఇంటికి వెళ్ళాలి...పాప నాకోసం ఎదురు చూస్తూ ఉంటుంది. అయినా పంపించు. త్వరగా ఆమెకు ఏం కావాలో తెలుసుకొని వెడతాను.'

భయపడుతూ, బిక్క ముఖంతో లోపలికి వచ్చింది సీత. పరీక్షగ చూశాను. ముఖంలో దైన్యం ఉట్టిపడుతూ ఉంది. గుడ్డలు బాగా మాసిపోయాయి. వయసు సుమారుగా ముప్పై పైన నలబదిలోపు ఉంటుంది.

'ఇలా రామ్మా ... భయపడకు... నీకేం కావాలో త్వరగా చెప్పు. నేను యింటికి వెళ్ళాలి.'

# గూడుచేరిన పక్షులు

'బాబుగారూ! నేను దిక్కులేనిదాన్ని. కూలిచేస్తూ నా జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నాను. ఆ రోజు జరిగిన ప్రమాదంలో ఎవరో నన్ను యిక్కడ చేర్చారు. మీరు నాకు జీవం పోసి నలుగురిలో కలిపారు... ఎంతో దయతో వైద్యం చేసిన మీకు ఫీజు యివ్వుకోలేని పరిస్థితిలో ఉన్నాను...ఇవ్వలేనని చెప్పడానికి నా మనస్సొప్పడం లేదు.'

సీతమ్మను చూసిన నాకు ఒక ఆలోచన కలిగింది. 'చూడమ్మా.. నేనిప్పుడు యింటికి వెడుతున్నాను. ఆలస్యమైతే మా అమ్మాయి నా కోసం బెంగ పెట్టుకుంటుంది. నేను త్వరగా వెళ్ళాలి. ఇంటికి వస్తే అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చు. ఈ పూట అక్కడే భోజనం చేద్దువుగాని.' అని అడ్రసు చెప్పి నేను యింటికి వచ్చేశాను.

నేను యిల్లు చేరేసరికి శశిరేఖ పని మనిషితో గొడవపడుతూనే ఉంది......

'నాన్నగారింకా రాలేదు. ఊఁ...ఊఁ... ఊఁ...'

'వచ్చేస్తారమ్మా... టైమైంది' పని మనిషి సముదాయిస్తూ ఉంది.

'వచ్చేశానమ్మా...' అని హాలు లోపలికి అడుగుపెట్టాను. నా అనుమతి తీసుకొని పని మనిషి యింటికి వెళ్ళిపోయింది.

వడ్డించమని వంటమనిషికి చెబుతూ, శశిని ఎత్తుకొని బట్టలు మార్చుకోవడానికి నా గది లోపలికి వెళ్ళాను. శశితో యిదే పెద్ద చిక్కు. రాత్రి కొంచెం పొద్దుపోతే చాలు నాకోసం గోల చేస్తుంది. ఆ కారణంగా ఎటూ వెళ్ళడానికి వీలుపడేది కాదు. టీపార్టీలు, డిన్నర్లు, అన్నింటినీ వదులుకొనేవాణ్ణి.

గుడ్డలు మార్చుకొని శశితో భోజనానికి కూర్చున్నాను. వంట నయించలేదు. సగంలోనే చేయి కడుక్కొని కొద్దిగా పాలు మాత్రం తీసుకున్నాను. శశికి పాలు పంచదార వేసి కొద్ది తినిపించాను. ఈ విధంగా ఎన్నిసార్లు జరిగిందో ? ఎంతోమంది వంటవాళ్లను మార్చి చూశాను. లాభంలేకపోయింది. పాప నిద్రపోయింది. హాలులో సోఫాలో కూర్చొని సీతమ్మకోసం ఎదురు చూడసాగాను. టైము సుమారుగా 8-30 ని. కావచ్చింది. వంటవాడు భోజనంచేసి యింటికి వెడతానని చెప్పడానికి వచ్చాడు.

'ఈ రోజు భోజనానికి ఒకరు వస్తున్నారు. ఒకగంటసేపు ఉండి వెళ్లు' అన్నాను.

'అలాగే బాబూ!' అని లోపలికి వెళ్ళిపోయాడు.

సీతమ్మ చూస్తే సభ్యత సంస్కారం గల స్త్రీలా కనుపిస్తూ ఉంది...మరి! కూలి చేసుకోవలసిన అగత్యమేమిటో...? ఆ వినయవిధేయతలు...మాట మంచితనం ...నాకు ఒక ఆలోచనను రేకెత్తించాయి. ఆమెను యింట్లో ఉంచుకొని పాపకు ఆయాగా నియమిస్తే...? బాగానే ఉంటుంది...కాని ఆమె ఏమంటుందో ? సరే...వచ్చాక అడిగి తెలుసుకుంటాను. పాప ఆలనా, పాలనా విషయమే నాకొక చిక్కు సమస్యగా తయారైంది. పాపతల్లి రేణుక ఎంత బలవంతం చేసినా నేను పునర్వివాహానికి ఒప్పుకోలేదు. ఆమె గుండె జబ్బుతో మరణించింది. ఆ సమయంలో ఆమె నాతో మాట్లాడిన మాటలు గుర్తుకు వచ్చాయి.

'ఈ చిన్నవయసులో మళ్ళీ వివాహం చేసుకోకుండా ఎలా ఉండగలరు...?'

'రోగులకు సేవచేస్తూ గడుపుతాను.'

'పాపనెలా పెంచుతారు...?'

'నేనే పెంచుతాను...ఎవరిమీదా నా శశి బాధ్యత ఉంచను.'

జలుబు చేసిందని శెలవు పెడితే నే కాదంటానా? దానికి ఫైళ్ళో తుమ్మాలేవిటి?



# రోజు కొక చెంచా-
# శక్తిని వృద్ధి చేస్తుంది



MINADEX

## మంచి కను దృష్టి:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ ఎ కలదు.
కంటి యొక్క దివ్యమైన దృష్టి కొరకై
రోజుకు 1 చిన్న చెంచాడు సిరప్
మినాడెక్స్ వాడుము.

## ఆరోగ్యకరమైన రక్తం:

సిరప్ మినాడెక్స్‌లో ఐరన్ కూడ గలదు.
భారతదేశంలో అత్యధికులు (80%) ఐరన్ లోపించిన
ఆహారం భుజిస్తున్నారు. కావున 1 చిన్న చెంచాడు సిరప్
మినాడెక్స్ అతి త్వరగా ఆ లోపాన్ని నింప గల్గుతుంది.

## దృఢమైన ఎముకలు:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ డి కూడ గలదు. ప్రతి రోజూ
1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ తీసుకొన్నచో
ఎముకలకు మంచి దృఢత్వమును కలుగజేస్తుంది.
గుర్తుంచుకోండి. రోజూ 1 చిన్న చెంచాడు నారింజ సువాసనగల
మినాడెక్స్ బిడ్డకు మూడంతలు ఆరోగ్యరక్షణ నిస్తుంది.

సిరప్
# మినాడెక్స్®

ఒకే చెంచాలో మూడు గుణములుగల టానిక్

గ్లాక్సో

# గూడుచేరిన పక్షులు

'పోనీ... మా అమ్మగారు తీసుకువెడతా నంటున్నారు...'

'అక్కర్లేదు...నేనే పెంచుతాను.'

తృప్తితో కళ్ళుమూసింది రేణుక. రేణూకు తండ్రిలేడు. ఆమెకు అన్న దమ్ములుగాని ... అక్కచెల్లెళ్ళుగాని లేరు. నా మామగారి మరణానంతరం మా అత్త గారు నన్ను ఇల్లరికం రావలసిందిగా ఎంతో బలవంతం చేశారు. నేను అందుకు ఒప్పుకోలేదు. ఆ కోపంతో ఆమె మళ్ళీ మాయింట్లో అడుగు పెట్టలేదు. గర్వంగల వాడినని, చిన్న పెద్ద తారతమ్యం తెలియని వాడనని...నలుగురితో చెప్పి కోపంతో వెళ్ళి పోయింది ఆనాడు. రేణుగాని, నేనుగాని మా అత్తగారి యింటికి వెళ్లలేదు. ఆ కారణంగా శశిని మా అత్తగారికి ఒప్ప చెప్పలేదు. కష్టమో నిష్టూరమో నేనే ఆ బాధ్యత వహించాను.

పైవిధంగా ఆలోచిస్తున్న నేను సీతమ్మ రాకను గుర్తించలేదు. ఆలోచనలనుండి తేరుకున్న తర్వాత ఆమెను చూశాను. ఒకమూల ఒదిగి నిలబడింది.

'సీతమ్మా...నీవొచ్చి ఎంతసేపైంది? ఆలోచనలలో మునిగిఉన్న నిన్ను నేను గుర్తించలేకపోయాను. శీఘ్రం వెళ్ళి భోంచెయ్యి...ఆతర్వాత మాట్లాడుకుందాం'

వంటమనిషిని కేకవేసి సీతమ్మకు వడ్డించమని చెప్పాను. వంటవాడి వెనుక వెళ్ళింది ఆమె.

సీతమ్మ భోంచేయగానే వంటవాడు శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. ఆమె వచ్చి నాకు ఎదురుగా కొద్దిదూరంలో కూర్చుంది. సంభాషణను ఆమె ప్రారంభించింది

'బాబుగారూ! నేనూ ఒకనాడు బాగా బ్రతికినదాన్నే! ఇప్పటికీ ఆస్తిపాస్తులు, యిల్లు... పొలాలు అన్నీ ఉన్నాయి... కాని నా అదృష్టంమాత్రం బాగాలేదు. కూలి చేసుకొని బ్రతుకుదామని యిక్కడికి వచ్చాను. అవమానాల పాలయ్యాను. శీలంకాపాడుకోవలసి వచ్చినప్పుడల్లా ఒకచోటు నుండి మరొకచోటికి మారవలసి వచ్చేది ...ఏం చెయ్యమంటారు? ఈ పాపిష్టి లోకంలో దిక్కులేని ఒక అనాధ...అందులో వయసులో ఉంటే ... ఏం జరుగుతుందో మీరు ఊహించుకోగలరు.'

'అయితే నీవు యిప్పుడేం చేయదల్చుకున్నావు...? ఆస్తిపాస్తులున్నాయంటున్నావు. మంచిగా బ్రతికానంటున్నావు. మరి నీ ఈ పరిస్థితికి అర్థం ఏమిటి? అసలేంజరిగిందో చెప్పు.'

'.................. ...'

'చెప్పడానికి అభ్యంతరం ఉంటే అక్కర్లేదమ్మా...'

'అబ్బే...! అటువంటిదేమీలేదండీ ...మాది యిక్కడికి దగ్గరలో ఉన్న కుగ్రామం ... మావారికి నేను రెండవ సంబంధం ... మొదటిభార్య చనిపోయాక మళ్ళీ వివాహం చేసుకోనేలోపుగానే వారు చెడు అలవాట్లకు లోనయ్యారు, త్రాగుడు ...జూదం...వ్యభిచారం ... యివన్నీ నిత్యకృత్యాలయ్యాయి. వారికి పేదవారైన నా తల్లిదండ్రులు ఈ విషయాలన్నీ తెలియక కలవారని సంతోషంతో నన్ను వారికిచ్చి వివాహం జరిపించారు, వారి వయసు ఎక్కువైనా నేను అదేమీ పట్టించుకోకుండా సంతోషంతో వారితో గడపసాగాను. వారికి మొదటి సంబంధానికి ఒక కుమారుడు, కూతురు ఉన్నారు. కుమారుడు నాకన్న ఒకటిరెండు సంవత్సరాలు చిన్నవాడు. అతనికికూడా వివాహం జరిగింది. ఇద్దరు పిల్లలు కలిగారు...కుమార్తె పసుపుకుంకుమను పోగొట్టుకొని పుట్టింట చేరింది. తండ్రి అలవాట్లు వారెవ్వరికి నచ్చేవి కాదు. నేనంటే ఎంతో అసహ్యపడేవారు. మావారు దురభ్యాసాలకు లోనై త్రాగుడు మరీ హెచ్చించడంతో 'నాకు వివాహం జరిగినతర్వాత రెండు సంవత్సరాలకే మరణించారు. దాంతో నేను దిక్కులేనిదాననయ్యాను. నా సవతి కుమార్తెకు ఎవరితోనో అక్రమ సంబంధముంది. ఆ విషయం వారు మరణించాకగాని నాకు తెలిసిరాలేదు. ఒకరోజు ఆమె తన విటునితో మాట్లాడుతూ ఉండగా నేను వెళ్ళి గట్టిగా మందలించాను. ఆ వచ్చిన యువకునితో నేను ఆవేశంతో మాట్లాడుతూన్న సమయంలో తను నేను చూడకుండా వెళ్ళి అవతలిగదిలో నిద్రపోతూన్న నా సవతి కొడుకుని లేపి తీసుకువచ్చి తన వేరాన్ని నాపైరుద్దింది. నలుగురినీపిలిచి రభస

చేసింది అసలే నేనంటే యిష్టంలేని నా సవతికుమారుడు ఆవిషయం తెలికగా నన్ను యింటినుండి తరిమేశాడు. ఆ అవవాదుతో, పేదరికంతో బాధపడూన్న తలిదండ్రుల దగ్గరకు వెళ్లడం యిష్టంలేక యిక్కడికి వచ్చి కూలినాలి చేసుకొని బ్రతకసాగాను.'

ధారాపాతంగా కారిపోతున్న ఆమె కన్నీరు. ఆ ముఖంలోని దైన్యం ఆమె మాటలు నిజమేనన్న విషయాన్ని రుజువు పరచాయి. ఆమె మాటలు నమ్మాను. మనుష్యుల తీరుతరహాలు నాకు విస్మయాన్ని కలిగించాయి.

'చూడు సీతా! నీకభ్యంతరం లేకపోతే మా యింట్లో ఉండు; మా పాపకు ఆయాగా! నీవు ఎంతకాలం ఉన్నా నా కేలువంటి అభ్యంతరమూ ఉండదు.'

'చాలా సంతోషం బాబుగారూ! అంతకన్న కింకేంకావాలి? మీలాంటి ఉత్తముల యింట నా జీవితశేషం వెళ్లబుచ్చుకొనే అవకాశం నాకు లభించడం ఎంతో అదృష్టం...ధన్యురాల నయ్యాను. 'రేపు' గురించి ఆలోచించే అవస్థ నాకు తప్పింది.'

'సీతా తల్లిలేని నా పాపను నీ కప్పగిస్తున్నాను. ఏవిధంగా చూసుకుంటావో?'

'నా ప్రాణంకన్న మిన్నగా చూసుకుంటాను బాబుగారూ!'

'సంతోషం...వెళ్లిపడుకో'

ఎంతో బరువు తీరినట్లు సంతోషించాను. సీతమ్మపై భారాన్ని వేశాను. ఆవిధంగా వారంరోజులు గడిచిపోయాయి. ఒకరోజు నేను...పాప భోంచేస్తున్నాం... సీతమ్మ వడ్డిస్తూఉంది.

'వంటకాలు ఏమాత్రం బాగుండడం లేదు సీతమ్మా! ఏం చెయ్యమంటావు? ఇప్పటికే ఎంతోమంది వంటవాళ్లను మార్చాను. అయినా వంటకాల రుచిలో మాత్రం మార్పురావడంలేదు.'

'ఈ వంటమనిషిని కూడా మాన్పించండి. రేపటినుండి నేనే వంటచేస్తాను. పైగా ఈ వంటమనిషి ఏవేవో దాచేస్తున్నట్లుగా కూడా నాకు అనుమానంగా ఉంది.'

'చాలా సంతోషం సీతమ్మా, అంతకన్నా కావలసిందేముంది? రేపటినుండే అక్కర్లేవని చెబుతాను...కాని నీకు పనిఒత్తిడి

చిక్కువొతుందేమో ?'

'అవేంలేదు బాబూగారూ...! ప్రొద్దు పోవడంలేదు...మీరు పాపవెళ్ళాక అంతా తీరికేగా...?'

'నీయిష్టం...ఉత్సాహంతో చేస్తానంటూ ఉంటే నేనెందుకు కాదనాలి ? ఇంటి బాధ్యతలన్నీ నీకు ఒప్పగిస్తే నాకూ కొంత విశ్రాంతిగా ఉంటుంది. ఇది ఎప్పటి ఋణానుబంధమో...?'

'ఏమో బాబుగారూ...?'

ఆనందభాష్పాలు రాల్చింది సీతమ్మ... నేను కూడా సంతోషించాను. ఆమెకు పాప పట్లగల అనురాగాన్ని గమనించి నిశ్చింతగా ఊపిరి పీల్చాను.

ఒకరోజు నేను...అమ్మాయి రేఖ హుస్సేన్ సాగర్ ట్యాంకుబండ్‌కు వెళ్ళాము. రేఖ ఆ సంవత్సరమే పియు_శారం ప్యాసైంది. సీతమ్మ పుణ్యమా అని రేఖ ఆలనా, పాలనా తదితర ముఖ్య బాధ్యతలనుండి తప్పకున్నాను.

ఒక ప్రక్కగా కారు ఆపి, దిగి మెల్లిగా నడవసాగాము. కొంచెంసేపట్లో రేఖ అలసి పోయింది. ఆ తర్వాత ఒక బెంచీలో కూర్చున్నాం మెల్లిగా సంభాషణ ప్రారంభించాను నేను

'అమ్మా రేఖా...నీ చదువెలా సాగుతుందమ్మా...?'

# గూడుచేరిన పక్షులు

'బాగానే చదువుకుంటున్నాను నాన్నారూ...!'

'మార్కులు బాగా తెచ్చుకోవాలి ప్యాసవ్వాలి, లేకపోతే మెడిసిన్‌లో సీటు దొరకడం కష్టం. నాకు తెలిసిన మెడికలు ప్రొఫెసర్లు చాలామంది ఉండడంవలన సీటును గురించి బెంగ అక్కర్లేదు. అయినా మనం కూడా అర్హతలు కలిగి ఉండడం ఎంతో మంచిది. వేరే యితర విషయాలపై మనసు పోనీయకుండా జాగ్రత్తగా చదువుకో తల్లీ! నీవు చదువుకొని డాక్టరువై నర్సింగ్‌హోం బాధ్యత తీసుకున్నప్పుడు నీ తల్లి ఆత్మ సంతృప్తి చెందుతుంది'

రేణు గుర్తుకువచ్చి నాకళ్ళు చెమ్మగిల్లాయి. రేఖ చూడకుండా తుడుచుకున్నాను.

'అలాగే నాన్నారూ...జాగ్రత్తగా చదువుకుంటూ, అమ్మగారి ఆత్మకూ, మీకు తృప్తిని సంతోషాన్ని కలిగిస్తాను. నా ఈ ప్రయత్నానికి మీ ఆశీర్వాదమూ, దైవానుగ్రహమూ ఉండాలని ప్రతనిత్యమూ ఆ దైవాన్ని ప్రార్థిస్తూ ఉన్నాను...'

'ప్రతిరోజూ పూజచేయడం నీకెవరు నేర్పారమ్మా... ?'




'సీతమ్మ నాన్నారూ...ఆమె ప్రతిరోజూ పూజచేస్తుంది. నాతోకూడా చేయిస్తుంది.'

ఇటువంటి మంచి అలవాట్లు అలవరుస్తున్నందుకు మనసులో ఎంతో సంతోషించాను.

'సీతమ్మ ఋణం మనం ఎలా తీర్చుకో గలమమ్మా...? స్వంతమనిషికన్న మిన్నగా మన కుటుంబానికి సేవలు చేస్తూ ఉంది. ఏ ప్రతిఫలమూ ఆశించడంలేదు ఆ తిండీ, బట్టతప్ప ఎప్పుడైనా ఏదైనా యివ్వబోయినా తీసుకోదు...'

'అవును నాన్నారూ...సీతమ్మ చాలా మంచిది.' అని మళ్ళా 'ఇక వెడదామా నాన్నారూ...?'

'అలాగేనమ్మా ... టైము ఎనిమిది దాటింది కూడా!'

ఇద్దరమూ మెల్లిగా కారు నిలిపిన చోటికి నడవసాగాము. ఇంతలో అనుకోని సంఘటన ఒకటి జరిగింది ఎవరో ఒక రౌడీ నా ప్రక్కగా వచ్చి కోటు జేబులోనుండి పర్సు కొట్టేసి ట్యాంకు బండుకు మరొక ప్రక్కగా ఉన్న చెట్ల పొదలవైపు పరుగు ప్రారంభించాడు ఇదంతా గమనిస్తూ ఉన్న మరొక యువకుడు ఆ రౌడీని వెంబడించడం గమనించాను. అకస్మాత్తుగా జరిగిన ఈ సంఘటన నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. మరుక్షణంలో 'దొంగ' 'దొంగ' అని గట్టిగా అరిచాను. నా అరుపులకు నలుగు రైదుగురు పోగై సంగతేమిటని ప్రశ్నించారు. ఎదురుగా పారిపోతున్న రౌడీని, వాడిని వెంబడిస్తూన్న యువకుణ్ణి చూపించి 'ఆ ముందు పరుగెడుతున్న దొంగ వెధవ నా పర్సు కొట్టేసి పారిపోతున్నాడు' అని ఆదుర్దాలో చెప్పాను. అంతలో మరి కొంతమంది పోగయ్యారు.

నన్ను గుర్తించిన కొందరు ఈల వేస్తూ ఆ పరుగెడుతూన్న యిద్దరినీ అనుసరించారు. నేను కారు దగ్గర కెళ్ళి టార్చిలైటు తీసుకొని, అమ్మాయి రేఖను కారులోనే కూర్చోవలసిందిగా ఆదేశిస్తూ నేను కూడా వారు వెళ్ళిన వైపు వేగంగా అడుగులు వేయసాగాను. ట్యాంకు బండుకు రెండవ పక్క చాలా లోతుగా యిదన్న

ఉంటాయి: ఇండ్లే కాకుండా గుబురు గుబురు పొదలుగా ఉన్న చెట్లు అంతా గిజి బిజిగా ఉంటుంది. రోడ్డునుండి ఆ ప్రాంతానికి దిగడానికి చాలా చోట్లలో మెట్లున్నాయి. ఆ మెట్ల మీదుగా క్రిందకు దిగి ఆ పరుగెడుతూన్నవారిని అనుసరించాను. నాకు వారికి మధ్య చాలా దూరం మిగిలిపోయింది. ఆ చెట్ల గుబుర్ల మధ్యగా అంతా ఆగిపోయినట్లు కనపించింది. వేగంగా అడుగులువేస్తూ ఆ గుంపుకు దగ్గరయ్యాను. అంతగా ఆదుర్దా పడడానికి కారణం...ఆ పర్సులో రెండువేలున్నాయి. రేఖకు నెక్లెస్ కొనాలని ఆ రోజే బ్యాంకు నుండి తీసుకువచ్చాను. పని తీరనందువల్ల కొనడానికి వీలుపడలేదు. రేపు కొనవచ్చనే ఉద్దేశ్యంతో ఆ రెండువేలూ పర్సులో ఉంచాను. అనుకోని విధంగా ఈ సంఘటన జరిగింది. గుంపు దగ్గరకు చేరుకున్నాను. సందు చేసుకొని లోపలకు వెళ్ళి నిలుచున్నాను. ఆ రౌడీని వెంబడించిన యువకుడు బోర్లా పడి ఉన్నాడు. అప్పుడే ఎవరో అతనిని లేవతీయడానికి ప్రయత్నిస్తున్నారు. నేను కూడా దొంతి కూర్చొని ఆ యువకుడిని జాగ్రత్తగా పరిశీలించసాగాను.

కుడిచేతిలో పర్సు జాగ్రత్తగా పట్టుకొని ఎడమచేతిని ఆ రౌడీ పారిపోయిన దిక్కుకు చూపిస్తూ సంజ్ఞ చేయసాగాడు. అతను సంజ్ఞ చేసిన వైపుకు యిద్దరు ముగ్గురు పరుగెత్తారు. ఆ యువకుడికి నోట మాట సరిగా రావడంలేదని గుర్తించాను. ఆ ప్రాంతమంతా చీకటిగా ఉంది. అతని ఎడమచేయి వణుకుతూ ఉన్నట్లు తోచింది నాకు. టార్చిలైటు వెలుగుతో ఆ చేతిని చూసి నివ్వెరపోయాను. పెద్ద గాయం...రక్తం కారుతూ ఉంది. బాధతో మూలుగుతున్నాడు. టార్చి లైటును అతను పడి ఉన్న ప్రాంతమంతా వేసి చూశాను. రక్తం మడుగు కనుపించింది. అతను ఆ వెలుతురులో నన్ను గుర్తించి 'బాబుగారూ...! ఇదిగోండి మీ పర్సు.' అని పర్సును నా చేతిలోపెట్టి స్పృహ కోల్పోయాడు.

(ఇంకా ఉంది)




జ్ఞానేంద్రియాలు అయిదింటికీ, కర్మేంద్రియాలు అయిదింటికీ ఆయా ఇంద్రియ విషయాలపైని ఉండే కోరిక విషయాభిలాష. అంటే—కళ్ళకి చక్కనిది చూడాలనే అభిలాష, నాలుకకు మంచిది రుచి చూడాలనే కోరిక — ఈ మొదలైన వన్నీ అన్నమాట. ఆయా ఇంద్రియాలకి మనం లొంగిపోతే ఆయా కోరికలు గంతులు వేస్తాయి. వాటికి మానవమాత్రులు లొంగిపోతారు. మునులు లొంగరు,

మునులూ మానవులే! వారు ఎన్నెన్నో కష్టమైన నియమాలను పాటించి, ఆ విషయాభిలాషలను చంపుకొని ప్రధాన ధ్యేయమైన బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించి ముక్తులౌతారు.

వారు అనుసరించే నియమాలివి—రుచి కోసం కాకుండా — ఆకలి తీరడానికోసం బిచ్చమెత్తి సారంలేని ఆహారాన్ని దినానికి ఒకపూటమాత్రం తింటారు. ఉత్తనేల పైనే పడుకొంటారు. మన పనులకు ఇతరుల సాయంకావాలికాని, వారు తమ పనుల్ని తామే చేసుకుంటారు. కట్టుకునే వస్త్రం చింపిరిగుడ్డలు అన్నీ అతికి కూర్చిన బొంత, ఇలా వుండే ఆ మునులు మానాభిమానాలకు అతీతులు! విచారం అనేది వారికి ఏ కోశాన్నీ ఉండదు.

ఆ మునుల మాదిరిగానే నిర్విచారంగా ఉండాలనీ, విచారం విడివి ఉండడం వల్లనే జీవితం సుఖమయంగా ఉంటుందనీ తలచి, ఒక సామాన్య మానవుడు— ఆ విరాగుల మాదిరి బిచ్చమెత్తి ఒక పూట మాత్రం కొద్దిగా—ప్రాణం నిలుపుకోడానికి తిని, ఇతరులను దేనికీ ఆశ్రయించకుండా అతుకుల గుడ్డ వస్త్రంగా ధరించి, ఉత్తనేలపై పరుండి శ్రమలు సహించాడు. అయినా మనస్సు కట్టలేక పోవడంచేత విషయాభిలాష నశించలేదు. అందువల్లనే విచారిస్తూ ఈ విధంగా చెప్తున్నాడు—

'భిక్షాశనం తదపి నీరస మేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహమాత్రం,
వస్త్రం సుజీర్ణ శతఖండమయీ చ కంథా
హా హా తథాపి విషయాన్న జహాతి చేతః'

బిచ్చంవల్ల లభించిన నీరసమైన ఆహారాన్ని రోజుకు ఒకపూట మాత్రమే తింటున్నాను. ఉత్త నేలమీదనే పండుకొంటున్నాను. దేనికీ ఎవ్వరిమీదా ఆధారపడి వుండలేదు. అతుకుల బొంత అయిన పాతగుడ్డనే కట్టుకొంటున్నాను. ఇతరుల గౌరవా గౌరవాలతో నిమిత్తం లేకుండా— మునుల మాదిరిగా నడుచుకున్నా ప్రయోజనం లేకపోయింది. వారు, మనస్సును ఇంద్రియ విషయాలనుంచి మళ్ళించి, నిర్విచారంగా ఉండగలుగుతున్నారు. అది మాత్రం నాకు సాధ్యపడలేదు. మనస్సు ఇంద్రియ విషయాలనుంచి మళ్ళకుండా ఉంటున్నది—అని దీని అభిప్రాయం.

పరిపరి విధాల పోతూ, అనేకములైన ఆశలు పెట్టుకునే మనస్సు—చలించకుండా తన స్వాధీనంలో ఉంచుకున్నప్పుడే శాంతి, సుఖం ఏర్పడతాయి. దానికి విషయాభిలాషలను విసర్జించే ప్రయత్నం ముఖ్యం.



# ఒకజై బిదాంగ

ఆకొండి వెంకటరత్నం

సరస్వతికి దిగులుగావుంది. పుట్టింటి నుంచి దూరంగా వెళ్ళిపోవడమంటే ఏ స్త్రీకైనా అలాగే వుంటుంది మరి. వెళ్ళేది భర్తవద్దకే అయినా— తల్లి, తండ్రి, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములూ చూపించే ప్రేమకి, భర్త కురిపించే అనురాగానికి ఎంతో భేదం వుంటుంది. ఒక వర్గం ప్రేమించినట్లు మరోకవర్గం ప్రేమించలేకపోవడం సహజం. కనుకనే స్త్రీకి రెండురకాల ప్రేమలు అవసరం. అందుకే సరస్వతి కళ్ళలో రెండు నీటి ముత్యాలు నిలబడ్డాయి, తండ్రికి కనిపించకుండా కళ్ళు ఒత్తుకుంది.

'అమ్మాయ్— ఒక్కర్తివీ వెడుతున్నావ్ జాగ్రత్తసుమా. వెళ్ళగానే అశ్రద్ధ చెయ్యకుండా ఉత్తరం రాయి. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో.' రోడ్డుమీద నిలబడిన తండ్రి, బస్‌లో కూర్చున్న సరస్వతికి చెప్పిన విషయాలే మళ్ళీ చెబుతున్నాడు. ఆమె మౌనంగా తల ఆడించింది.

బస్ బయలుదేరుతోం దన్నట్టుగా మూడుసార్లు 'బబ్బోం' మని హారన్ మ్రోగించాడు డ్రైవరు.

తండ్రి మరోసారి హెచ్చరించాడు కూతుర్ని.

ఎదురుగాలిలో, కదులుతున్న డరోతీ పడవలా బయలుదేరింది బస్. అక్కడే నిలబడి చూస్తున్న తండ్రిని వెనక్కితిరిగి కనిపించినంతవరకూ చూసింది సరస్వతి. బస్, హోరతోపాటు స్పీడు అందుకోవడంతోనే క్రమంగా తండ్రి కనుమరుగయ్యాడు చిన్నగా నిట్టూర్చి తల తిప్పుకుంది సరస్వతి సర్దుకుని కూర్చుంది.

రకరకాల మనుష్యుల్నీ, మేడల్నీ, వాహనాల్నీ దాటిదాటి బస్ పచ్చటి ప్రకృతి మధ్య నడుస్తోంది. చల్లటిగాలి శరీరాన్ని

గిలిగింతలు పెడుతూంది.

సాధారణంగా సరస్వతి కొత్తవాళ్లతో మాట్లాడదు. అందుకే ఒంటరిగా ప్రయాణం చేసేప్పుడు చుట్టూఉన్న పచ్చదనాన్ని చూస్తూ ఏవేవో చిత్రమైన ఆలోచనల తాదాత్మ్యంలో కాలం గడుపుతుంది. ఏవో తియ్యటి ఆనందపు సువాసనలు ఆ ప్రకృతిలోంచి ఎగిరివచ్చి ఆమెను సోకుతున్నట్టుగా అనుభూతి పొందుతుంది.

నెమ్మది నెమ్మదిగా పుట్టింటి తలపులు ఆమెనుంచి దూరంగా జరిగిపోయాయి. ఆ స్థానంలో ఆరముగ్గిన మావిడి పండులా రాజశేఖరం ప్రవేశించాడు. అనుభూతుల మత్తుని ఆమె మస్తిష్కంలో ప్రవేశింపజేసి కమ్మగా నవ్వుతున్నాడు.

పదిహేను రోజులే అయినా భర్తనిచూసి ఎన్నో సంవత్సరాలు గడిచినట్టుగా వుంది సరస్వతికి. బస్సు చాలా నెమ్మదిగా నడుస్తున్నట్టు ఆమెకు అనిపిస్తూంది.

తనను తీసుకు వెళ్ళడానికి రాజశేఖరం వస్తాడని ఎంతగానో ఆశించిన సరస్వతికి రెండ్రోజుల క్రితం అతను రాసిన ఉత్తరం నిరాశ కలిగించింది. కనీసం ఒక్క రోజు సెలవు దొరకని ఉద్యోగాలని, కర్కోటక ఆఫీసర్లని కసితీరా తిట్టుకుంది. బస్ నడక మరీ మందగిస్తూంది.

ఊహా పవనాలు పీల్చుకుంటూకూర్చుంది సరస్వతి.

పంటకు సిద్ధంగావున్న పొలాలు గర్వంగా వచ్చటి వెన్నులు కదిలిస్తున్నాయి; గాలికి సముద్ర కెరటాల్లా ఊగుతున్నాయి. రకరకాల చెట్లు నిండుగా నవ్వుతూ వెనక్కి పరిగెడుతున్నాయి.

బస్ ఒక పల్లెటూర్లో ఆగింది. ఎవరో దిగిపోయారు ఇద్దరు స్త్రీలు చిన్న చేతి సంచులతో బస్సెక్కి ఒక సీట్లో, విమానంలో కూర్చున్న మంత్రుల్లా దర్జాగా కూర్చున్నారు. బస్ మళ్ళీ వేగం అందుకుంది.

'టికెట్, టికెట్' అన్నాడు కండక్టరు చెవిలోంచి పెన్సిలు తీస్తూ.

'యెంకటాపురానికెంతవుద్దండీ?' వారిద్దరిలో నల్లగా, నున్నగా, సన్నగా, రాతి వెలుగులో మెరిసే పూల మొక్కలా వున్న ఆమె అడిగింది.

'రెండున్నర్రూపాయలు, తొందరగా డబ్బులు తియ్యి' హడావుడి చేశాడు కండక్టరు.

'ఓర్నాయినోయ్! రెండున్నరే!...రెండేసి రూపాయలిస్తాం తీసికెల్లు బాబూ.' నల్లమనిషి గుండెలమీద చెయ్యివేసుకుని చిత్రంగా కళ్ళు తిప్పుతూ అంది. బస్‌లో కొంతమంది పైకే నవ్వారు.

'ఇదేం చేపలబేర మనుకున్నావా? ఇస్తే రెండున్నరా ఇవ్వండి, లేకపోతే దిగిపొండి.' కండక్టరు కాస్త కటువుగా అన్నాడు.

'అట్టాగంటా రేటండి! ఆ యాళ మేమెక్కిన బండీలో రెండ్రూపాయలే తీసుకుంటేను!'

'నువ్వెక్కిన బండేవిటమ్మా? ఒంటెద్దు బండా, రెండు కాళ్ళ బండా?' వ్యంగ్యంగా అడిగాడు కండక్టరు.

బస్‌లో మళ్ళీ నవ్వుల చప్పుడు వినిపించేసరికి అపోలో యాత్రికుడిలా పోజు పెట్టాడు కండక్టరు.

'మంచోరే! కార్లోనే యెక్కితేను!' నల్లమనిషి మొలలోంచి డబ్బుమూట జాగ్రత్తగా తీస్తూ అంది.

ఆమె చేస్తున్న ఆలశ్యానికి కండక్టరు అసహనంగా చూస్తున్నాడు.

'రెండుం బావలా యిస్తాం తీసుకో బాబూ.' అంది నల్లమనిషి చిన్న పిల్లాణ్ణి బుజ్జగిస్తున్నట్టు.

'హోల్డాన్!' గట్టిగా, విసుగ్గా అరిచాడు కండక్టరు.

నల్లమనిషి తుళ్ళిపడింది. బస్ ఆగిపోయింది.

'దిగండి దిగండి. మీలాంటోళ్ళు ఇంకో యిద్దరుంటే మా బస్సులన్నీ మూల పడుక్కోవలిసిందే ...' కరిచినంత పని చేశాడు కండక్టరు.

ఆ మనిషి నిష్ఠూరంగా ఒక లిప్త పాటు చూసింది.

'సోన్లే బాబూ—పావల్డబ్బుల కోసం దింపేస్తావా—మంచి మడిసివే! సోన్లే ఆ పావల్డబ్బులూ నువ్వే దిను. ఇప్పుడు దిగిపోమంటే ఎట్టాగేటి?' మూతి తిప్పుకుంటూ అంది 'అచ్చమ్మా! తియ్యవేఁవేఁ డబ్బులు? అందరు బాబులూ మంచోళ్ళే వుంటారా! ఏటి సేత్తాం, తియ్యి తియ్యి.'

అచ్చమ్మని హెచ్చరిస్తూ తన వాదాన్ని ఉపసంహరించుకుంది. నల్లమనిషి. అతి జాగ్రత్తగా డబ్బులు తీసి మూడుసార్లు లెక్కపెట్టి కండక్టరు చేతిలో పోసింది'

'రాయిట్.' కండక్టరు అరుపుతో బస్ మళ్ళీ మేలుకుంది.

బస్‌లో అందరితోపాటు సరస్వతిని కూడా ఈ సంఘటన ఆకర్షించింది. లోలోపల నవ్వుకుంది. అంతలోనే నల్లమనిషి మీద ఆమెకు జాలికలిగింది. 'పాపం' ఇలాంటి వాళ్ళకి బీదతనం ఒక శాపం. అందేతనే సమయం, సందర్భం లేకుండా బేరాలు చేస్తారు.' అనుకుంది.

బస్‌లోకి లాగబడిన ఆమె దృష్టి చుట్టూ తిరుగుతుంది.

కండక్టరు తన సీట్లో జారబడి సిగరెట్ వెలిగించాడు. మరి — బస్‌లో 'పొగ త్రాగరాదు' అని బోర్డులు ఎందుకో సరస్వతికి అర్థంకాలేదు. ఒక ముసలాయన, ఏదో పుస్తకం చాలా దీక్షగా. మర్నాడే పరీక్ష అన్నంత శ్రద్ధగా చదువుతున్నాడు. కాలేజీ కుర్రాళ్ళలా ఉన్న యిద్దరు, పొగ పీల్చుతూ, ఏదో చర్చించుకుంటూ మధ్య మధ్య తల తిప్పి సరస్వతికేసి చూస్తున్నారు. ఇద్దరు రైతులు తమ పొలాలలోని ఈయేటి పంటల చరిత్రని గట్టిగా చెప్పుకుంటున్నారు. బస్‌లో ఆట్టే మంది జనం లేరుగాని వాళ్ళ మాటలు బస్ హోరులో కలిసిపోయి అపశృతుల సంగీతంలా వుంది. సరస్వతికి ముందు సీట్లో కూర్చున్న లావుపాటావిడ, రెయిలింగ్సు మీదికి ఎగబడి తలలు బయటకు పెడుతున్న పిల్లల్ని సరిగ్గా కూర్చోబెట్టలేక నానా హంగామా చేస్తూంది.

'ఆ కుర్రాళ్ళు అలా తలలు బయటకు పెట్టినప్పుడు అటునుంచి మరో వాహనం వస్తే ఎంత ప్రమాదం!' అనుకుంది సరస్వతి. తనకు తెలిసిన ఒక పెద్దమనిషి మొండిచేతి వాడైపోవటం గుర్తువచ్చి వణికిపోయింది. 'ఆ వెధవలు అంత గోల చేస్తుంటే రెండు తగిలించి కూర్చోబెట్టదేం?'

చివరికి లావుపాటావిడ చేతి సంచీలోంచి రెండు పొట్లాలు తీసి వాళ్ళకిచ్చింది. వాళ్ళు రెయిలింగ్సుని వొదిలేసి తిండి మీద్దికి ఎగబడ్డారు.

సరస్వతి మళ్ళీ బస్ చుట్టూ చూస్తూంది.

డ్రైవరు సీటుకి ఎదురుగా దేవుడి పటాలు; వాటి ముందు ఆరుతూ వెలిగే రంగుల చిన్న దీపాలు, అగరువత్తులు; పటాలకి వేసిన కాయితంపూల దండలు — అన్నీ



# ఒక జేబు దొంగ

చూస్తోంది. బస్‌లో ఎక్కడ చూసినా 'హరేరామ', 'హరేకృష్ణ' అని రాసి వున్నాయి. 'దేవుని స్మరించుము' అని ఒక చోట బోర్డు వుంది. లోకంలో అందరూ మరచిపోయిన దేవుణ్ణి వీళ్ళు కనీసం గుర్తు చేస్తున్నందుకు సరస్వతి సంతోషించింది.

ఒకవైపు ముగ్గురు నడివయస్సువాళ్ళు రాజకీయాలు చర్చించుకుంటున్నారు. 'బీద వర్గాలు', 'సామ్యవాదం', 'అవినీతి', 'లంచ గొండితనం', 'ప్రాథమిక హక్కులు',... ఇలాంటి కొన్ని పడికట్టు పదాలు అర్థంకాక పోయినా సరస్వతికి మధ్య మధ్య వినిపిస్తున్నాయి.

'ఇంకా ఇంకా కూడబెట్టడానికి, బీదల్ని దోచుకోవడానికి, చెప్పుకింది అట్టల్లాగ, వంటకోసం సిద్ధం చేసిన పిట్టల్లాగ నలిపివెయ్యడానికి ఈ ధనికులందరికీ ఎవరిచ్చారండీ లైసెన్సు? మీరు నమ్మరు గానీ వీళ్ళందర్నీ ఖాళీపారేస్తే గాని దేశం బాగుపడదు.' ఉద్రేకంగా ఒకాయన వాదిస్తున్నాడు.

సరస్వతి నవ్వుకుంది. 'శరీరాల్ని చంపినంత మాత్రంలో దేశం బాగుపడుతుందా! ప్రతీ మనిషిలోనూ మానవత్వం, ఉపకార గుణం, నీతి, నిజాయితీలు పెరిగితే చాలదూ! గుండెలు విశాలం అయినప్పుడే దేశం బాగుపడడం.' అనుకుంది.

ఒకచోట బస్ ఆగింది. నలిగిన బట్టలు, నుదుటి మీద జీరాడుతున్న జుట్టు, కొద్దిగా మాసిన గెడ్డంతో ఇరవైయేళ్ళ కుర్రాడు బస్సెక్కాడు. టికెట్ తీసుకుని సరస్వతికి దగ్గర్లోనే మరోక సీట్లో కూర్చున్నాడు. జేబులోంచి బీడీతీసి వెలిగించుకుని ఆప్యాయంగా పీలుస్తూ బస్‌లో ఉన్నవాళ్ళందర్నీ చూస్తున్నాడు. సరస్వతి ప్రొఫైల్ అతనికి కనిపిస్తోంది. 'ఈవిడ ఎవరోగాని, ఇంత ప్రశాంతమైన అందం ఇంతవరకూ ఎక్కడా చూడలేదు. దేవుణ్ణి తప్పకుండా, ఈవిణ్ణి సృష్టించినందుకు అభినందించవచ్చు.' అనుకున్నాడు ఆ కుర్రాడు.

సరస్వతికి వెనుక సీట్లో కూర్చున్న నల్లమనిషి అతని దృష్టిలో పడింది. ఆమె —చుట్టకి నిప్పు ఉన్న భాగాన్ని నోట్లో పెట్టుకుని పొగ వొదులుతూ అప్పమ్మతో ఏదో వాగుతూంది. అప్పుడప్పుడు ఓరగా బీడీకుర్రాణ్ణి చూస్తూంది. నల్లగా వున్నా, పొంకంగా, ఆకర్షణీయంగా వున్న ఆమె అందం అతన్ని కాస్సేపు ఆకట్టుకుంది. ఆపాదమస్తకం ఆమెని చూస్తూ కూర్చున్నాడు.

నల్లమనిషిని చూసి చూసి విసుగు పుట్టింది కాబోలు, కండక్టరు, పరిగెత్తే బస్సులో కునికిపాట్లు పడుతున్నాడు.

ఒక్కొక్క వూరూ వెనక్కి వెళ్ళిపోతూంది. మైళ్ళు తరిగిపోతున్నాయి. ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. దిగేవాళ్ళు దిగుతున్నారు.

దగ్గరపడుతున్న తన ఊరునీ, చూడబోయే తన భర్త రాజశేఖరాన్నీ ఊహాల పూల పందిరికింద నిలుపుకుని మెత్తటి పరిమళాలు పీల్చుకుంటూంది సరస్వతి. బయటకు చూస్తూంటే కాని ఆమెకు చెట్లు—చేనులు, చేలు, ఆకాశం, మబ్బులు ఇవేవీ కనిపించడంలేదు.

సగంసగం కనిపిస్తున్న సరస్వతి పాదాల సౌందర్యాన్ని చాలా సేపటినుంచి చూస్తున్న బీడీకుర్రాడు ఎందుకో చటుక్కున ముందుకి వంగున్నాడు. చెయ్యిచాపి, సరస్వతి కాళ్ళకి అడుగుదూరంలో వున్న ఒక వస్తువుని తీసుకున్నాడు. అరచేతిలో వుంచుకుని కాస్సేపు తదేకంగా చూశాడు. కాలికి పెట్టుకునే వెండిపట్టీ అది! కొంత పాతబడినా బరువుగనే వుంది. కొంత సేపు సరస్వతి ముఖంలోకి, మరికొంత సేపు చేతిలో పట్టీకేసి చూస్తూ ఉండి పోయాడు. ఎందుకో తల వంకించాడు.

'ఏమండీ.' అంటూ రెండుసార్లు సరస్వతిని పిలిచాడు.

తనని కాదేమో అన్నట్టు ఆమె అనుమానంగా చూసింది.

'మిమ్మల్నేనండి నేను పిలిచాను. ఇదిగో యిది మీ కాళ్ళవద్ద నాకు దొరికింది. మీదేనా యిది?' గుప్పెడ విప్పి ఆమె ముందుకు జాపుతూ అడిగాడు బీడీ కుర్రాడు

'వెండిపట్టీ! తనదే! ఎలా జారి పోయింది?... సీల పోయినప్పుడెప్పుడో తాను కట్టిన ఊలుముక్క తెగిపోయుంటుంది.'

సరస్వతి ఆలోచించింది కొద్దిసేపే అయినా అతను అనుమానంగా గుప్పెడ

చూసుకున్నాడు.

'ఔను నాదేనండి.' అంది సరస్వతి.

బీడీకుర్రాడు ఒక్కక్షణం సందేహించి పట్టీ ఆమెకు అందించడానికి చెయ్యి చాపాడు.

'ఆగవయ్యా ఏం పెద్దమనిషివి! ఆ వెండిపట్టీ ఆవిడదిగాదు నాది. ఇలాగియ్యి.' అంటూ నల్లమనిషి, ఒరలోంచి బయట పడిన బాకులా లేచింది.

సరస్వతి ఆశ్చర్యంగా నల్లమనిషి ముఖం లోకి చూసింది.

బీడీకుర్రాడు ఆగిపోయాడు. సందిగ్ధం అతన్ని పీడిస్తూంది. ఇద్దరి ముఖాల్లోకి తెల్లగా చూస్తున్నాడు. బస్‌లో కొంత మంది చిత్రంగా ఆ ముగ్గుర్నీ గమనిస్తున్నారు.

'యేటయ్యా బోసిరాచ్చిప్పలా అట్టా చూత్తారు? ఇలాగిమ్మంటె నీక్కాదూ?' ఇండియా ప్రధానికి ఉన్నంత అధికారాన్ని గొంతులో పలికించింది నల్లమనిషి

బీడీకుర్రాడూ తేరుకున్నాడు. కోపగించుకోకుండా చిన్నగా నవ్వాడు 'ఇస్తాను. కాని ఋజువేమిటి? ఇది నీదేనంటున్నావు గనక దీని ఆనవాలు ఏవైనా చెప్పు వెంటనే యిచ్చేస్తాను.' అంటూ పిడికిలి మరింత బిగించాడు.

'నా పరుక్కీ నే ఆనవాలు సెప్పడ వేటయ్యా! సీలొదులైంది, జారి పోయింది. నా కాళ్ళకాడుండాల్సింది ఈ మాయదారి బస్ కుదుపుల్తో ఆవిడ గారి దగ్గిరికి దేకిపోయింది' అంది నల్ల మనిషి.

'అంతేనా! ఇంకేమీ ఆనవాళ్ళు చెప్ప లేవా?' అడిగాడు బీడీ కుర్రాడు సూటిగా చూస్తూ.

'ఇంకా యేటి సెప్పాలేటి!' అంటూ ఆమె మూతి మూడువంకర్లు తిప్పింది. తల ఒక పక్కకివాల్చి గమ్మత్తుగా, గొంతు లోకి దిగజారుతున్న విస్కీ చుక్కలాగ బీడీ కుర్రాడి కళ్ళల్లోకి చూస్తూంది.

అతను తల తిప్పుకున్నాడు.

'మీరు చెప్పండమ్మా' అని సరస్వతిని అడిగాడు.

అప్పటికే బస్‌లో అందరూ మాటలు ఆపేసి సరస్వతి ముఖంలోకి చూస్తున్నారు.

'ఈ పట్టీ నాదే. — మూడేళ్ళ కిత చేయించుకున్నాను. అరంగుళం వెడల్పు, ఎనిమిదంగుళాల పొడవు వుంటుంది. సీల లేదు. ఎర్ర ఊలుముక్కతో కాలికి కట్టు కున్నాను' నెమ్మదిగా చెప్పింది సరస్వతి.

నల్లమనిషికి పట్టీ కనిపించకుండా, చాటుగా, బీడీకుర్రాడు, పక్కనున్న బొద్దింక మీసాలాయనకి చూపించాడు. ఆయన దీక్షగా వెండిపట్టీలోకి కొంతసేపు చూసి తల పంకించాడు. 'ఇది ఆవిడదే; సందేహం లేదు' అన్నాడు సరస్వతిని వేలు పెట్టి చూపుతూ.

'ఏటండోయ్, మీరూ నంచవాళ్ళాగే వున్నారే! నా కాలిపట్టీని పట్టుకొని ఈవిడ దంటారా!' బొద్దింక మీసాలాయన హడలి పోయేలా గదమాయించింది నల్లమనిషి.

'ఇదిగోబ్బాయ్! కావలిస్తే చూడు నా పట్టీ పడిపోయిందో లేదో తెలుస్తాది' అంటూ కుడికాలు ముందుకి జాపి, మోకాళ్ళపైదాకా చీరను లాక్కుని బీడీ కుర్రాడికి చూపించింది. కొత్తగా పాలిష్ చేసిన నల్ల బూట్లలా మెరుస్తున్న తన పిక్కల్నిచూసి ఆ కుర్రాడు కరిగి నీరవ్వా లనో ఏమో తెలియదుగాని చీర కిందకి దించలేదు చాలాసేపటివరకు. ఆమె ముణుకులచుట్టూ తెల్లని చార స్పష్టాస్పష్టంగా కనిపించింది బీడీ కుర్రాడికి. ఆచార, ఒకప్పుడు ఆ కాలికి పట్టీ ఉండే దనే విషయాన్ని వ్యక్తపరుస్తూంది.

బీడీ కుర్రాడూ ఆలోచనలో పడ్డాడు.

'ఇంకా ఏటయ్యా బెల్లంకొట్టే రాయిలా కూసుంటావ్? ఆ పట్టీ యిలాగియ్యి.' నల్లమనిషి, సీట్లోంచి జోరుగా పైకి లేస్తూ అడిగింది. బస్ కుదుపుతో మళ్ళీ వెనక్కిపడి లోలోపల తిట్టుకుంటూంది.

పట్టీ దొరికింది తనకి గనక న్యాయంగా ఆ పట్టీ ఎవరిదో వారికి చేర్చాల్సిన బాధ్యతకూడా తనదే అనే అభిప్రాయా నికి వచ్చాడు బీడీ కుర్రాడు. ఒకసారి నల్లమనిషి కళ్ళలోకి చూసి—'ఏదీ, నీ ఎడం కాలు కూడా చూపించు.' అని అడిగాడు.

అప్పుడు నల్లమనిషి, మల్లెపూలు మీద రాలుతున్నట్టు చిర్నవ్వి, ఏ మాత్రం సందే హించకుండా కాలు చూపించింది.

ఆ కాలికి పట్టీ వుంది! కాని...అది మూడువేళ్ళ వెడల్పున...మోటుగా వుంది. బొద్దింక మీసాలాయన మరోసారి లొట్ట లేసుకుంటూ పట్టీని తప్ప మిగతా భాగాన్ని రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు. చీర సరి చేసుకుని చెయ్యి చాపింది నల్లమనిషి.

'ఇదిగో—నీ పేరేమిటో నాకు తెలీదుగాని —ఈ పట్టీ మాత్రం నీది కాదు. ఎందు కబద్ధం చెబుతున్నావ్?' నిలదీసి అడిగాడు బీడీ కుర్రాడు.

'అయ్యో! బాగుందయ్యో. నాది కాదం టావేటి—నాదే. శూశారా బాబూ సూడండి. ఈ అన్నేయం సూడండి' అని చేతు



కాలర్‌కి అంతగుడ్డ తగలెట్టకుండా వుంటే ఒంటాడికి ఓ.. చొక్కా అవును గదా!

లాడిస్తూ బస్ చుట్టూ చూసింది.

ఎవ్వరూ మాట్లాడలేదు గాని చూపు వాళ్ళ ముగ్గురి మీదనే వుంది ముఖ్యంగా సరస్వతి మీద. ఇంత గందరగోళం జరుగుతున్నా తన విషయం కానట్టు మౌనంగా కూర్చుందేం...?

బీడీ కుర్రాడికి సందేహం తీరిపోయింది. పదిలంగా సరస్వతి చేతికి పట్టీ అందించాడు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

'థాంక్స్', అంది సరస్వతి వినబడీ వినబడకుండా.

'అయ్యోయ్యో — ఎంతన్నేయం ఎంత న్యేయం! ఒక్కళ్ళు మాట్టాడ్రేటండీ! నిచ్చేపంలాంటి నా పట్టీ...అత్తగారిసొమ్ము అల్లుడు దారోశాట్టు ... అయ్యోయ్యో' జనాంతికంగా అంటూ మళ్ళీ లేచి నిలబడింది నల్లమనిషి. ఈసారి పడిపోలేదు — పట్టుకుంది.

బీడీ కుర్రాడికి చిరాకొచ్చింది. 'ఇదిగో పిన్నమ్మోయ్, నీ వాగుడు కట్టిపెట్టు. నందుకు మోసం చెయ్యాలనుకుంటావు? నీ పట్టీ వెడల్పు బాగా ఎక్కువగా వుంది. ఇది సన్నంగా వుంది; పైగా ఆవిడ సరియైన ఆనవాలు కూడా చెప్పింది. ఇంక బుకాయించకు.' అని మందలించాడు.

నల్లమనిషికి ఏం మాట్లాడాలో కాస్సేపు తెలియలేదు. ఆలోచిస్తున్నట్టు తెలియకుండా కొద్దిసేపు ఆలోచించింది.

## ఒక జేబు దొంగ

'అయ్యో నా మతిమరుపమ్మండిపోనూ!... అయ్యా అబ్బాయిగారూ! ఈ పట్టీ అసలు నా కాలికెట్టుకోలేదండీ. మా సూరమ్మొదిన్ది పట్టీ. అట్టాటిదే నాజూగ్గా సేయించుకోవాల్ని దాన్నడిగి మా వూరట్టికెల్తన్నాను. సంచీలో యెట్టుకుంటే కిందడిపోయింది గావాల్ను...మాయిదారి బస్సు!... ఒసే అచ్చమ్మా — నాకు మతిమరుపని తెలుసుగద్సే, నువ్వైనా గేపకం సెయ్యొద్దా?...నా పట్టీ నాకిప్పించెయ్యండయ్యా' కొంత దిగులు, మరికొంత ఆనందం; కొంత ప్రార్థన, ఇంకొంత మందలింపు కలిపి బుర్ర అటూ యిటూ తిప్పుతూ అంది నల్లమనిషి.

'చాల్లే ఊరుకో.' బీడీ కుర్రాడు కాస్త గట్టిగానే కసురుకున్నాడు.

'నిజవేఁనండీ—సూరమ్మొదిన్దే ఆపట్టీ.' అంది అచ్చమ్మ, ఎలక సాక్ష్యంలా. మళ్ళీ మామూలుగా మునికన్యలా కూర్చుండిపోయింది.

'ఐతే నీ కుడికాలి పట్టీ ఏవఁయింది బుచ్చెమ్మా' వెక్కిరింపుగా అడిగాడు బీడీ కుర్రాడు.

'ఎటయో బుచ్చెమ్మా- పిచ్చెమ్మాను! నా పేరు యెంకట్లచ్మి.' అంది కోపంగా నల్లమనిషి.

'ఏదో ఒకపేరు గాని అడిగిందానికి సమాధానం చెప్పు.' జాగ్రత్తగా వింటున్న కండక్టరు మధ్యలో కల్పించుకొని అడిగాడు.

'సూడు కలకటేరు బాబూ! ఎప్పుడో నా కాలిపట్టీ ఎక్కడో పోతే ఆ గొడవ ఈనకెందుకయ్యా?' ఫిర్యాదు చేస్తున్నట్టు అడిగింది వెంకటలక్ష్మి.

'మరి... పట్టీలేని కాలెందుకు చూపించావూ అంట?' మీసాలాయన కనుబొమలు పైకెత్తి, తలకిందికీ మీదికీ ఆడిస్తూ అడిగాడు. కండక్టరు, పెదాలు నొక్కిపట్టి నవ్వుతున్నాడు.

'మరిసిపోయానన్నెప్పాను గట్టండీ!'

'నీ మొహం. నక్కజిత్తులు కట్టిపెట్టు.' కండక్టరు, తలమీద మొట్టినట్టు అన్నాడు.

'ఓరి నాయినో...ఈ పట్టీ పోతే మా సూరమ్మొదిని నన్ను సంపేత్తుంద్రో... నాకేటయెా దారి' అనుభవం లేని గాయకుడు రాగం పాడుతున్నట్టుగా అంది వెంకటలక్ష్మి.

'మీ సూరమ్మొదినికి నీ పట్టీ యిచ్చేసెయ్యి—పెద్దదే గనక సంతోషిస్తుంది.' అన్నాడు బీడీ కుర్రాడు.

'ఓ రి దే వు డో య్ ... ఇదెక్కడి న్యాలోయ్! ... ఇదేం నాయంరోయ్ దేవుడోయ్!... న న్నా దు కు నే వాడొకడూ ల్రేడోయ్...ఈ అన్నెయం సూడరోయ్' అలాగ ఐదునిమిషాలు ఘోషించింది వెంకటలక్ష్మి — వాన కురిసినప్పటి కప్పలాగ, తెల్లారే ముందు కాకిలాగ! ఎవ్వరూ తనని సమర్థించక పోవడంతో పౌరుషంగా లేచింది.

'ఏవఁమ్మోవ్ — నీకిది 'మంచిపనేనా? పట్టీ పుచ్చుకోని మింగి మూశానంలా కూకున్నావ్. మంచీ మరేదా అక్కర్లేదూ? నాపట్టీ నాకిచ్చెయ్...' అంటూ వాక్ప్రవాహం సరస్వతి మీదకు మళ్ళించింది. నడుం చుట్టూ కొంగు బిగించి, ఒకసారి సీట్లోకి పడి మళ్ళీ లేచింది.

'నాదే ఈ పట్టీ' అంది సరస్వతి.

'సెప్తివమ్మా — మరి, అదేపాటి మొదలెట్టావ్?'

సరస్వతి మాట్లాడనూ లేదు—ఆ అవకాశమూ రాలేదు

'ఈసారి నీ పొలికేకలు ఆవిడ మీ



విసురుతున్నావా? ఈ బస్‌లో ఎవ్వరి నడిగినా ఆ పెట్టె ఆవిడదేనని చెబుతారు తెలుసా? కూచో కూచో మాట్లాడకుండా" అన్నాడు బీడీ కుర్రాడు.

బస్‌లో కొన్ని తలలు 'ఔ' నన్నట్టు కదిలాయి.

'ఏవేఁయ్యో—నా పెట్టె పట్టెకెళ్లి ఆవిడకివ్వాల్సిందేటి? ఎరుగాడు పాడి గేదంటే పొరుగాడు గొడ్డు గేదన్నాట్ట! ఏటయ్యో నీ ఆసలాలోశన? ఆవిడికీ నీకూ అసలేటి సంబంధవంట? ఆఁ? పిడుగార్లాగ ఆయెంపు వొదించడానికి అసల్నువెవరంట?' ఇలాగ వెంకటలక్ష్మి బీడీ కుర్రాడి మీదికి కత్తులు విసురుతూంది. అతను కూడా నోరు పెద్దది చేశాడు. వాదన, హోరు వానలా వుంది; రోడ్డు రోలరు చప్పుడులా వుంది బస్‌లో కొంతమందికి అసహ్యంగా వుంది. అయినా వాళ్ళ మాటలు వింటూ సరస్వతినే చూస్తున్నారు. కొందరు కలగజేసుకొని బీడీ కుర్రాడికి సహాయం వద్దామని గొంతువిప్పేసరికి తాటకిలా మాటలు విసురుతూంది వెంకటలక్ష్మి; కబందుడిలా చేతులాడిస్తూంది! ఈ గొడవ మనకెందుకని, న్యాయాన్యాయాల ప్రసక్తి లేకుండా నోరున్నవాళ్లే మూసుకుని కూర్చున్నారు. ఆ కుర్రాడు మాత్రం ఆమెతో పెట్టెకోసం వాదిస్తున్నాడు. ఆమె మొండిగా, అర్థం లేకుండా మాట్లాడుతూంది.

మనస్సునిండా ఏదో అనుమానం పెట్టుకున్నట్టు చాలామంది సరస్వతినే గుచ్చి గుచ్చి చూస్తున్నారు. ఆమెకు ఇదంతా చాలా చికాకుగా, అసహ్యంగా కనిపించింది. ఆ గొడవగాని, బస్‌లోవాళ్ళ చూపులుగాని ఆమెకు సుతరామూ నచ్చడం లేదు. చిన్న పెట్టెకోసం యింత తగువు అనవసరం అనిపించింది సరస్వతికి. ఏమిటి చెయ్యడమా అని ఆలోచిస్తూంది.

'నాదంటే నాదే.'

'నీది కాదమ్మా—ఇంక మాట్లాడకు.'

'ఏటయ్యో దరిజా! మాటాడొద్దంటానికి నువ్వెవడి వంట?'

'నా గొడవ నీ కెందుకు? గొర్రిలా అరవకు.'

తుఫానులో రేకుల చప్పుడులాగ వాదన సాగుతూంది.

సరస్వతి మనసు నీరసంగా మూలుగుతూంది. బయలుదేరిన వేళ మంచిది కాదని తిట్టుకుంటూంది.

కొంతసేపటికి కండక్టరుకి విసుగెత్తింది కాబోలు — 'హోల్డాన్' అని గట్టిగా అరిచాడు.

వెంకటలక్ష్మి తుళ్ళిపడింది. బస్ ఆగిపోయింది.

'ఓయ్ వెంకటలక్ష్మీ! ఇందాకణ్నుంచీ నీ వరస నాకేం నచ్చడంలేదు. నోరు కట్టిపెడతావా, బస్సు దిగిపోతావా?' అంటూ కసిరాడు కండక్టరు.

'మంచోరే! దిగిపొమ్మంటే యెట్టాగేటి?'

'దిగిపోవాల్సిందే. బస్సెక్కిందగ్గర్నించీ ఒహటేగోల! మాటాడకుండా కూచుంటే కూచో లేపోతే దిగిపో' కండక్టరుకి ఇంత గొంతువుందని బస్‌లో వాళ్ళెవరికీ యింతకు ముందు తెలియదు.

వెంకటలక్ష్మి హటాత్తుగా 'గయ్యి'మని ఏడుపు మొదలు పెట్టింది.

కండక్టరు తెల్లబోయి - పెనిసిలుతో బుర్ర గోక్కుంటున్నాడు.

'ఏవిట్రా నాగేశరావు గొడవ?' డ్రైవరు వెనక్కి తిరిగి తాపీగా అడిగాడు.

'ఏవీలేదులే. డబ్బులిచ్చేసి ఈ మనిషిని స్టాండులో దింపేస్తేగాని గొడవొదల్దు. నువుపోనియ్యి' విసుగ్గా అన్నాడు పెనిసిలు మళ్ళీ చెవులో పెట్టుకుంటూ.

'నీకు న్యాయంగావుంటే యిక్కడే దింపేవయ్యా, టౌండుదాకా యెందుకేటి?... సూశావా బాబూ—సూశారా - ఈ అన్యేయం సూశేరా.' ఏడుస్తూనే నిష్ఠూరంగా అంది వెంకటలక్ష్మి. ఆమెకు ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. ఎవరికి తోచినట్టు వాళ్ళు మాట్లాడుకుంటున్నారు.

వెంకటలక్ష్మి తీసే బుడిబుడి దీర్ఘాలు, సరస్వతికి కఠోరంగా వినిపిస్తున్నాయి.

'ఓరి దేవుడోయ్ – నువ్వెక్కడున్నావురోయ్...ఈళ్ళంతాకూడి నన్నాయంసేసి పట్టీ లాగేసుకున్నారోయ్...నన్ను బండి దింపేస్తున్నారోయ్...' ముక్కు చీదుకుంటూ ఏడుస్తూంది వెంకటలక్ష్మి.

'గోలచెయ్యకు.' కండక్టరు కసిరాడు.

వెంకటలక్ష్మి గొంతు యింకా పెద్దదయింది,

చేతిలో ఉన్నపట్టీని చాలాసేపటినుంచీ చూస్తూ ఏదో ఏదో ఆలోచిస్తూంది సరస్వతి ఇలాంటి గొడవ ఎప్పుడూ తనకి అనుభవంలోకిరాలేదు. ఇప్పుడేం చెయ్యడం..?

ఏడుస్తూ దేవుణ్ణి తిట్టిపోస్తూంది

# ఒక జేబు దొంగ

వెంకటలక్ష్మి గొంతు నొప్పిపుడితే అప్పుడే ఊరుకుంటుందని కాబోలు ఎవ్వరూ ఆమెని మందలించడంలేదు.

సరస్వతి చటుక్కున లేచి నిలబడింది. ఆమె ఏం చెయ్యబోతుందోనని అందరూ శ్రద్ధగా చూస్తున్నారు.

వెంకటలక్ష్మి వెంపు తిరిగింది సరస్వతి. 'అమ్మాయ్ - అనవసరంగా యేడవకు. ఇంద, పోనీ ఈ పట్టీ నువ్వే తీసుకో.' అంటూ పట్టీ ఆమెకి ఇచ్చేసి వెంటనే తన సీట్లో కూర్చుంది.

ఎంత హటాత్తుగా ఈ సంఘటన జరిగిందో అంత హటాత్తుగానూ వెంకటలక్ష్మి ఏడుపు ఆపుచేసింది. పట్టీ చూసుకుంటూ గమేళా అంత మొహం చేసుకుంది!

'పోనియ్యమ్మా, నీకేనా మంచీ మరేదా వుండబట్టే నా పట్టీ నాకిచ్చేశావు' అంటూ గర్వంగా బీడీకుర్రాడికేసి చూసింది. అతని కళ్ళముందు మలాబాలు కాలుతున్నాయి.

బస్సో అందరిమీదా నిశ్శబ్దం నల్లమబ్బులా వాలింది. అందరూ సరస్వతి వెంపు రాతిబొమ్మల్లా చూస్తున్నారు. ప్రపంచంలోవున్న అమాయకత్వం అంతా సరస్వతేనా అన్నంత ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఎవ్వరికీ ఏం మాట్లాడాలో తెలియడం లేదు.

స్టాండులోకి వచ్చి బస్ ఆగింది.

నిర్విచారంగా మూటకేసే పుచ్చుకొని తలవంచుకుని సరస్వతి దిగిపోయింది.

'ఎదవలోకం! ఎదవలోకం!! న్యాయం, అన్యాయం ఏవీలేందే!' అంటూ వెళ్ళిపోతున్న సరస్వతిని చూస్తూ మెటికలు విరుచుకుంది వెంకటలక్ష్మి. చేతిలో ఉన్న పట్టీని ఆప్యాయంగా చూసుకుంటూంది.

బస్‌లో అంతా తలబులిప్పి సరస్వతికే చూస్తున్నారు. ఆమె, గాలిలో తేలిపోయే వెండిమబ్బులా నడుస్తూ, స్టాండుకి దగ్గర్లోనేవున్న ఒక యింట్లోకి వెళ్ళడం అందరూ చూశారు

ఇంక వెంకటలక్ష్మిని బస్ దింపేసే అవసరం కండక్టరుకి కనిపించలేదు. ఎక్కేవాళ్ళని ఎక్కనీకుండా, దిగేవాళ్ళని దిగనీకుండా కంగారు పెట్టి తనూ కంగారు పడుతున్నాడు.

* * *

నాలుగురోజుల తరువాత కాబోలు — సరస్వతి సాయంత్రం వంటపని పూర్తిచేసుకుని భర్త కోసం ఎదురుచూస్తూ ఫ్రంట్ గదిలోకి వచ్చింది. కిటికీ దగ్గర — గంట క్రితం లేని ఒక చిన్న పార్సిలు ఇప్పుడు ఆమె దృష్టిలో పడింది 'పోస్టుమాన్ దీన్నెప్పుడు పడేశాడో...అనుకుంటూ చేతిలోకి తీసుకుంది.

దానిమీద ఎడ్రస్ ఏమీలేదు.

'ఎలా వచ్చింది ...? ఎవరో పొరుగువాళ్ళు ఏరాళ్ళో పార్సిల్ చేసి కిటికీలోంచి పడేసి వుంటారు.'

దారాలన్నీ విప్పి, కాయితాలన్నీ ఊడదీసింది అందులో చిన్న అట్ట పెట్టె వుంది. ఆ పెట్టె తెరచి అందులో ఉన్న వస్తువు చూసేప్పటికి సరస్వతి ఆశ్చర్యపోయింది. బస్‌లో వెంకటలక్ష్మికి తను ఇచ్చేసిన వెండి పట్టీ! ఎవరు పంపించారు? మళ్ళీ దీన్ని చూస్తుందనుకోలేదు తను: కాని ఇప్పుడు తన కళ్ళముందు వుంది! ఈ చిత్ర మేమిటో ఆమెకు బోధపడలేదు. ఆలోచిస్తూ చాలా – సేపు నిలబడిపోయింది. బహుశా వెంకటలక్ష్మి మనస్సు మార్చుకుని తిరిగి పంపించిందేమో...!' అనుకుంది ఆనందపడింది.

ఆ అట్టపెట్టెలో చిన్న ఉత్తరం లాంటిదికూడా వుండడం కొంత సేపటి తరువాత గమనించింది సరస్వతి. ఆ కాయితం చేతిలోకి తీసుకుని విప్పింది. అది ఉత్తరమే!...చదువుతూంది...



'నమస్కారం!

ఆ రోజున మీరు బస్‌లో అలా ఎందుకు ప్రవర్తించారో నాకు తెలియదు. ఈ పెట్టె మీదేనని నాకు బాగా తెలుసు. మీరు మరీ అంత మంచిగా ప్రవర్తించడం లోకానికి అమాయకత్వంలా కనిపిస్తుంది. మంచితనానికి ఈ రోజుల్లో విలువ లేదండీ. మంచిగా బ్రతకడం మంచిది కాదేమో.

ఆ వేళ వెంకటలక్ష్మి ప్రవర్తన చూస్తే మీకు తప్పకుండా సహాయపడాలనిపించింది

మీరిచ్చిన పెట్టె ముద్దుగా కాలికి తగిలించుకున్న వెంకటలక్ష్మి, బస్ కుదుపులకి నిద్ర పోతుంటే — కొత్త నీరొచ్చి పాత నీరు కొట్టుకుపోయినట్లు — ఆమె రెండు కాళ్ళకి వున్న పెట్టెలూ నేను దొంగతనం చేశాను. మీరు ఆశ్చర్యపడక్కర్లేదు. బాధపడే అవసరం అంతకన్నా లేదు. మీకోసమని నేను దొంగగా మారలేదు. నేను మునుపే ఒక చిన్న జేబుదొంగని, అంచేతనే ఎవ్వరూ చూడకుండా లాఘవంగా పెట్టెలు కాజెయ్యగలిగాను.

మీరు అనుకుంటున్నట్లు దొంగతనం తప్పే. నా పరిస్థితి అలాంటిది. కష్టపడి పని చేసుకుందామనుంటే కొంత చదువు ఉండీ కూడా నాకు చిన్న ఉద్యోగమైనా దొరకలేదు కనీసం కూలి పని దొరికితే నేను దొంగతనం చెయ్యను.

క్షమించండి నా గురించి చాలా చెబుతున్నాను.

మా చెల్లాయి, వర్తతో కలిసి మీ వూర్లోనే వుంటూంది. మీతోపాటు నేనూ దిగవలసినవాణ్ణే ఆ రోజున. కాని వెంకటలక్ష్మికి బుద్ధి చెప్పడంకోసం ప్రయాణం పొడిగించి, పెట్టెలతోసహా వెనక్కి తిరిగి వచ్చాను. ఏ సందులోంచో మీ యింట్లో పడెయ్యవచ్చుగదాని మీ పెట్టె పార్సిల్ చేశాను. రెండోపెట్టె నా శ్రమకి ఫలితం.

శెలవు —

ఒక జేబుదొంగ'

పూర్తి చేసింది సరస్వతి. మరోసారి చదివింది. మరోసారి మళ్ళీ చదివింది. 'ఎవరీ జేబుదొంగ...?' అని ఆలోచిస్తూ — ఉత్తరంలోకి చూస్తూ ఉండిపోయింది. ●



పడమట సంధ్యారాగం. కుడి ఎడమల కుసుమ పరాగం. గున్నమావిపై గండుకోయిల మోహనరాగం - జగత్తంతా రాగ ధారలలో తడిసి తనివి తీర్చుకుంటోంది.

నాలో పురివిప్పుకున్న చైతన్యమయూరి. అనూహ్యమైన పరవశము. పిల్లగాలికి ఒడలు పులకరింపు. పున్నాగ చెట్టుపై గుసగుసలాడుతున్న చిలుకా గోరింకలు, గుబాళింపుతో ఒళ్ళు విరుచుకుంటున్న మల్లెమొగ్గ. నిత్యమల్లితో మంతనాలాడుతున్న మందార పువ్వు. ఎక్కడినుంచో మంద్ర మంద్రంగా తీవలు తీవలుగా సాగివస్తున్న మురళీనాదము.

*అన్నీ తెలిసినట్లుండి ఏమీ తెలియని ఈ సౌందర్యము, అంతా అందినట్లుండి ఎంత తనివి తీరని ఈ పరిమళము.*

సమస్యలకు, కలతలకు అతీతమైన జీవితమయితే ఎంత బాగుండును! ఎప్పుడూ చిన్నదానిలా ఉండిపోతే ... ఆ పున్నాగపై ఏ చిలుకనైతే...ఆ మల్లె తీగలో ఏ మొగ్గనైతే మురళీ నాదంలో ఏ స్వరాన్నైతే...ఆపైన ఊహించటం కష్టమయిపోయింది. ఎంత బాగుండును?...అదే కోరిక గుండెల్లో సుడులు తిరుగుతోంది.

'అమ్మడూ?' అన్నపిలుపుతో నా అందమైనకల చెఱిగిపోయింది. మనస్సు తంత్రులు తెగిన వీణలా చివుక్కుమంది. మైమరపిస్తున్న చిత్రం చటుక్కున విరి



# రాగధార

విమలా రామం

పోయినట్టయింది.

మళ్లీ బామ్మ పిల్చింది. వాకిట్లోకి వెళ్లాను, బామ్మ రొప్పుతూంది. ఎవరో ఒకతను వీధి అరుగుపైన ఉన్నాడు... పిల్లలకు పుస్తకాలు అప్పుడప్పుడు శంకరయ్య చీడీల పైన మంచున్నాడు. ఆ సన్నివేశమేమిటో నా కర్థంకాలేదు.

అతని పిక్కమీద మోకాలి దగ్గర అంతా రక్తమయం. నా మనస్సు విలవిలలాడింది. అతని నిశ్చలతకు ఆశ్చర్యమూ కల్గింది. అతనిబాధ నేను పడటం లేదుకదా ?... లేకపోతే ఆ వ్యక్తిలో ఆ మొండితన మేమిటి ?

'...ఈ ముసలిముండ కింకా చావు రాసిపెట్టలేదు. ఎంతవరకూ ఉందో వాడి ఋణం.' అంటోంది బామ్మ. నా గుండె లెందుకో క్షణంపాటు గుబగుబలాడాయి.

దగ్గరగావెళ్లి, 'ఏం జరిగింది బామ్మా?' అని ఆమె చెవిలో గట్టిగా అడిగాను.

అతను వింతగా నావైపు చూసి తల తిప్పుకున్నాడు. ఏమిటీపిల్ల ఇలా అరుస్తున్న దనుకున్నాడో ఏమో!... సిగ్గు ముంచుకొచ్చింది.

'ఏముంది తల్లీ! చావుతప్పి కన్ను లొట్టపోయినట్టుంది నాపని...'

శంకరయ్యవైపు ప్రశ్నార్థకంగా చూశాను. '...ఈయన మనపిల్లలకు క్రొత్తగా వచ్చిన మాస్టారమ్మా. ఊళ్లో కడుగుపెట్టారో లేదో గంగులుగాడి కుక్క కాటేసింది. మందు వేయిద్దామని నాన్నగారి దగ్గరకి తీసుకు వస్తున్నాను. ఇంతలో రంగనాథం గారింటినుంచి తిరిగొస్తున్న మామ్మగారు రోడ్డుకడ్డంగా రావటం, ఓ లారీ స్పీడుగా వస్తూండటం. ఓమూల బాధపడుతూనే ఈయన ఒక్కపరుగులో వెళ్లి మామ్మగార్ని కాపాడ్డం అన్నీ కనుమూసి తెరిచేలోపల జరిగిపోయాయి. మామ్మగార్కి చెముడని తెల్సికూడ వెంటనే కాపాడాలని నాకు తోచలేదు. ఆయన రూపంలో దేవుడే కాపాడాడనుకోండి...'

కృతజ్ఞతతో నా గుండె గొంతుకలోకి వచ్చింది. కాని, ఎలా, తెలియజేయటం ? అతను అపరిచితుడు. కొట్టుమిట్టాడాను.

'నాన్నేడే! పాపం అతన్ని గంగులు గాడి కుక్క కరిచిందిట! పుణ్యానికిపోతే పాపం ఎదురైనట్టుంది...' అని ఇంకా ఏదో అంటోంది బామ్మ.

'చూడు శంకరయ్యా! కాశీశంగారి సీతామణికి జ్వరంగా ఉందంటే వెళ్లారు నాన్నగారు. నువ్వెళ్లి వెంటబెట్టుకొని తీసుకురా...లేకపోతే, ఆ కబుర్నేనా తెమ్మ లవు.' అన్నాను.

అరుగుమీద వాలు కుర్చీవేసి మంచినీళ్లు తెచ్చియిచ్చా నతనికి. కుంపటిమీద నీళ్లు పెట్టి విసురుతూ కూర్చున్నాను. అతని మీదనే నా ఆలోచనలు. సమాధానాలు దొరకని వేలాది ప్రశ్నలు!

నాకు నవ్వు వచ్చింది.

నాన్నగారు వచ్చిన అలికిడయితే వాకిట్లోకి వచ్చాను...

'ఎన్నిసార్లు చెప్పినా ఆ కుక్కని గంగులుగాడదుపులో పెట్టటం లేదండీ! ఆఖరి కేరోజునో చూసి నా బల్లెంతో పొడిచి పారేస్తాను...' అంటున్నాడు శంకరయ్య. అతని మాటల్లో అప్పుడే బల్లెంతో పొడిచినంత కసి ఉంది.

'ఆ కుక్కనయితే చంపేస్తావు. నీబల్లెం కంటె వాడిగా పక్కలో బల్లేలైన మనుషులు-వాళ్లల్లో ఉన్న 'పిచ్చికుక్కలు,

## కొత్త సీరియల్ నవల ప్రారంభం!

వె రికుక్కలు—వీటి మాటేమిటి ?...' అని నవ్వి—'ఏమండీ మాస్టారూ! నిజం ఎంత చేదుగా ఉంటుందో చూసారా?' అన్నారు నాన్నగారు.

అతను నవ్వి ఊరుకున్నాడు. తన కబుర్లు సాగిస్తూనే అతనికి చికిత్స చేయ సాగారు నాన్నగారు. నేను వేన్నీళ్లు తెచ్చి యిచ్చాను. గాయం లోతుగాఉంది. చాల రక్తం కారిపోయింది. అయినా అతనిలో మొండితనం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

'ప్రాణానికి ప్రాణం ఒడ్డి అహర్నిశలూ పరోపకారానికి పాటుపడే ప్రాణికే అన్ని బాధలూను సృష్టి వైచిత్ర్యమే అంత!...' అన్నారు నాన్నగారు.

'ఆవిడ నట్లా తోడులేకుండా వెళ్ల నివ్వటం...' అతనేదో అనబోయాడు,

'తిరిగేకాలు, వాగేనోరూను... కొన్నేళ్ల ఖలివాటు ఎవరు మాన్పగలరు? వేయిళ్ళ పూజారాయె. అందరిక్షేమం తెల్సుకో వాలన్న జంజాటన – అందరి ఆదరణ కావాలన్న ఆశ ఆమెను పట్టి వదలటం లేదు. తన్ను చెవిటిదాన్నిచేసి ఎవరూ పలక రించటంలేదని ఆమె కనుమానం. ఆ మాట కొస్తే ఎవరయినా అంతే! ఈ ప్రపంచంలో మండే గుండెలతో కుమిలిపోయే దురదృష్ట వంతు లెందరో...సంగీతం విన నోచుకోని చెవిటివాళ్ళు, ప్రకృతి సౌందర్యాన్ని తిల కించలేని గుడ్డివాళ్లు, శాపగ్రస్తులైన మూగవాళ్ళు...' ఆపైన నాన్నగారి కంఠం

## రాగధార

రుద్ధమైపోయింది. పిన్ని కన్నులలో మెది లింది...నా గుండెలు పిండినట్లయింది.

అతనేమీ మాట్లాడలేదు. అయినా, ఏం మాట్లాడగలడు ?

అంతలోనే నాన్నగారు నవ్వు తెచ్చు కున్నారు. అలా నిరుపు తెచ్చుకోవటం ఆయన నేర్చుకున్నారు. '...ఇంతకీ మీ విషయమడ గటం మర్చేపోయాను. ఏ వూరు, ఎక్కడ నుంచి రావటం...'

'మాది విశాఖపట్నం. ఉపాధ్యాయునిగా క్రొత్తగా యిక్కడికే వస్తున్నాను...'

'ఆదిలోనే హంసపాదు. ఊరకుక్కల కలపులకేమిగాని మా ఊరి కుక్కలబారి నుండి జాగ్రత్తగా తప్పించుకోండి. మొఱిగే కుక్కలు కఱవ్వని మీకు తెలుసుగా! ఇక్కడి మనస్తత్వాన్ని మారుస్తారో, లేక మీరే మారిపోతారో... కాలమే నిర్ణయించాలిక...'

'పట్నం కాకపోయినా...'

'ఆహా! సంకుచిత్వానికి లోటు లేదు. సిరి అబ్బకపోయినా చీడ అబ్బుతుంది. ఇంత వరకు పట్నంలో గడిపిన మీకు గ్రామ జీవితం మీద మంచి అభిప్రాయం ఉండి ఉండొచ్చు! మనస్సులో ఏర్పడే స్థానం కంటితో చూపినదానికంటె గొప్పది అన్న నుంతా నట్టి చూడాలా?...రెండు రోజుల్లో మీకే తెలుస్తుంది...అది సరే, మరి మీ మకాము అది ఎక్కడా ?'

'ఏదో ఒక గది చూసుకోవాలి...'

'శంకరయ్యా! మాస్టారి సామాను అది ఇక్కడికి తెప్పించు. ఈ రాత్రికి మా యింట్లోనే ఉంటారు. రేపెక్కడయినా గది చూద్దాం.'

'అట్లాగేనండి.' అని శంకరయ్య వెళ్ళి పోయాడు.

'అమ్మడూ! సంజచీకటి పడుతోంది...' నాన్నగారు నవ్వేసరికి అంతవరకు బొమ్మలా అక్కడే నిలబడి ఉన్నానన్న విషయం గుర్తు వచ్చి సిగ్గుపడ్డాను. లోపలికి పరి గెత్తాను.

పిన్ని దీపాలు వెలిగిస్తోంది. నా మనస్సు చివుక్కుమంది.

'నేను వెలిగిస్తాలే పిన్నీ!' అని ఆమె చేతిలోని గుడ్డ లాక్కున్నాను. పిన్ని కళ్ళు ప్రేమతో మెరిసాయి.

అన్ని గదుల్లోను దీపాలుపెట్టి – బుడి లైటు అరుగుమీదకు తీసుకువెళ్ళాను

అప్పుడే రాజు, రవి ఇంట్లో కడుగు పెట్టారు. బడినుంచి ఆలస్యంగా వచ్చి నందుకు నాన్నగారు కూకలేసారు వాళ్ళాట లతో ఆలశ్యంగా రావటం, ఆయన మంద లించటం మామూలే!

'రాజు ఐదు, రవి మూడు చదువు తున్నారు చదువుమీద శ్రద్ధ తక్కువ. మీలాంటివాళ్ళెవరయినా ఒక కంట కని పెడితే బాగుండును...పోనీ, మీరు మరోచోట మరోచోట ఉండటమెందుకు ? మా యింట్లోనే ఉండొచ్చుగా! మీకిక్కడ ప్రశాంతికేమీ లోటుండదు. తీరికయినప్పుడు నోసారి మావాళ్లెట్లా చదువుతున్నారో చూస్తూండండి ... ఏమంటారు?'

'అంతకన్నానా ?'

'సరే ... ఇప్పుడే అలా వెళ్ళి వస్తాను. అందాకా పేపరు తిరగేస్తూ ఉండండి'

నాన్నగారి మాటలు లోపలికి వినిపి స్తూనే ఉన్నాయి ఆఖరి కివేళయినా ఈయన మర్యాద దక్కిస్తే బాగుండును. 'నాన్నా!' అంటూ అసహనంతో ఒక కేక వేసాను.

వీధి గుమ్మంలోంచే, 'ఇప్పుడే వచ్చేస్తా నమ్మా! మాస్టారికా వీధి గది శుభ్రం చేయించు. రాత్రికాయనకి తేలిగ్గా భోజనం తయారు చెయ్యి...గాయం నయమయ్యేదాకా జాగ్రత్తగా ఉండాలి.' అంటూ వెళ్ళిపోయా






# ఉతికే బిళ్ల
# డెటర్జెంట్ శక్తితో నిండినది
















**డెట్** డెటర్జెంట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 50%
ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా ఉతుకుతుంది
—మంచి నీళ్ల లేక ఉప్పు నీళ్లతో

Shilpi HPMA-45/70

రాయన:

నాలో బాధ పొంగించి. కోపం రగిలింది. ఒక్క ఉదుటున అరుగు మిదకు వెళ్ళి, "మీరిక్కడినుంచి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత మంచిది మాస్టారూ!...' అన్నాను.

అతను తెల్లబోయాడు. 'మీకా? నాకా?'

'మీకే!'

'మంచి — అన్న పదం నాడనవసరం లేనంతగా ఉండాలి మంచి అంటే!'

నాలో ఓర్పు నశించింది. 'మా బ్రతుకు అందరికీ నవ్వులపాలుగానే ఉంది.'

'మీకంత కష్టంగా ఉంటే వెళ్ళిపోతాను. ఒకరి మంచి కోరేవాడినే కాని అపకారిని మాత్రం కాదు.' అతను విసురుగా లేచి రెండడుగులువేసి 'అబ్బా' అన్నాడు. కాలు బరువు చేసింది కాబోలు. అయినా కుంటుకుంటూ అలానే బయటకు వెళ్ళిపోయాడు.

ఏదో పోగొట్టుకున్నట్లు గుండెలు బరువెక్కాయి. 'మాస్టారూ!'అని పిలిచాను. అతనికి నా పిలుపు అందలేదు. ఎందుకు పిలిచానో నాకే తెలియదు.

సాలెగూడులా గజి బిజి ఆలోచనలతో నిండిన మస్తిష్కం. మంచీ చెడు పోలిక అర్థంకాని అశక్తతతో నిండిన మనస్సు— హోరుగాలిలో అరటి ఆకులా రెప రెప లాడిపోయాను.

అలా ఎంతసేపు స్థాణువునయిపోయానో తెలియదు. నాన్నగారి గొంతు నాలో చైతన్యం కల్గించింది.

'..ఎప్పుడు చెప్పండి. ముందు గది కావాలన్నది మీరేనాయె. ఎవ్వరికీ ఇవ్వనిది మీకిస్తానన్నాను. ఒప్పుకున్నారు. మళ్ళీ ఇంతలో మనస్సు మార్చుకోటానికి కారణ మేమిటి?...' నాన్నగారి కంఠంలో ఆవేశం వెల్లువలా పొంగుతోంది.

'అది కాదు డాక్టరుగారూ! రేపటినుంచి భోజన వసతికి హోటలు మాటనే నన్నది'

'అదా! ఏదో పరాకు పడి ఉంటాను. మరోలా అనుకోకండి. ఈ ఊళ్ళో ఒకే ఒక హోటలుంది. హోటలు భోజన మన్నాక ఇల్లాలి వంటలా ఎలా వుంటుంది చెప్పండి? పాలకోసం రాయి మొయ్యాలి... అమ్మడూ!'

ఆయన భావం గ్రహించి 'సీతమ్మకి కబురంపాను నాన్నా! వచ్చి గది శుభ్రం చేస్తుంది. మీరు ముందు భోజనానికి లేవండి...' అన్నాను. మబ్బులు విడిన ఆకాశ మయింది నా మనస్సు! అతనిలో ఎంత సూక్ష్మ బుద్ధి? ఎంత సమయస్ఫూర్తి?

నాన్నగారి నోరు గట్టుతెగిన ఏరయింది దారీ తెన్నూ లేని ఆ కబుర్లకి అంతూ దరీ అసలే లేదు. అందులో ఈ స్థితిలో వినేవాళ్ళు దొరికితే ఆయన వాగ్ధాటి నరి కట్టే శక్తి ఎవ్వరికీ వుండదు ఊకొడుతూ తల దించుకొని ఏదో ఆలోచిస్తున్న అతన్ని చూసాక నాలో అసహనం పెరిగిపోయింది.

'నీ భోజనం అయ్యేసరికి తెల్లారేలా వుంది. త్వరగా కానియ్యి నాన్నా!' అన్నాను విసుగ్గా.

నోట్లో ముద్ద విస్తట్లోకి జారిపడేలా నవ్వారాయన. '...విన్నారా మాస్టారూ! తను బాధ పడటమే కాని కోపగించటం కూడ చేతకాని నా చిట్టితల్లి మాటలు. నా బంగారుతల్లిని ఏ కిరాతహస్తాల కర్పించగలను? ...రికి కూడు పెట్టలేని వాడు పిసినిల్లికి చీర పెడతానంటాడు. పూవి బెజ్జమంత నోరు — ఆకాశమంత ఆకలి. ఇటువంటి నీచులకి నా బిడ్డనిచ్చి గొంతు కోయగలనా?...అమ్మా! అమ్మడూ! ఎవడో పాచి మాట అన్నాడని బాధ పడకమ్మా! కుక్కలు మొరిగితే ఏనుగు బెదిరిపోదు. ఎవరు తీసిన గోతిలో వాళ్ళే పడతారు. ఏ ఎండ కా గొడుగు పట్టే వీళ్ళని నమ్మను. కుల మతాలకు తరతమ భేదాలకు అతీత మ్మైన వానికిచ్చి పెళ్ళి చేస్తాను. చెప్పటికి మూగ బ్రతుకు కానివ్వను. నన్ను నమ్మమ్మా!...' ఆ పైన నాన్నగారి గొంతు దుఃఖపు తెరలతో పూడిపోయింది

అతడు వెలవెలబోతూ ముళ్ళ మీద కూర్చున్నట్లున్నాడు. నా కన్నీళ్ళు దిగ మ్రింగుకొని నాన్నగారి దగ్గరగా వెళ్ళి భుజంపై చేయి వేసాను. 'నాన్నా!' అని అన్నానో లేదో ఆ చేతులతోనే నన్ను చుట్టేసి చంటిపిల్లాడిలా ఏడ్వసాగారాయన... నా పరిస్థితి మరింత క్లిష్టమైంది.

'...ఇంక ఈయనేమీ తినలేరు, మీరు కొంచెం చెయ్యి కడుక్కొని సాయం చెయ్యండి మాస్టారూ! ... మంచం మీద పడుకో పెడదాం ...' అన్నాను తప్పని సరియై.

'అలాగే!' అని అతను చెయ్యి కడుక్కొని వచ్చాడు. ఇద్దరం కలిసి ఆయన్ని లేవదీసి ఎలాగయితేం పక్కమీదకి చేర్చాను.

'...శుభ్రం చేసి ఆ సామాను గదిలో పెట్టింది సీతమ్మ మీరింక విశ్రాంతి తీసుకోండి. ఏమైనా కావలిస్తే పిలిచి అడగండి...' అని అతనివైపు చూడకుండానే చెప్పి వంటింటి వైపు దారి తీసాను. బామ్మ, పిన్ని, నేను భోజనానికి కూర్చున్నాము,



మనస్సులో తుఫాను! వేదనతో నిండిన కడుపు తిండికి చోటిచ్చింది కాదు.

* * *

ఇంట్లో అంతా నిద్ర కొరిగారు. మంచి నీళ్ళు తీసుకొని అతని గది సమీపించాను 'మాస్టారూ! నా పిలుపుకు దీర్ఘాలోచనలోంచి ఉలిక్కి పడ్డాడతను.

'మీకు రాత్రిళ్ళు పాలు త్రాగే అలవాటుండేమో! ఈవేళ...'

'.. దానికేం ఫర్వాలేదు రాధా!' అతని సంబోధనతో చకితయ్యాను.

ఒక్షణం ఆగి అతనే అన్నాడు...' నేనే నిజం తెలియక మీకు కష్టం కలిగేలా మాట్లాడాను.'

'...నిజం చెప్పలేక నేనే పరుషంగా మాట్లాడాను. నన్నే మీరు క్షమించాలి.'

అతని పెదవులపై తళుక్కుమంది చిరునవ్వు. 'ఏ గూటి చిలకలా పలుకులు పలుకుతాయి.'

నన్ను సిగ్గు ముంచెత్తింది. 'ఎవరయినా ఇంటికి వస్తే మరింత ఎక్కువ. ఇదివరకెవరో తెచ్చి యిస్తుండేవారు. తెచ్చినదల్లా పగులకొట్టేదాన్ని. దానితో నాకు భయపడి బయటకు పోతున్నారు. మీలాగే చాలామంది ఈ గదిలో ఉండి వెళ్ళారు - పట్టుమని ఎవ్వరూ నాల్గు రోజులయినా ఉండలేదు. లేని త్యాగి కన్న ఉన్న లోభి మేలు! అందుకని ముందే మిమ్మల్ని పంపేద్దామనుకున్నాను. తెలిసి బాధ పడటం కన్నా తెలియక పోవటమే మంచిది. ఆ వెళ్ళే రోజు ఇదే ఎందుకు కాకూడదు?'

'వెదకపోయిన తీగ కాలికి తగిలింది. ఈ వూళ్ళో ఉన్నంత కాలం ఇదే నా యిల్లు.' అతనెంత భావగర్భితంగా మాట్లాడగలడు?...

'పొద్దు పోయింది. ఇంక నిద్ర పొండి.' అని వెనుదిరిగాను.

రాత్రి చాలా సేపటి వరకు నిద్రపట్టలేదు నాకు. అతని మీద ఆలోచనలు

అతని రాక మా ఇంటికో శుభ సూచన కనిపించింది. ఎందుకో చెప్పలేను. అంతర్యంలోని ఆ విశ్వాసమేమిటో అర్థం

రసవర్గాలూ – గుణాలూ :

# నెయ్యి

నెయ్యి త్రిదోషహరమయినది. పైత్యం, వాతపైత్యం, శోష, ఉబ్బు వీనిని అణచి వేస్తుంది.

బుద్ధిబలాన్ని చేకూర్చి జ్ఞాపకశక్తిని పెంపొందిస్తుంది. శక్తిని, దేహపుష్టిని, వీర్యపుష్టిని యిస్తుంది. శరీరానికి కాంతినిస్తుంది.

గాయపడినవారికి శుష్కించిన దేహం గలవారికి, జ్వరపడిలేచినవారికి, క్షయజబ్బు గలవారికి, అగ్నితప్తమయినవారికి నెయ్యి మిక్కిలి పథ్యమయినది.

ఆవునెయ్యి, అందులోకీ అప్పుడు వెన్నకాచి చేసిననెయ్యి శ్రేష్ఠమైనది. ఇది బాలురకు, వృద్ధులకు అందరికీ అనుకూలమయినది.

గేదెనెయ్యి బలాన్ని, దేహపుష్టిని యిస్తుంది పైత్యం, పాండువు, మూలవ్యాధి, కామిల, రక్తపైత్యం వీనిని అణచును. ఇది చలవ చేస్తుంది. శ్లేష్మాన్ని, దగ్గును పుట్టిస్తుంది. వాతాన్ని ప్రకోపింప జేస్తుంది. ఆకల్ని మందగింపజేస్తుంది. అంత పథ్యమయినదికాదు. మేకనెయ్యి మిక్కిలి పథ్యమయినది. కాని మన ప్రాంతంలో మేకనెయ్యి వాడేవారు చాలా తక్కువ.

నెయ్యి యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు: **1.** ఉష్ణోదకం, 2. నిమ్మపళ్ళుపులుసు **3.** మిరియాలు, 4. పుళ్ళనిమజ్జిగ, 5. నారింజపండు, 6. ఇండుపగింజలగంధం.

# పెరుగు

ఆవుపెరుగు మేహశాంతి, పైత్యశాంతి చేకూరుస్తుంది. తాపాన్ని అణస్తుంది. కొంచెం వేడి చేస్తుంది. దేహపుష్టి, శక్తి, జఠరదీప్తి నిస్తుంది. వాతపైత్యాన్ని అణస్తుంది. కఫం చేస్తుంది.

గేదె పెరుగు దేహపుష్టిని, వీర్యపుష్టిని యిస్తుంది. కామిల, కుసుమరోగాల్ని శమింపజేస్తుంది. వాతపైత్యాన్ని హెచ్చిస్తుంది. పీనసం, అగ్నిమాంద్యం కలుగజేస్తుంది

మేకపెరుగు త్రిదోషహరమయినది. కఫవాతం, క్రిమి, గుల్మ, క్షయ వీనిని హరిస్తుంది. మూలవ్యాధి, శ్వాసకాసలు గలవారికి మిక్కిలి పథ్యమయినది. జఠరదీప్తినిస్తుంది. కాని నీరసాన్ని కలుగజేస్తుంది. వీర్యాన్ని క్షీణింపజేస్తుంది.

పెరుగు అన్నం కఫ పైత్యాల ఉద్రేకతను అణచివేసేటందుకు దోహదం చేస్తుంది. మంచి బలాన్ని, దేహపుష్టిని యిస్తుంది. శరీరంలోని క్రొవ్వుని పెంచుతుంది. గురుత్వంగా ఉంటుంది. అమితంగా పెరుగూ అన్నంతింటే వాతం చేస్తుంది. శరీరారోగ్యం చెడుతుంది.

బాగా పులిసిన పెరుగు అపథ్యకరమైనది. జీర్ణశక్తి బాగా గలవారికి మీగడతోకూడిన పెరుగు మంచి బలాన్ని యిస్తుంది.

అతిసారం, గ్రహణి, శీతజ్వరం, విషజ్వరం కార్శ్యరోగం, మూత్రకృచ్ఛ్రము ఈ రోగాలు కలవారు పెరుగు పుచ్చుకోవచ్చును.

ఉబ్బు, వాపు, దగ్గు, వగర్పు, క్షయ, మేహం, అగ్నిమాంద్యం, వ్రణం, ఆమజ్వరం, కఫరోగం, కుష్ఠు ఈ రోగాలుగలవారు పెరుగు పుచ్చుకోకూడదు. పై రోగాలు కలవారికి పెరుగు అపథ్యకరమయినది. భోజనానికిముందు అర్ధరాత్రివేళ, వసంతగ్రీష్మ శరత్కాలముల యందు, అగ్నిమాంద్యం ఉన్నప్పుడు, పరగడుపున పెరుగు పుచ్చుకోకూడదు. మిక్కిలి చలి ప్రదేశములయందు నివసించేవారు, మలేరియా వ్యాధి ప్రబలియుండే మన్య ప్రదేశాలలో నివసించేవారు పెరుగు పుచ్చుకోకూడదు.

ఉష్ణప్రదేశాలలో నివసించేవారు, జఠరదీప్తి కలిగిన మేహకారక పైత్యతత్వాలు కలవారు, చిన్నప్పటినుంచీ పెరుగూ అన్నం తినే అలవాటు ఉన్నవారు, నల్లమందు తినే అలవాటు ఉన్నవారు, పెరుగూ అన్నం తినవచ్చును. పెరుగూ అన్నం తినే అలవాటున్న వారు— ఆ పెరుగులో కొంచెం నీళ్ళు కలిపిగాని, సైంధవ లవణం శొంఠి చూర్ణం తగు మాత్రం కలిపిగాని తినడం శ్రేష్ఠం.

పెరుగు యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు **1.** ఉప్పు, 2. సైంధవ లవణం, 3. శొంఠిపొడి, 4. శొంఠి, పిప్పిళ్ళ, మిరియాలు ఈ మూడింటి చూర్ణం, 5. బెల్లం, 6 గరమసాలా, 7. చిలకర్ర, 8. వర్గాలు, 9. శంఖభస్మం, 10 వేడినీళ్ళు.

**సేకరణ ఆకుండి నారాయణమూర్తి**

# రాగధార

కాదు. ఆ కంఠంలో అభయ ముద్ర ఉంది. ఆ చూపులో ఆప్యాయత ఉంది. ఆ చిరునవ్వులో ఆకర్షణ ఉంది...అయినా, ఎంత గంభీరుడు?...

ఆ మరునాడు మామూలుగానే గడిచిపోయింది. వచ్చే పోయే రోగులకి మందు లిస్తున్నా అతనింటి వద్ద ఉన్నంత సేపు నాన్నగారేదో పిచ్చాపాటీ వేస్తూనే ఉన్నారు. గతరాత్రి తన పరిస్థితి ఏలా ఉందో అతను గ్రహించిన విషయం ఆయనకు తెలిస్తే ఇలా మాట్లాడగలరా? బాధ, నవ్వు ఒక్కసారే వచ్చాయి నాకు.

ఆ స్థితిలో తన ప్రవర్తన ఇతరుల కెలా ఇబ్బంది కలిగిస్తుందో నాన్నగారెప్పుడూ నన్ను అడక్కపోయినా ఆయన ఉలికి పాటును బట్టి కొంతయినా ఆయన గ్రహించి ఉండాలని నా నమ్మకం. అలా అని అడిగి నొప్పించాలని నాకు లేదు. ఏదో నిర్లిప్తతగా రోజులు గడిచి పోతున్నాయి.

ఆ రాత్రి అతను హోటల్లో కాబోలు భోజనం చేసి చాల ప్రొద్దుపోయి వచ్చాడు.

అప్పటికే నాన్నగారు నిద్రపోయారు.

అతనిపై ఉన్న గౌరవభావం సడలిపోయింది. నాన్నగార్నించి రాత్రిళ్ళు తప్పించుకు తిరుగుదామని మా గదిలో చేరిన వాళ్ళంతా ఇలాగే చేసేవారు. ఇతను కూడ ఏ నాలుగైదు రోజులో ఉంటాడు. ఆ తర్వాత మామూలు జీవితం.— ఆపైన ఊహించటానికి నాకు ధైర్యం చాలలేదు. నిత్యం ఉండే దానికి బాధపడి లాభమేముంది? కాని, ఏదో ఓ టమి లాం టి నిస్పృహ! ఉస్సురుమని వూరుకున్నాను.

ఫ్లాస్కులోని పాలు గ్లాసులో పోసి అతని గదిని సమీపించి, 'పాలు ఇదిగో మాష్టారూ!' అని గుమ్మంలోనే ఆ గ్లాసు పెట్టి గిరుక్కున వెనుదిరిగాను. అతను పిలిచినట్లయింది. నేను వినిపించుకోలేదు. ఆ రాత్రి కలత నిద్దయింది.

**(ఇంకా ఉంది)**

# వారఫలం

**25-2-1972 శుక్రవారం మొదలు**
**2-3-1972 గురువారం వరకు**

**మేషం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— బంధుమిత్రులను కలుసుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం:** వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిథునం:** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కన్య:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతనవిషయాలను తెలుసుకొంటారు. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. మీ వాలాయి మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**ధనుస్సు:** ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారంమధ్యలో అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**మకరం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కుంభం:** మీ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరుతాయి. పోటీవారితో మాట పట్టింపులు తగవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనంగల సంభాషణలు జరుపుతారు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం:** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. వారం ఆఖరులో భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఖరీదైన వస్తువులు కొంటారు.

—మహేష్





ఈసారి ఢిల్లీ కేంపు తప్పించుకునే సరికి తాతలు దిగొచ్చేరు శారదకు. 'దాస్ అండ్ దాస్' కంపెనీని సంవత్సరం నుండీ మీరే డీల్ చేస్తున్నారుకదా ... ఈసారీ మీరేవెళ్ళి ఈ కంసైన్‌మెంటు ఫిక్స్ చేసుకువస్తే బాగుంటుందని బాస్ ఒకటే ప్రెస్ చేయటం, కాదనటానికి మొదట కాస్త మొగమాటంపడినా ఏమైతే అయిందని 'సారీసర్, రాకరాక మా ఫ్రెండు వస్తోంది శ్రీనగర్‌నుండి ... నేను లేకపోతే చాలా బాధపడుతుంది' అని అబద్ధం ఆడేసింది; చివరకు మిస్టర్ మూర్తిని పంపటాన్ని నిశ్చయించేరు. 'ఈ కేంపులు తప్పించుకోవటం ఒకగొడవ .. ఆతరువాత ఏవేవో పిచ్చిపిచ్చి ఆలోచనలు. ఎన్నిసార్లు యిలా బాస్‌ను మభ్యపెట్టగలుగుతుంది ? ఇక ఈ ఢిల్లీ వ్యవహారాలు వద్దు... సౌత్ జోన్‌ను అడుగుతేసరి. మొదట్లో స్వయంగా కావాలని నార్త్‌జోన్ నెంచుకుని యిపుడు వద్దంటే ఏం బావుంటుంది. అయినా రంజనను తప్పించుకోవటానికి తానెందుకు ఇన్నిపాట్లు పడాలి ... అసలు తప్పించుకు తిరిగే అవసరం తనకేంవుంది?' రంజన గుర్తుకు వచ్చేసరికి శారద మనసు అదోలా అయిపోయింది ఫైల్సన్నీ అప్పగించి, ఆ కంపెని వ్యవహారాల గురించి మూర్తిగారికి క్లుప్తంగా వివరించి యిల్లు చేరుకునేసరికి తలదిమ్ము ఆరంభం అయింది. షవర్‌బాత్‌తో కాస్త కుదుటబడి లెటర్‌బాక్స్ తెరిచింది. రెండుకవర్లు వచ్చేయి. ఒకటి ఢిల్లీలోని ఏదో ప్రైవేట్ ఫర్మ్‌నుండి లెయిజన్ ఆఫీసరు ఉద్యోగానికి ఆఫరు. 'యిదే ఆరునెలల క్రితం అయుంటే ఎగ్గిరిగంతేసి వప్పుకునుండేది.' రెండోకవరు తమ్ముడు రాజా దగ్గరనుండి. 'ఏమిటో విశేషం... బరువుగావుంది కవరు' కుతూహలంగా చదవటం మొదలుపెట్టిన శారద మొహం ఉత్తరం పూర్తయ్యేసరికి పాలిపోయింది 'ఏమయింది వీడికి యిలా రాసేడు ?' మెదడు మొద్దుబారి తానేం చదివిందో ఒకంతట అర్థంకాలేదు. కాని రెండోసారి చదవటానికి మనసు వప్పలేదు. కలలోకూడా ఊహించని చేదు నిజం కళ్ళముందు సాక్షాత్కరించింది. 'కాస్త బాధ్యతగా వుండు' అని క్రితంసారి కొంచెం

వేగాటుగా రాసిన ఉత్తరానికి తాను ఆశించని జవాబుయిది... 'దీనిక్కారణం ఏమిటి? వాడురాసిందంతా నిజమేనా? తానేమైనా వాళ్లపట్ల అతిగా ప్రవర్తించిందా? తను కాదనుకున్నా వాడి దృష్టిలో ఔనేమో?' శారద కళ్లముందు ఉత్తరంలోని వాక్యాలు పదేపదే మెదలసాగేయి. 'నేను ఇలా తయారవటాన్కి కారణం నువ్వు, నువ్వు చెలాయించిన పెత్తనం... అధికారం. నా యిష్టప్రకారం ఒక్కటైనా జరిగిందీ యింట్లో'... సరైనగైడెన్సు యివ్వాలని వాడి విషయాల్లో తను సలహాలిచ్చినందుకు యిదీ కాంప్లిమెంటు... 'మీకోసమేగదరా నాన్నగారూ నేనూ పాట్లుపడేది' అంటూ అనునయంగా తాను రాసిందాన్కి సమాధానం 'మాకోసమే నువ్వు ఉద్యోగం చెయ్యనక్కరలేదు. తలిదండ్రుల్ని పోషించుకునే శక్తి ప్రతి మగవాడికీ దేవుడిచ్చేడు.' శారద మనసు పరిపరివిధాల పోతూంది... 'మేం ...నువ్వు' 'వాళ్లకి తను పరాయిదా?' తమ్ముడిగా నీకు నేనురాసే ఆఖరి వుత్తరం యిదే ...ఈ ఫలితంకోసమేనా తనిన్నాళ్లూ వర్రీఅయి తాపత్రయ పడింది? 'తనకు ఆదర్శాలు అంటూలేవు. అసలవంటేనే చికాకు. యింకా నయం అందరిమాటలూ నిజం అనుకుని తనేదో ఆదర్శం వెలగబెడుతున్నానని, త్యాగం చేస్తున్నానని... కనుక దానికి గుర్తింపు, కృతజ్ఞత వుండాలని అనుకుందికాదు. లేకపోతే రాజుగాడి ఉత్తరాన్ని... నిందనూ యింత సహజంగా, నిర్లిప్తంగా తీసుకునుండగలిగేదా?' తన సహృదయతనూ, త్యాగాన్ని ఉపయోగించుకుని చివరకు మోసం చేసారని వాపోయే ఒక కథానాయిక డైలాగులు గుర్తువచ్చి అప్రయత్నంగానే నవ్వేసింది శారద. "ఏమిటండోయ్ శుభవార్త ... అంతలా నవ్వేసుకుంటున్నారు' అంటూ లోపలికి వచ్చిన లలితను చూసి 'అబ్బే ఏంలేదు... మాతమ్ముడేదో జోక్‌వేస్తేను' అంటూ ఉత్తరం డ్రాయరులో పడేసింది. ఆవిడగారు కబుర్లు ముగించి కదిలేసర్కి 7 గంట లయిపోయింది. వంట చేసుకోవటానికి బద్ధకంవేసి బ్రెడ్డుతో భోజనం అయిందనిపించి పెర్రిమేసన్ నవల చదువుతూ కూర్చుంటే 9 గం అయిపోయింది బైట చల్లగా గాలివేస్తుంది. మొదట్నించీ తనకు ప్రకృతి అందాల్ని చూస్తూ గడిపేయటం అంటే చాలా యిష్టం. ఇక్కడకు వచ్చిన కొత్తలో ఆరుబయట కుర్చీ వేసుక్కూర్చోవటాన్కి సంకోచించినా బైట వాతావరణం సంకోచాన్ని రెండు రోజులకే జయించేసింది. ఈ యింటి కాంపౌండు గోడలు మరీ పొట్టిగా వున్నాయని మొదట్లో విసుక్కుంది కూడాను. రాత్రి 10—30 వరకు మబ్బుల్ని చూస్తూ, నక్షత్రాల్ని లెక్కబెడుతూ కూర్చునే తన్ని చూసి మొదట్లో యింటిగలవాళ్లూ, ఎదురింటివాళ్లు కాస్త యిబ్బందిగా ఫీలయినా, రాను రానూ వాళ్లూ అలవాటుపడిపోయేరు.

కాస్తసేపు రిలాక్స్ అయేసరికి సాయంకాలం ఉత్తరం మళ్ళీ శారద కళ్ల ముందు మెదిలింది. 'నిన్న మొన్నటివరకూ నాన్నగారికీ నాకూ అమ్మ ద్వారా శిఫారసులు పంపించే వీడు తన సమస్యల్ని స్వయంగా ఆలోచిస్తున్నాడన్న మాట. ఫరవాలేదు... తన భవిష్యత్తు తానే నిర్ణయించుకోగలడు' ...అంతలోనే ఉత్తరం సారాంశం గుర్తుకువచ్చి మనసు కలక్కుమంది. 'తనూ మారిపోతూంది. ఊఁ అంటే విసుక్కునే తనకు ఇలాంటి ఉత్తరం చదివినా కోపం రావటంలేదు బహుశ అందులో ఎంతో కొంత నిజం లేకపోలేదని అంతరాత్మ చెప్తూందేమో? అయినా తనది మాత్రం తప్పేం వుందని? తప్పంటూ వుంటే... తాను ఆడపిల్లననీ, సమాన హక్కులు సాధించిన ఈ యుగంలో కూడా సమాన బాధ్యతలు మాత్రం యింకా దూరంగానే వున్నాయనీ...ఆడపిల్ల పరాయిదన్న భావం మన నరాల్లోంచి, సంస్కారాల్లోంచి యింకా తొలిగిపోలేదని మర్చిపోవటమే. ఈ మాట కొస్తే ఈ తప్పు అమ్మా, నాన్నగారిదేనేమో? కొడుకులూ, కూతుళ్లన్న భేదమే లేదు వాళ్లకెప్పుడూ. ఆ వాతావరణంలో పెరిగిన తనూ తన తోబుట్టువులనందర్నీ ఎప్పటికీ తనవారుగానే భావించింది. బహుశ ఆప్యాయతను అందించి, వాళ్ళ శ్రేయస్సును కాంక్షించటం తప్ప... స్వయంగా అధికారం చెలాయించి వాళ్ళను నడిపించే హక్కు ఆడపిల్ల కనుక తనకు లేదేమో? కాని ఈ సత్యం ఈ రోజు సాయంకాలం వరకు తను గుర్తించలేకపోయింది. అందుకే పనుల హడావిడిలో నాన్నగార్కి వీలుండదని బాధ్యత తను స్వయంగా మీద వేసుకుని ఓనమాల నుండి గ్రేడ్యుయేషనువరకు తమ్ముళ్ల చెల్లాయిల చదువు మీద పెత్తనం చెలాయిస్తూ వచ్చింది. తన ఫ్రెండు చెల్లెలు అన్నింట్లోనూ ర్యేంకులు సంపాదిస్తుంటే వీళ్లూ అలాగే ఫస్టు రావాలని చదివించబోయి ... మొండికేసి చదవకపోతే ఉక్రోషం, కోపం, ఉడుకుమోత్తనం పట్టలేక వాళ్లను బాదేసి తనూ ఏడ్చేసేది.' చిన్నప్పటి సంఘటనలు శారద కళ్లముందు తిరగసాగేయి. 'అపుడు తను సెకెండు ఫారంలో వుంది కాబోలు దసరాశలవుల్కి తాతగారింటికి వెళ్లటం అంటే తానూ, రాజూ రెండో లఘు వేసేవారు. వీధిబడిపిల్లలతోబాటు బాణాల్ని పూలు పట్టుకుని దసరాపాటలు పాడుకుంటూ యింటింటికీ తిరగటం అదో థ్రిల్లింగ్‌గా వుండేది. 'కోనేటివైపు మాత్రం వెళ్లనీయకండి' అని పదేపదే జాగ్రత్తలు చెప్తూ ఇద్దర్నీ మామయ్య వెంట పంపేవారు. అమ్మమ్మదగ్గర తమదే యిష్టారాజ్యం. ఎవరెంత చెప్పినా వినకుండా స్నానాలకంటూ ప్రతిరోజూ చెరువుకు రెడీ అయేవారు పిల్లలంతా. అమ్మమాటలు గుర్తుకువచ్చి తానుండి పోతేనైనా రాజుగాడు మానేస్తాడేమోనని యింటిదగ్గరే వుండిపోయేది. అయినా వాడుమాత్రం రెడీ అయిపోయేవాడు. వాళ్లు చెరువునుండి తిరిగి వచ్చేవర్కు పిచ్చిపిచ్చి భయాలతో బితుకు బితుకు మంటూ కూర్చునేది. ఒకరోజు అందరూ తిరిగి వచ్చేసినా వాడు మాత్రం రాలేదు. ఆతృతని. భయాన్ని బైటపెడితే అందరూ వెక్కిరిస్తారని భయం.. మొగమాటం, అలాగే ఎదురు చూస్తూంది ఎంతకీ వాడు రాకపోయేసర్కి ఇక వుండ బట్టలేక పక్కింటి శీనును రహస్యంగా పిల్చుకుని రాజును వెదకటాన్కి బైలుదేరింది. కోనేరు, బడి, శివాలయం, ఆంజనేయులు గుడి, ఆఖర్కి అగ్రహారం త్రోవలుకూడా వెదికేసి ఏడుపాపుకుంటూ యింటికి వచ్చేసర్కి ఎదురుగా వాడు ప్రత్యక్షం ... బటానీలు నవులుస్తూ. ఆ ఊపునవెళ్లి ఒక్క లెంపకాయ వేసేసరికి 'కేరుమన్నాడు'..వాడి ఏడుపువిని బైటకువచ్చి వాడితోబాటు

# మైక్రోస్కోప్

ఏడుస్తున్న నన్నుచూసి అమ్మమ్మ తికమక పడుతూంటే చల్లగా చెప్పేడు మామయ్య...' ఊరికినే దీన్ని ఏడిపించటాన్కి మన రాజాని సుబ్బన్నగారింట్లో దాచేసాం...వాడికోసం ఊరంతా వెతికి వచ్చింది.' 'ఏయ్...మీ తమ్ముడ్ని ఎలకెత్తుకు పోయిందంటూ వాళ్ళు వెక్కిరిస్తూంటే ఉడికిపోయి క్రరతీసుకుని వెంటపెట్టింది. ఎందుకో చిన్నప్పటినుంచీ ఒక ఇగో...ఒకరకం అయిన 'అహం' పేరుకుపోయింది తనలో. తన మమతలూ...అనురాగాలు, కష్టాలూ సమస్యలు అన్నీ తనలోనే యిమిడ్చేసుకునేది.. బయటకు వ్యక్తం చేయటం అంటే ఇప్పటికీ తనకు కాస్త చిన్నతనంగానే వుంటుంది. ఆరోజు సంఘటన తల్చుకుని యిప్పటికీ మావయ్య వెక్కిరిస్తుంటాడు. శలవులయి యింటికి వచ్చే పిక రోజూ ఒకేకల. 'పెద్దచెరువు...దాని గట్టుమీద రాజాగాడూ తనూ ఆడుకోవటం...హఠాత్తుగా వాడందులోకి దూకేయటం...ఆ వెంటనే పక్షి ఒకటి బైటకు రావటం— దాన్ని మళ్ళీ ఎవరైనా రాజాగాడిగా మార్చగలరేమోనని తను ఆడపులా ...మైదానాలు ... కొండలూ ఓ... ఒకే యిదిగా తిరిగేయటం' ఆ రోజుల్లో రంచ మగా రోజూ ఈ కల వస్తుండేది. నిజానికి రాత్రిపూట నిద్రపోవాలంటేనే భయం వేసేది తనకు. ఇప్పుడనిపిస్తుంది...ఆ రోజు మావయ్యావాళ్ళు చేసిన ప్రాక్టికల్ జోకు, టూరింగ్‌హాలులో చూసిన అరవ సినిమా ఎంతగాఢంగా మనసులో ముద్ర వేసాయోనని.'

హఠాత్తుగా చినుకులు పడటంతో గిరిజ ఆలోచనలకు బ్రేకుపడింది. 'అబ్బ! ఇప్పుడే పదిన్నరయిందే.' వర్షం జోరు హెచ్చయింది. ఫిల్టర్ డికాక్షన్‌తో స్ట్రాంగ్ కాఫీ ప్రిపేర్ చేసుకుని పరధ్యాన్నంగా సిప్ చేస్తున్న కాదర మనసు మళ్ళా వెనక్కు పరుగెట్టటం మొదలుపెట్టింది. 'ఇలాంటి వెదర్‌లో ఎప్పుడూ రంజన గుర్తుకొస్తుంది. పిచ్చిపిల్ల...ఎలావుందో?... హాస్టల్లో వున్నపుడు చినుకులుపడితే చాలు ఓటికీమాటికీ ఏదోవంకతో వర్షంలో తడిసి సంబరపడిపోయేది ఒంటికి మంచిదికాదని తాను దెబ్బలాడితే... అంతక్రితం వర్షంలో తడిసి హైఫీవర్‌తో నేను మంచం ఎక్కిన సంగతి గుర్తుకుతెస్తూ 'మేం... తమలాగా నాజూకు మనుష్యులంకాదు మేడం' అంటూ వెక్కిరించేది. అసలు ఆ జ్వరమేకదా తామిద్దరినీ యింతదగ్గర చేసింది. ఎదురుపడితే 'హలో'అని తప్పుకునే రంజన ఆ వారంరోజులూ తన్నంటిపెట్టుకుని తనకు సాయంచేస్తూ ఫీవర్ తగ్గి నార్మల్‌కు వచ్చేవరకూ వర్రీ అయిపోతుంటే ఆశ్చర్యపోయింది తను. రంజన ప్రతికదలిక, ప్రతి చూపు, ప్రతి మాటలోనూ, వర్షించిన ఆప్యాయత, అనురాగం, మమత ఓహ్... అది తనకో కొత్త అనుభవం. అమ్మలోని ఆప్యాయత, నాన్నగారి వాత్సల్యానికి రూపమిస్తే యిలాగే వుంటుందేమో అనిపించింది. వాళ్ళ గుండెలనిండా అనురాగం, మమతలూ నిండివున్నాయని తనకు తెలిసినా ... వాటి వెల్లువ ఉప్పెన ఎలా వుంటుందో ఎప్పుడూ అనుభవించలేదు తాను. యదార్థ జీవితంలోని కటుత్వం, పరిస్థితుల సంఘర్షణ, బాధ్యతల గ్రహింపు తమ భావుకతను లోలోపలే అణిచేసాయేమో ననిపిస్తుంది అమ్మ, నాన్నగారు కూతురికంటె ఒకమెట్టు పైస్థాయినిచ్చి తమ సమానస్థాయిలో నిలబెట్టేరు. అందుకే ఆ మెట్టుదిగి సహజంగా ప్రవర్తించలేక పోయింది తను. అందుకేనేమో రంజన పరిచయం తన జీవితానికి అమూల్యవరం అయింది. 'చుట్టూ గిరిగీసుక్కూర్చుంటావు... నిన్నర్థం చేసుకోవటం ఆ బ్రహ్మతరం కాదు బాబూ' అంటూ విసిగిపోయేది తన ఫ్రెండు రమ. కాని ఆ గిరి లోపలికి అనుకోకుండానే స్వయంగా ఆహ్వానించింది రంజనను. తనకున్న బలహీనతలతో సహజంగా వ్యక్తం అయింది రంజనముందు మాత్రమే. అన్ని అనుభూతులూ, అన్ని బంధాలు రంజన రూపంలోనే తనకు దొరికేయా అనిపించేది. 'జీవితం అంటే యిది' అనిపించిన రోజులవి, విడుపు కలయికలు సహజం అని నిర్లిప్తంగా భావించే తను రంజనకు వీడ్కోలిస్తున్నపుడు మనసును కంట్రోలు చేసుకోలేక పోయింది. ఆ శలవుల్లోనే రంజన మేరేజ్ అయిపోయింది. రంజన భర్త రమేష్ ఢిల్లీలోనే ఏదో ఫర్మ్‌లో రిసెర్చ్ ఆఫీసరు రంజన సంసారం గొడవలో పడితే తను అసిస్టెంటు పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరుగా మద్రాసు చేరుకుంది. ఆఫీసు పనిమీద ఢిల్లీ వెళ్ళినపుడల్లా రంజనని చూసి వస్తుండేది. రమేష్ ఎంతో ప్రాణంలా చూసుకుంటాడని గ్రహించి మురిసిపోయింది. క్రొత్త వాతావరణం, ఉద్యోగం. బాధ్యతలు ... వీటితో సతమతం అయే తనకు రంజన ఉత్తరాలు ఎంతో రిలీఫ్ నిస్తుండేవి. 'రంజన నాకుంది' అన్న భావనే తనకు వెయ్యేనుగుల బలాన్నిచ్చేది. ఈ బలంతో తను కళ్ళుమూసుకుని కూడా సునాయాసంగా నడిచిపోగలదు. జీవితంలో బహుశ ఈ నమ్మకం, మనోబలం వల్లనేమో అప్పట్లో తనకు అంతా చాలా ఈజీగాను. ఎలాంటి సమస్యైనా ఎంతో తేలిగ్గానూ అనిపించేది బహుశ మనసు సున్నితం అయిన భావాలూ... బంధాలతో నిండి బరువైనపుడు జీవితం తేలిగ్గానూ ...అది ఖాళీ అయినపుడు జీవితం బరువుగానూ అనిపిస్తుందేమో.

క్రితం మార్చిలో ఒక కాన్ఫరెన్సు ఎటెండవటాన్కి ఢిల్లీ వెళ్ళినపుడు రంజన బలవంతంమీద వారంరోజులు శలవుపెట్టి తనదగ్గర వుండక తప్పలేదు. ఎంతో ఆరిందాలా యింటిపనులు చక్కబెడుతూ సతమతం అవుతూన్న రంజనను ఏడిపిస్తూ తమాషాగా, హాయిగా ఆ వారం

## పసిపాప మనసు

తెలుగువోలె చాల తియ్యన, వెన్నెల
వోలె తెల్లన, చిరుగాలి వోలె
చల్లన, పుష్పవోలె చాలమెత్తన, ఎట్టి
పాప మెరుగని పసిపాప మనసు.

అంతలోనె నవ్వు, అంతలో ఏడుపు,
మూగనోము పట్టు, ముద్దులొలుకు
నటులె మాటలాడు, అంతుపట్టదుగదా
పసిడి ముద్దవంటి పాపమనసు.

ఎంతకోపమైన కొంతసేపె, పిదప
నవ్వుదొడగు నంగనాచి వోలె
కలసిమెలసి యాడు కపటమ్ము లేకుండ
పరమచిత్రముగద పాప మనసు!

—చల్లా రాధాకృష్ణశర్మ

# గ్లాక్సోజ్-డి తో

# మీరు సర్వ స్వతంత్రులు!



టీ లేక కాఫీతో గ్లాక్సోజ్-డి



నీళ్లతో గ్లాక్సోజ్-డి



నిమ్మ పానీయంతో గ్లాక్సోజ్-డి



పళ్లరసంతో గ్లాక్సోజ్-డి



యథాతథంగా గ్లాక్సోజ్-డి



పాలతో గ్లాక్సోజ్-డి

మీ ఇష్టమే ఇష్టం. గ్లాక్సోజ్-డి వాడేందుకు
భయం లేదు నియమం లేదు.

ఎప్పుడు ఎలా కావాలంటే, అలాగే తీసుకోండి.
దేనితోనైనా సరే.

అవును, ఇది మాత్రం నిజం! రెండు చెంచాల
గ్లాక్సోజ్-డితో తక్షణ శక్తి పొందగలరు.

అలసట తీరేందుకు, కావాలన్నప్పుడు తీసుకోండి
—నేడూ, ఎల్లప్పుడూ.



## గ్లాక్సోజ్-డి తక్షణ శక్తి కోసం

# మైక్రోస్కోప్

రోజులూ గడిపేసింది రంజని ఆప్యాయత అనురాగాలు రెట్టింపవయే యనిపించింది. తమతో కలిసి అప్పుడప్పుడు షాపింగులకు వస్తున్నా సాధ్యం అయినంతవరకు తప్పించుకు తిరిగేవాడు రమేష్. రంజన నాతో మనసిచ్చి మాట్లాడుతూ మురిసిపోతున్నా, నవ్వు తమాషా పట్టించి నవ్విస్తున్నా రమేష్ కళ్ళల్లో లీలగా కదలాడే అసహనం ...అసూయని తాను గమనించకపోలేదు. ఆ వారం రోజుల్లోనూ ఒకే ఒరలో రెండు కత్తులిమడవన్న సత్యం తనకు అర్థం అయింది. అగ్నినీ, పెద్దలనూ సాక్షిగా పెట్టి జీవితాంతం తనువూ మనసు సంపూర్ణంగా తనది కావాలనుకుని భార్య మెడలో తాళి కట్టిన పురుషుడు ఆమె తన అనురాగాన్ని మరొకరికి పంచితే సహించలేడేమో. అసూయా అసహనాల జ్వాలలు రంజని సున్నిత హృదయాన్ని కాల్చేయవు గదా! దారాల ఎక్కువైతే చిక్కులు పడక తప్పదేమో. యిటు తనని దూరం చేసుకోలేక, అటు రమేష్‌ను సమాధానపర్చలేక రంజన సతమతమౌతే... ఛీ... తన రంజనకు తనే సమస్యగా తయారవటమా! రమేష్‌తో రాజుకున్న ఈ నిప్పును ఎంత త్వరగా ఆర్పగలిగితే అంత మంచిది. అదీ రంజన గ్రహించేలోగానే, ఆ వేడి రంజనకి తగిలేక ముందే జరగాలి. అందుకే కావాలని తాను దూరం కావటం మొదలు పెట్టింది. ఉత్తరాలకు తనిస్తున్న ముక్తసరి జవాబులు చూసి ఎంత బాధ పడుతుందో పాపం... అయినా తప్పదు. ఈ క్రొత్త పరిస్థితిలో యిమడటానికి ఆరు నెలలు పట్టింది తనకు ' ఇంకో మూడు నెలల్లో నీకో మేనల్లుడు అవతరించబోతున్నాడని వారం రోజుల క్రితం రంజన రాసిన ఉత్తరం గుర్తుకొచ్చింది శారదకు. 'ఈ సమయంలో స్త్రీలు క్రొత్త అందాలతో మెరిసిపోతారంటారు. ఈ క్షణం రంజన ముందు రెక్కలు కట్టుకు వాలాలనుంది. అయినా మనసు కట్టుకోక తప్పదు.'

.........'తనకు ఇన్నాళ్ళూ హుషార్నీ, [illegible]న్నీ యిచ్చే బంధాలు ఒక్కొక్కటీ తెగిపోతున్నాయా?' ఊహా మాత్రంగానైనా తట్టుకోవటానికి శారద మనసు ఒప్పలేదు ...అది అబద్ధం' అన్న నమ్మకంవల్ల కాదు ...నిజమేమోనన్న భయంవల్ల హఠాత్తుగా వచ్చిన ఈ ఆలోచనతో ఏదో బెంగగా అనిపించసాగింది. 'పోనీ క్రొత్త బంధాల్ని సృష్టించుకుంటే' తన ఆలోచన తనకే హాస్యాస్పదంగ వుంది బహుశ తను ఆ స్టేజ్ దాటిపోయిందేమో మనిషిని చూస్తూనే మనసును కనిపెట్టి... ప్రతి మాటనూ, ప్రతి కదలికనూ నిశితంగా పరిశీలించగలిగే తను యిక ఎవ్వర్నీ ప్రాణ స్నేహితులుగా భావించలేదేమో? ఒకసారి ఆ అనురాగ స్రవంతిలో మునిగి నిజం అయిన స్నేహాన్ని రుచి చూసిన తాను యిప్పుడు ఎవరితోనూ మనసిచ్చి మాట్లాడలేదు. అందుకే ఇక్కడ అందరూ పరిచయస్థులుగానే మిగిలిపోయేరు. రంజన స్నేహం ముందు కొత్త స్నేహాలు పర్వతం ముందు మరుగుజ్జుల్లా అనిపిస్తాయి. 'నిర్మల మందాకినీ వీచికల తూగు రాయంచ చనునె తరంగిణులకు'... ఎంత చక్కగ చెప్పేడు భాగవత కారుడు.' శారద ఆలోచనలు సాహిత్యం ... ఈనాటి కథల మీదకు మళ్ళేయి 'ఒకరి కర్పించిన హృదయంలో వేరొకరికి చోటు ఎలా యివ్వను నాన్నా' ఎంతో ఎమోషనల్‌గా పాత్రలచేత డైలాగుల్ని పలికించే నేటి కథా రచయితలు ఏకనిష్ఠతను ప్రేమవరకే ఎందుకు పరిమితం చేసినట్లు? తనకే గనుక కదలు రాసే ఛాన్సుంటేనా ... చెవులు మెలేసి స్నేహితుల డైలాగులు కూడా రాయించు దేది...ఇంతకీ డైలాగు లెలా వుండాలటా... 'మంజూ! నీ స్నేహం నా జీవితానికి వెలుగు... నువ్వే నా జీవిత నౌకకు కర్ణధారిణివి' అని స్త్రీ పాత్రల చేతా, 'డియర్ మై రాజూ! యువార్ మై బెస్ట్ ఫ్రెండ్ అండ్ యు ఆర్ మై లాస్ట్ ఫ్రెండ్' అని పురుష పాత్రల చేత అనిపిస్తే బ్రహ్మాండంగా వుంటుంది. రైమ్ కూడా కుదిరింది. పోనీ...తనే రాసేస్తే... బాబోయ్... ఈ విమర్శక మహాశయులూరుకుంటారూ? ఏవో కాంప్లెక్సు, కాంప్లికేషన్సు, చేతనం అవచేతనం అంటూ సైకాలజీ సూత్రాలు వల్లెవేసి విపరీతార్థాలు తీసి ఈ బంధాన్ని అవహేళనచేస్తే తాను భరించగలదా?' పక్కింటి గడియారం గంటలకు తుళ్ళిపడింది శారద. 'అరె... అప్పుడే 12 అయిపోయిందే... యింకాసేపు గాని లైటుంటే ఏం కొంప మునిగిందో అని ఘూర్కా వచ్చి తలుపు తడ్తాడు.' లైటార్పేసి బెడ్డుమీద నడుం వాల్చింది. 'వేళ మించిపోయిందేమో యిక నిద్ర పట్టేట్టు లేదు. ఈరోజు తనకేం అయింది. ఇలా పిచ్చిగా ఆలోచిస్తూంది.' మనసును మళ్ళించటానికి ఈ మధ్య తను చూసిన సినిమాలు గుర్తు చేసుకోవటం మొదలు పెట్టింది. 'సెవెన్ కైమ్స్ సెవెన్' బ్రహ్మాండం అయిన సస్పెన్స్ థ్రిల్లర్ అంటున్నారు. ఈ ఆదివారం లలితతో ప్రోగ్రాం వేయాలి — ఏమిటో ఈమధ్య బ్రతుకులో థ్రిల్ అన్నది బొత్తిగా లేకుండా పోయింది. మూసలో పోతపోసినట్లు ప్రతిరోజూ ఒకేలా వుంటోంది.. అంతా మొనాటనీ .. బోర్...యిక చికాకేస్తుంది పోనీ ఎద్దైనా ఏక్సిడెంటయి బాగా దెబ్బలు తగిలితే...?...కనీసం టైఫాయిడ్ ఏదో వచ్చి కొన్నాళ్ళ మంచం ఎక్కితే?... నొప్పి ... బాధ ... చావు బ్రతుకుల మధ్య నిరాశ ... ఆశ ... భయం ... అనుమానం

## జ్ఞాపకం ఉంచుకోండి!

ఎప్పుడూ వాడని బట్టలు ముక్క వాసన రాకుండా ఉండాలంటే నాలుగు నాఫ్తలిన్ ఉండలూ నాలుగు లవంగాలూ ఓ పల్చని గుడ్డలో చుట్టి బట్టల మధ్యన పెట్టాలి.

ఫ్లాస్కు వాడనప్పుడు కార్కు మూసి పెట్టకూడదు.

వంటింట్లో కత్తి తుప్పుపడితే ఉల్లిపాయలో గుచ్చి ఉంచి బట్టతో తుడవాలి. కొంచెం గ్లిజరిన్ రాసి ఉంచినా సరే.

కూరముక్కలు వేయించేముందు బాగా కాగిన నూనె చేతిమీద కంట తూలకుండా ఉండాలంటే చిన్నరొట్టెముక్క వేస్తే సరి.

నూరీ జిడ్డుగావున్న గిన్నెల తోమేముందు న్యూస్‌పేపరుతో తుడిచేస్తే— త్వరగా జిడ్డు తోమేయవచ్చు.

కేబేజీ, కాలిఫ్లవరూ ఉడికేటప్పుడు వాసన తగ్గించాలంటే— ఉడికే నీళ్ళలో ఓ రొట్టె ముక్క పడేస్తే సరి

నన్నరవ కొంచెం దోరగా వేయించి డబ్బాలో పోస్తే పెంకిపురుగు పట్టదు.

వేడివేవైనా గాజు గాసుల్లో పోసేటప్పుడు పగులువేయకుండా ఓ స్పూను పడేయాలి ముందు.

—కె. రా

మందులూ-మాకులూ...ఓహ్ కావల్సినంత థ్రిల్... అమ్మా నాన్నగారూ రెక్కలు కట్టుకు వచ్చేస్తారు. ...ప్చ్ — ఈ అయిడియా బాగాలేదు. వా థ్రిల్ కాదుగని వాళ్ళకి బాధ...వ్రేరీ' మనసులోనే లెంపలు వేసుకుంది శారద. 'ఈరోజు పని హడావిడిలో వీక్లీ తెచ్చుకోవటం మర్చిపోయింది. ఈ మధ్య వీక్లీ కొనటాన్కి వెళ్ళినపుడల్లా ఆ షాపులో చిత్రవిచిత్రం అయిన అడ్వర్టైజ్మెంట్లతో పొందిగ్గా పేర్చిన రకరకాల సిగరెట్ పేకెట్లవైపు అప్రయత్నంగానే తన దృష్టి మళ్ళుతూంది...పోనీ ఓకసారి కాల్చిచూస్తే...యింతకీ మన సంస్కృతిలో ఆడవాళ్లకి దీన్ని ఎందుకు నిషేధించేరుటా? ... కూడదన్నవి చేయటం ఒక ఫేన్ — బహుశ అందులోనే థ్రిల్ వుందేమో. ఈ థ్రిల్‌కోసమే కదా ఎంతో మంది వ్యసనాలకి దాసులయేది. ఈమధ్య ఎక్కడో చదివింది హాశిష్, మార్జువానా, హిరాయిన్‌లాంటి మందులమత్తుకు అలవాటుపడిన కొందరు అమెరికన్ యువకుల్ని మీరెందుకు వీటికి అలవాటు పడ్డారని ఒక విలేఖరి అడుగుతే 'ఒకసారి రుచి చూడండి మీకే తెలుస్తుంది ఆ థ్రిల్ ఏమిటో అన్నారట. ఎలా వుంటుందో మరి. తనూ ఈ థ్రిల్ మోహంలోపడి సిగరెట్లు తాగటం ... ఆపైన నిజంగా తాగటం మొదలుపెడ్తే ఎలా వుంటుందట? అయినా యిక్కడి సొసైటీలో అదేం అపరాధం కాదుగ...పైపెచ్చు వీటిని ఇక్కడి సొఫిస్టికేటెడ్ లేడీస్ విశాలభావాలకు చిహ్నంగ కూడా భావిస్తారు. తమ 'ఇన్నొసెంట్ చైల్డ్' వాటం చూసి నాన్నగార్కి హార్ట్ ఫెయిలయినంత పనౌతుంది. 'ఫ్రెండు ఫ్రెండంటూ మురిసిపోతావు గదూ...చూడు ఆవిడగారి నిర్వాకం' అని రంజనని సాధించి మనసారా సంతోషిస్తాడేమో వాళ్ళాయన. ఓహ్...ఎంత భయంకరంగా ఆలోచిస్తూంది తాను ... మేగాడ్ 'సేవ్ మి!'... 'రేపు కంగ్రాట్స్‌చెప్తూ రంజనకు లెటరు వ్రాయాలి. ఒకసారి ఏదో మాటల సందర్భంలో బోరుకొడ్తూంది అని తను రాస్తే... 'పెళ్లి చేసుకోవోయ్ బోలెడంత థ్రిల్' అంటూ సలహా పారేసింది. శాశ్వతంగా అందులో అడుగుపెట్టేముందు మెంటల్‌గా ప్రిపేరయి క్రొత్త జీవితానికి అనుకూలంగా ఎడ్జస్టవటానికి ప్రయత్నించింది. కాని మనస్సుమా ... వ్యక్తిత్వాన్ని ఆ క్రొత్త జీవితానికి అనుకూలంగా మార్చుకోలేదేమో తను అనిపిస్తుంది. ఒకరినొకరు అర్థంచేసుకుని సర్దుకుపోవటం సహజీవనానికి ముఖ్యం అంటారు. తన వ్యక్తిత్వానికి భంగం రానంతవరకు తనూ సర్దుకుపోతుందిగాని...తనని ఎక్స్‌ప్లాయిట్ చేస్తేమాత్రం సహించలేదు. సహజంగానే కాస్త అహంపాలు ఎక్కువగావుండే పురుషుడు తన భార్య అహాన్ని సహజంగా, తేలిగ్గా తీసుకోగలడా? 'తప్పులు చేయటం భర్తలకు చెల్లుతుంది... అధికారం వాళ్ళ జన్మహక్కనుకునే, భార్యలకుండాల్సిన అమాయకత్వం తనలో నశించిపోయిందేమో. వ్యక్తిత్వంలోనూ, మానసిక వికాసంలోనూ భార్యాభర్తలిద్దరూ సమానస్థాయి నందుకున్నపుడు తర్క—వితర్కాలు, విమర్శలు— విరుపులు తప్పవేమో. ఆత్మాభిమానం ఆత్మసమర్పణకు అడ్డురాదని గేరంటీ ఎక్కడుంది? వివాహం అంటె తనకు కొన్ని నిశ్చిత అభిప్రాయాలూ, ఆశయాలూ వున్నయ్. బహుశ తన వ్యక్తిత్వం వాటిని అందుకోలేదేమో. పరిపూర్ణతకు ప్రతిరూపంగా తాను భావించే ఈ బంధం తన జీవితంలోనే సమస్యగామారి అసంతృప్తికి కారణం అయితే భరించగలదా? ... ఏవేవో భయాలు ... ఎన్నెన్నో సందేహాలు. ప్రతివిషయాన్నీ చాలా కేజువల్‌గా తేలిగ్గా తీసుకునే తనకు ఈ పిరికితనం ఎక్కడనుండి వచ్చింది? అతిగా ఆలోచించటంవల్లేమో. ఇంత విమర్శనాత్మకంగా తరచిచూసే తను అందులోని ఆనందాన్ని అనుభవించలేదేమో? 'సెనల్సూ పెటల్సూ, వినాటమీ అంటూ చక్కటి పువ్వుల




"త్వరలో 'ఏ' సర్టిఫికేటు సినిమాలలో ముద్దులు చూపిస్తారట, అంటే ఇప్పటి 'యు' సర్టిఫికేట సినిమాలన్నీ చిన్నపిల్లలకి తగినవేననా అర్థం ?"

# మైక్రోస్కోప్

అర్థాన్ని పాడుచేస్తున్నారోయ్ మీరు' అంటూ రంజనని వేళాకోళం చేసేది తను. బహుశ పత్యాల్ని కముక్కోవటానికి తనూ జీవితాన్ని డిసెక్ట్ చేసి దాని అందాల్ని గమనించలేకపోతుందేమో. క్రొత్త జీవితంలో ఇమిడిపోవటానికి పాతబంధాల్ని తెంచుకుని వాటిని అతీతంలోకి నెట్టేసి ఎక్కడో గుండెల లోతుల్లో జ్ఞాపకాలుగా మాత్రం అట్టేపెట్టక తప్పదని ఆరోజు రమేష్ ప్రవర్తన చూసేక స్పష్టంగా అర్థం అయింది. తన మనసునూ, వ్యక్తిత్వాన్ని యింతగా తీర్చిదిద్దిన ఈ బంధాల్ని తాను తెంచుకోగలదా? ఇన్నాళ్ళూ తన ఊహల్లో, ఆలోచనల్లో, ఆశయాల్లో అనునిత్యం కదలాడే ఈ వ్యక్తుల్ని ఒక్కసారిగాతీసి అవతల పెట్టేయగలుగుతుందా ? రంజన... తన రంజనను స్మృతుల్లోకి నెట్టేయగలుగుతుందా?' ఈ ఆలోచనలు తనకే అస్తవ్యస్తంగా, అర్థం లేనివిగా అనిపించేయి శారదకు. 'తానూ ఎంత విచిత్రం అయిన మనిషి... భూమిగుండ్రంగా వుందన్నట్లు రాజాతో మొదలయిన ఆలోచనలు తిరిగి అక్కడికే వచ్చేయి. మనసును అల్లకల్లోలం చేసి తనని అస్తవ్యస్తం చేసిన ఈ ఆలోచనా ప్రవంతి బయలుదేరిన చోటికే వచ్చి ఆగింది. కళ్ళెంలేని గుర్రంలా పరిగెట్టిన తన మనసు తెగిపోతువ్నా యేమోనని భయపడిన ఆ బంధాల దగ్గరకే వెతుక్కుంటూ తిరిగి వచ్చింది. 'జీవితం పెద్ద విద్యాభ్యాసం' అని ఏ మహాన భావుడన్నాడో గాని నోబుల్ ప్రైజు యివ్వచ్చు. ఎంత భయపడినా...ఏం ఆశించినా జీవితం మాత్రం తన దారిన తాను వెళ్ళక మానదు. భయపెడ్తూనే ఆనందం అందివ్వటం, ఆనందంలో కూడా కాస్త చేదును రుచిచూపటం దీనికి అలవాటేమో. బహుశ ఆలోచనలు, భయాలు కూడా ఇలాటి విరోధాభాసాలేనేమో' ఎందుకో ఈ ఆలోచన బాగుందనిపించింది శారదకు...'ఐనా ఎప్పుడో ఒకప్పుడు వర్తమానంలో నిలబడి గతాన్ని, భవిష్యత్తుని తూచి చూసి ప్లస్ మైనస్‌ల బేరీజు వేసుకోక తప్పదేమో... తానేం సాధించాలనుకుంది ? ఏం సాధించింది ? ముందు ముందు ఏం సాధించబోతూంది??? ఏమో...తనకే తెలియదు. తృప్తి పడటాన్కి జీవితంలో సాధించిందీ లేదు ... అసంతృప్తిగా ఉందనుకోవటాన్కి కారణమూ లేదు ... అయినా ముందూ వెనుకా పెద్ద ప్రశ్న వాచకాలు... జవాబు వెతుక్కోవటాన్కి అసలు ప్రశ్న ఏమిటో అర్థం అయితే కదా ! బహుశ జీవితం గురించి ఆలోచించి ఆత్మ పరిశీలన చేసుకునే అందరికీ జవాబుగా లభించేవి ఆ అయోమయం అయిన ప్రశ్నలే నేమో... 'ఏమిటి...ఎందుకు అన్న ప్రశ్నల జోలికి పోకుండా నీ పనేదో నువ్వు చేసుకుపోతూండు...చేయటం వరకే నీ వంతు... చేయించేవాడిని నేను' అని అందుకేనేమో భగవానుడు హెచ్చరించింది......అరె! తను ఫిలాసఫీకూడా వల్లె వేస్తూందే...బహుశ తర్కానికీ బుద్ధికి కొరుకుడు పడని ప్రశ్నలకు, సమస్యలకూ సమాధానం అందులోనే లభిస్తుందేమో...అయినా అసలు తనకు సమస్యలంటూ ఏం వున్నాయని మహా...' మనసుకు నచ్చచెప్పకోబోయిన శారద యిక ఆపై ఆలోచించదల్చుకోలేదు. మనసుకూ, బుద్ధికీ గట్టిగా పగ్గాలు బిగించేసి బలవంతంగా కళ్ళు మూసుకుంది.

రాత్రి కలలో రంగురంగుల పూలమధ్య కూర్చుని సెక్షనులు తీస్తూ మైక్రోస్కోపు క్రింద టెస్టు చేస్తున్న శారదను లెన్స్ అడ్జస్టు చేస్తున్నకొలది పెద్ద వవుతూ వికటాట్టహాసం చేస్తున్న ప్రశ్న మార్కులు భయపెడుతూనే వున్నయ్. ●






మానవత్వపు చిక్కని పాలు విరిగి పోడానికేం జరిగింది? ఈ రోజుల్లో తోటివారికి కనీసం మాట సహాయం చేయడానికి కూడా ఎవరూ ముందుకి రారెందుకు?

ఒరోజు మధ్యాహ్నం పూట రోడ్డు దాటుతున్న నా స్నేహితురాల్ని ఓ కారు కొట్టేసింది. ఇటూ అటూ పేవుమెంట్ల నిండా జనం తిరుగుతున్నా— ఒక్కరు కూడా ఆమెకు సహాయంగా ముందుకి రాలేదట. పాదం మెలిపడి లేవలేని పరిస్థితిలో ఉందిట. కారు ఆగలేదు. ఏ మనిషి సహాయానికి రాలేదు. ఎలాగో కష్టపడి యిల్లు చేరుకుందిట ఇల్లు దూరమై, చేతిలో కాని లేక పోతే ఆమె గతి ఏమిటి?... గారడీ వాడి చుట్టూ అంతమంది జనం మూగుతారే చేతులు మూస్తే వాడి చుట్టూ అంతమంది జనం మూగుతారే — మనిషి కష్టంలో ఉంటే జనం ఎందుకు చేరరు? పోలీసు కేసులూ, సాక్ష్యాలూ అంటే భయంచేతనా? 'నాకెందు కొచ్చిన గొడవ' అన్న నిర్లక్ష్యమా?'

గర్భిణీ స్త్రీలూ ముసలివాళ్ళూ, పసివాళ్ళూ ఈ సాటివారి నిర్లక్ష్యం మూలంగా ఎలాంటి యిబ్బందులకి గురి అవుతూ ఉంటారో వూహించవచ్చు. ఇలాంటివన్నీ విన్నప్పుడే— మనం పూర్వం కంటే కఠినులంగా తయారవుతున్నామా అనిపిస్తుంది. లేక యితరుల బాధలతో అవస్థలతో చేయికలుపుతే — అవి ఎక్కడికి దారి తీస్తుందో మనకెందుకన్న దృక్పథమా?

అలా కాలుకి దెబ్బతగిలిన నా స్నేహితురాలికే ఎవరేనా సహాయంగా వచ్చి ఉంటే— ఏ టాక్సీనో పిలవాలి, ఎక్కించి ఇంటి దగ్గిర దింపాలి ఏమో టాక్సీ డబ్బులు యిచ్చుకోవలసి రావచ్చు! అలాంటి భయాలు పీడించవచ్చు. అంతేకాదు. అంత టైము కూడా ఉండకపోవచ్చు. 'అంతే కాదు ఇలా ఓసారి ఒకావిడ రోడ్డు మీద పడిపోతే పరుగు పరుగున వెళ్ళాను. ఆ హడావిడిలో నా పర్సు కాస్తా ఎవరో కొట్టేశారు!' అన్నాడో పెద్దమనిషి. 'అర్ధరాత్రి పూట కష్టంలో వున్నామని ఎవరేనా తలుపు తడితే తెరిస్తే—తీరా వాళ్ళు మన తల పగలగొడితే?' అందొకావిడ. ఇవన్నీ 'ఏమో అలా జరిగితే—' అనుకొనేవే ఇవన్నీ మన మనస్సు మనని వేధించకుండా సద్ది చెప్పుకోవడమే అనుకోవచ్చు. కాని గంపెడు జాలి ఒలకపోసేకంటే చిన్నమెత్తు సహాయం చేయడం మంచిదన్న సంగతి అక్షరాలా నిజం

నిజానికి ప్రత్యక్షంగా యిలా సహాయ సహకారాలందించే దమ్ము లేదు మనకి. మనలో మనకీ, పైవాళ్ల మీదా కూడా కావలసినంత నమ్మకం లేకపోవడమే దీనికి కారణం, అందుకే మనం ప్రత్యక్షంగా పాల్గొనక్కరలేని సేవా కార్యక్రమాలు, సంఘసేవా కేంద్రాలకీ విరాళాలు చందాలూ కట్టి మనస్సు తృప్తి పరుచుకుంటాం. పీడితులకు సహాయం చేసినట్టూ ఉంటుంది. వ్యక్తిగతంగా మనకి పాల్గొనవలసిన యిబ్బందీ ఉండదు!

ప్రపంచం మారుమూలలనుంచి ఏదో ఆపరేషన్ చేయించాలని అపీలు చేస్తే ఎంతో డబ్బు కూడుతుంది. మనం యిలాంటి వార్తలు చదువుతూనే ఉంటాం. ఇలాంటి దీనగాథలు దూరాన్నుంచి మన హృదయాలని ద్రవింపచేస్తాయి. దూరభారాలమున్న పెద్దలు చూడాలని పరితపించినా మనకి వెళ్ళడం పడదు. కష్టపడ్డం, యిష్టం ఉండదు. మనం దాన ధర్మాలు చేస్తూ ఉంటాం ఎందుకు? అది మన మనస్సు నోరు మూయించే ధర్మధనం అన్నా తప్పు లేదు. ప్రతి జీవి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడిలాంటి ధర్మధనం యిస్తూనే ఉంటాడు. నిజానికి డబ్బుకంటే కూడా మనం పక్కన నిలబడడం ఎక్కువ ధైర్యాన్నిస్తుందన్నప్పుడు యీ డబ్బిచ్చి ఊరుకోవడం — వెనక్కి ఆలోచించి చూస్తే బాధగానే ఉంటుంది.

ఇదివరలో అయితే డబ్బు విలువ ఎక్కువగా ఉండేది. అంచేత ఉన్న డబ్బు ఇతరుల మీద ఖర్చుపెట్టడానికి మిగిలేది కాదు. అంచేత మనమే ఆదుకుందుకు నిలబడే వాళ్ళం. మన టైము పైవారికోసం వెచ్చించకల్గే వాళ్ళం. మన ప్రేమాదరాలు అందించకల్గే వాళ్ళం కాని కొంచెం యిబ్బంది అయినా ఈ రోజుల్లో డబ్బివ్వడం సులభం. ఇతరత్రా జీవితంపై ఒత్తిడులు ఎక్కువ అవడమే దీనికి కారణం. కాని తీరా తీరికగా ఆలోచించి చూస్తే—యీ వత్తిడుల విలువ అంతకంత మాత్రమే అని తేలిపోక తప్పదు.

జోక్యం కల్గించుకోవడం అన్నది చాలా గమ్మత్తయిన విషయం. మనుషులు యిప్పుడూ దయకలవారే సహాయం చేయాలన్న కుతూహలం కలవారే. నాకెంతోమంది అలాంటి వాళ్ళు తెలుసు కాని ఎందుకు ఎప్పుడూ యీ సహాయం సమయానికి రాదు? అంటే —వారి వారి జీవితాల్లో పరిస్థితుల ప్రియారిటీనిపట్టి ఉంటుంది. ఓసారి కనుమూశాక మనం మళ్ళీ ఇదే రోడ్డున ప్రయాణం చెయ్యం కదా? అంచేత!— ●




సత్యం అనుకున్నంతా అయింది!

మనిషికి అనుమానమంటూ రాగూడదు గానీ, వెధవది వచ్చిందీ అంటే ఎక్కువ సార్లు అది నిజమే అయికూర్చుంటుంది.

రెండురోజులు ముందుగా—ముందుసీటు కావాలని బస్సులో రిజర్వు చేయించుకున్నా అది అతగాడికి దక్కకపోవటమే...

ఆర్టీసీవాళ్ళు ఒక్కోసారి ఇలాంటి అర్ధం లేని పన్లే చేస్తుంటారు — ఆ రిజర్వేషన్లలో-ఇద్దరు కూర్చుండే ఆ సీటుమీద మరో ఆడకూతురుకి సీటిచ్చారు-అలాంటి చప్పుపనికి డ్రైవరూ; తరువాత ఆ చెకింగ్ మాష్టరు క్షమాపణలు చెప్పకుంటే మాత్రం సత్యం ఇబ్బందేమైనా తీరుతుందా?

'మేష్టరూ! కండక్టరు సీటు ఖాళీ ... మీరు దయచేసి అక్కడ కూర్చోవాలి!' అన్నాడు వినయంగా డ్రైవరు.

'ఊహూ...' అన్నాడు పౌరుషంగా సత్యం.

పాపం ఆ అమ్మణి బిక్కమొఖం వేసుకొని సత్యం వంకే చూడసాగింది.

ఆ మొఖం చూస్తుంటే సత్యానికే జాలివేస్తోంది — అయితేనేం ఆర్టీసీ వాళ్ళ మీద ఏదో కసి — తను సీటెందుకు మారాలి?

చివరి సీట్లో సుబ్రభమణ్యం లేచి నిల్చొని, 'కావాలంటే ఇక్కడకు రావయ్యా బాబు...నేవెళ్ళి ఆ కండక్టర్ సీట్లో కూర్చుంటాను!' అన్నాడు అదేదో హీరోలా మొఖం పెట్టి.

వెనక్కు తిరిగి ఓ పురుగును చూచినట్టుగా ఆ సుబ్రభమణ్యాన్ని చూచాడు సత్యం.

ఆ అమ్మాయి తనవంకే చూస్తోంది!— అందునా జాలిగా!

ఛ! తనని ఆ అమ్మాయేమను కుంటున్నదో?

ఆ ప్రశ్న మనస్సులో ఉదయించిన మరుక్షణంలోనే పట్టుమీద పటుత్వం జారిపోయింది. అన్నీ మర్చిపోయి చటుక్కున లేచి నిలబడ్డాడు.

అప్పుడు రాత్రి పదిగంటలు అవ్వస్తోంది.

గుంటూరు వెళ్ళేటప్పటికి తెల్లవారి ఆరవుతోంది.

చంద్రం పెళ్ళి మిట్టమధ్యాహ్నం పన్నెండు గంటలకు!

సీటులో నుంచి లేచి, పైన పెట్టిన రెగ్జిన్ బ్యాగ్‌ను చేతిలోకి విసురుగ్గా లాక్కొని ఆ అమ్మాయి ముందుగా — ఆ అమ్మాయి 'కళ్ళల్లోకి ఒక్కసారి చూసి వచ్చేశాడు.

అలా వస్తుండగానే ఆసీత అన్నది: 'క్షమించాలి...మీకు ఇబ్బంది కలిగించాము!' తేలిగ్గా నవ్వేందిగూడా.

ఆ నవ్వుకు మరింతగా జారిపోయాడు సత్యం: 'ఫరవాలేదండీ !' అన్నాడు. అవి, "నవ్వుతుంది...నవ్వకేం చేస్తుంది...ఇద్దరు కూర్చుండేసీట్లో ఇక ఒక్కతే 'రింగు రంగా' అంటూ కాళ్ళబార జాపుకు కూర్చుంటుంది!' అనుకున్నాడు లోపలే ఈర్ష్యగా.

మనస్సంతా చికాగ్గా వున్నది.

రెండు రోజుల కితం రిజర్వు చేయించు కున్న తొమ్మిదోనెంబరు సీటుకు నువ్వులూ, నీళ్ళూ వదిలేశాడు.

డ్రైవరు 'ఠన్ ఠన్' మని గంట కొట్టాడు.

వదిగంటలవ్వటం బస్సుకదలటం ఒక్కసారే జరిగినయి.

వెధవది తనసీటు పోయింతరువాత—ఏవడిక్కావాలి ఈ బోడి పంక్చ్యుయాలిటీ!

అద్దంలోనుంచి అలోచిస్తూ బయటకు చూస్తుండగానే సందడి ఇట్టే తగ్గిపోయింది—అంతేగాకుండా జీబూ తాల్లా చెట్టు మీదిమీదికి ముసురుకు రాసాగినయి ...'ఏవిటా అని చూస్తూండగనే బస్సులో లైట్లుగూడా ఆరిపోయినయి.

ఏవిటో చుట్టూ ప్రదేశమంతా వెచ్చగా వున్నది.

అర్మ! ఇది కండక్టరుసీటు...అందునా ఇంజనుపక్కన!

ఒక్కసారి విసురుగా, విసుగ్గా ఆ చీకట్లోనే డ్రైవరు మొఖంలోకి చూచి ముందుకు చూడసాగాడు సత్యం.

వెన్నెల పిండి పారబోస్తున్నట్లుగా—పక్కన కొండలమీదనుంచి జారుతుంది.

ఆ అమ్మాయి—తన తొమ్మిదోనెంబర్ సీట్లో కాళ్ళు బారుజాపుకొని 'రింగు రంగా' మంటూ కూర్చున్న ఆ అమ్మాయి—మొఖం కళ్ళముందు మెదలసాగింది.—

ఆ అమ్మాయిని అంతకుముందే ఎక్కడో చూచినట్లున్న అనుమానమూ మెదడును తలవసాగింది.

'నీ అందానికి హేట్స్ ఆఫ్! సీతా!' అనుకున్నాడు.

ఛ! తను చాలా పొరబాటు చేశాడు.

అహో ... ఈ కండక్టర్ సీటులేక పోతేనో...

అవును—

క్షణం సర్వం మరిచి ముందుకు వంగాడు,

—ఏవయ్యేది?

తన పక్కన ... తన పక్కన — సీతకు కూర్చోక తప్పేదిగాదు!

నిజంగా?

ఛ! ఛ! ఆర్టీసీవాళ్ళకు బుద్ధిలేదు—నైటు సర్వీసులో కండక్టర్ వుండడని తెలుసుగదా — ఆ సీటెందుకు వుంచాలి?

— ఎందుకుంచాలి?

రేపు మళ్ళా హైదరాబాద్ రాగానే కంప్లెయింట్ బుక్‌లో రాసేయాలి!

ఆర్టీసీవాళ్ళు తనకు చేసిన అన్యాయానికి గానూ అమితమైన కోపమొచ్చింది సత్యానికి. అసహ్యంగా చూశాడు డ్రైవరు వైపుకు!

బస్సు తెగ మెలికలు తిరుగుతోంది.

—అవును! సీత తనను క్షమించమన్నప్పుడూ ఆమె పెదాలూ ఇలాగే మెలికలు తిరిగినయి...

ఎంత అందంగా తిరిగినయి!...

అసలు ఆమె అందాన్ని మరొకరి అందంతో పోల్చటానికే వీల్లేదు— చారడేసి కళ్ళలాగానే, చెవులకు చారడేసి రింగులున్నాయి. గడ్డంమీద అందంగా నల్లగా... పుట్టుమచ్చ, బ్యూటీస్పాటా?...

'అరేయ్! చలపతీ! బెట్‌రా ... ఆ అమ్మాయి పోటీకి నిలబడితే మిస్ ఇండియా ఖాయం!...' అన్నాడు అలవాటుగా చలపతితో బెట్ కడుతూ. —తరువాత తను బస్సులో కూర్చున్నాడని గుర్తుకొచ్చి సర్దుకు కూర్చున్నాడు.

కారు చెట్ల నడుమనుంచి దూసుకుపోతోంటే— తన ముందు గ్లాసులో సీతను చూస్తున్నాడు సత్యం...

అసలు ఇంతకుముందు ఆ అమ్మాయిని ఎక్కడ చూశాడు తను? సుల్తాన్‌బజారులోనా?... ఎగ్జిబిషన్‌లోనా?... సాలార్‌జంగ్ మ్యూజియంలోనా?...

ఉహూఁ...ఎక్కడో చూచాడు!

'అయ్యా! డ్రైవర్ బాబూ ... సీత నెత్తిమీదగా ఆ చిన్న లైటు వేశారు... ఆ పాపాయి మొఖం... మన యెదురుగ్గా గ్లాసులో పావలా కనబడుతుంటుంది...తరువాత మనకు నిద్రంటూ రాదు ... ఇక చూస్కో... నీ యిష్టమొచ్చినంత స్పీడులో పో... నన్ను సవ్యంగా మా చంద్రిగాడి పెళ్ళికి అందిస్తే సరి!'

అలా అనుకుంటుండగానే వీ గ ఓ ముందుకుపడ్డాడు.

సత్యవే గాదు... ప్రయాణం చేస్తున్న బాబురావులంతా ఎగిరిపడ్డారు...

దాని క్కారణం — ఆ డ్రైవర్‌బాబు బ్రేకును కిసుక్కున తొక్కేసి, లెఫ్ట్‌కు కోసి, రైటుకు లాగించి మళ్ళీ రోడ్డుమీద పోసాగాడు.

'అరేయ్! బెట్‌రా చలపతీ! సీత ముందుకు పడలేదు ... ఎందుకంటావా ... ఇద్దరు కూర్చుండే సీట్లో—పక్కకు తిరిగి వడుకున్నట్లుగా కాళ్ళబారచాపుకు కూర్చున్నది గనుక!'

అసలే గులాబిరంగు మనిషి. దానికితోడు గులాబిరంగు చీరె, గులాబిరంగుజాకెట్టూ—అవును, బొట్టుకూడా అదే రంగు కదూ— ఉహూఁ...ఈసారి జాగ్రత్తగా చూడాలి!

'సీతా! నా పేరు సత్యం... నిన్ను కష్టాల్లో ఆదుకున్నది నేనే... కావాలని రిజర్వుచేయించుకున్న ఆ తొమ్మిదోనెంబరు సీటును నీకిచ్చేసింది నేనే! గుర్తుంచుకో...'

'గుర్'మని మ్రోత రాసాగింది...

పక్కకు చికాగ్గా మొఖం తిప్పాడు — తెల్లవార్లు ఇదో బోర్ కాబోలు...

బస్సు కాస్త చిన్నగా ఆగిపోసాగింది.

రోడ్డుపక్కన నిలబెట్టాడు డ్రైవరు బస్సును...

చుట్టూ అంతా మైదానం...

విడమనైపుగా పెద్ద కొండ...

డ్రైవర్ సీట్లోనుంచి లేచి బాయినెట్ ఎత్తాడు.

'ఏమైంది?' సత్యం అడిగాడు.

డ్రైవరు కళ్ళెత్తి చూచాడుగాని సమాధానం చెప్పలేదు.

సత్యానికి కోపమొచ్చింది.

అయినా తమాయించుకున్నాడు.

బాయినెట్ ఎత్తిన డ్రైవరు ఇంజన్‌లోకి వంగాడు.

ఏదో 'ఛుక్...ఛుక్' మనిపించాడు...అవి తిప్పాడు...ఇవి తిప్పాడు. మొఖంమీద చెమటను చెయ్యి మడతేసి తుడుచుకున్నాడు...

'ఏమైంది?' మళ్ళీ అడిగాడు సత్యం.

'ఎయిర్ లాక్ అయ్యింది, సార్!'

'అంటే—'

'ఇక బండి నడవదు!'...

'అరె...ఇప్పుడెట్లా!' లేచి నిలబడ్డాడు

## లిట్ క్విజ్ నెం. 93 అధికార ఎంట్రీ ఫారము

ముత్తము బహుమతి: రు. 1,15,000/— ఆఖరు ముగింపు తేది 8—3—72 గురువారం

ADDRESS LITQUIZ No 93 ALANKAR BALARAM STREET, BOMBAY-7.

గమనిక: — 1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. 3. ఎంట్రీ రుసుము M. O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M. O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. 4. I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 93, మార్చి 7 నాటికి చెల్లించునట్లు ఉండవలెను.

| MAIN | 1 Re. 1 | | 2 Re. 1 | | 3 Re. 1 | | 4 Re. 1 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION |
| 2 | AGE | ART | AGE | ART | AGE | ART | AGE | ART |
| 3 | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY |
| 4 | BOOR | BORE | BOOR | BORE | BOOR | BORE | BOOR | BORE |
| 5 | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM |
| 6 | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE |
| 7 | FARMING | FIGHTING | FARMING | FIGHTING | FARMING | FIGHTING | FARMING | FIGHTING |
| 8 | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS |
| 9 | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY |
| 10 | LIFE | LOVE | LIFE | LOVE | LIFE | LOVE | LIFE | LOVE |
| 11 | PAINTER | THINKER | PAINTER | THINKER | PAINTER | THINKER | PAINTER | THINKER |
| 12 | PERSON | PRODUCT | PERSON | PRODUCT | PERSON | PRODUCT | PERSON | PRODUCT |

## BIGQUIZ

ONE COUPON FREE WITH EACH MAIN COUPON

| 93 | FREE 1 | | FREE 2 | | FREE 3 | | FREE 4 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION | ACQUISITION | AMBITION |
| 2 | AGE | ART | AGE | ART | AGE | ART | AGE | ART |
| 3 | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY | BEAUTY | CALAMITY |
| 4 | BOOR | BORE | BOOR | BORE | BOOR | BORE | BOOR | BORE |
| 5 | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM | COMPETITION | CRITICISM |
| 6 | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE | DEFEND | DESCRIBE |
| 7 | FARMING | FIGHTING | FARMING | FIGHTING | FARMING | FIGHTING | FARMING | FIGHTING |
| 8 | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS | GREATNESS | SUCCESS |
| 9 | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY | JEALOUSY | LUNACY |
| 10 | LIFE | LOVE | LIFE | LOVE | LIFE | LOVE | LIFE | LOVE |
| 11 | PAINTER | THINKER | PAINTER | THINKER | PAINTER | THINKER | PAINTER | THINKER |
| 12 | PERSON | PRODUCT | PERSON | PRODUCT | PERSON | PRODUCT | PERSON | PRODUCT |
| 13 | RICHES | WISHES | RICHES | WISHES | RICHES | WISHES | RICHES | WISHES |
| 14 | SAVAGERY | TREACHERY | SAVAGERY | TREACHERY | SAVAGERY | TREACHERY | SAVAGERY | TREACHERY |
| 15 | SEVERITY | SOLEMNITY | SEVERITY | SOLEMNITY | SEVERITY | SOLEMNITY | SEVERITY | SOLEMNITY |
| 16 | WEALTH | WISDOM | WEALTH | WISDOM | WEALTH | WISDOM | WEALTH | WISDOM |

## MINIQUIZ

FREE AFTER 4 MAIN (& 4 BIGQUIZ) COUPONS

| | | | |
|---|---|---|---|
| ACQUISITION | AMBITION | PERSON | PRODUCT |
| AGE | ART | RICHES | WISHES |
| BEAUTY | CALAMITY | SAVAGERY | TREACHERY |
| BOOR | BORE | SEVERITY | SOLEMNITY |
| | | WEALTH | WISDOM |

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీ ఫారము ఫీజు రు. 4/— M. O. రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు / ప్రైజు కార్డు జతపరుస్తున్నాను.

వాటి నెం.. ........ . ..

నెం. 94 ఫారములు పొందుటకై దీనిని పూర్తిచేయండి. ఇంగ్లీషులో పెద్ద అక్షరాలతో వ్రాయండి

FULL NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST ................ DIST. ..........

93 (ASVP)

FULL NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST .............. DIST ...........

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

# ఉచిత

# పెద్ద & చిన్న

# సమస్యలు

### గమనిక

ఇవి కొటేషనులు. రచయితల పదములే యిందుకు సరియైన సొల్యూషనులు. రచయితల పేర్లు, పుస్తకములు, పేజి నెంబర్లు తేది 12—3—72 గల లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును. ఇందుకు సంబంధించిన అధికార పూర్వకమైన సొల్యూషన్ కూడా తేది 12—3—72 గల ఆంధ్రప్రభ మరియు సండేస్టాండర్డునందు ప్రచురింప బడును. బహుమతి పట్టీ లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును. అడ్వాన్సు 19—3—72, ఫైనల్ 26—3—72, సంగ్రహం— సండే స్టాండర్డ్ 26—3—72. ఇందుకై 10 పైసలు, స్వంత అడ్రసు గల పోస్టు కార్డు మీ ఎంట్రీలతో పంపిన ప్రకటింపబడిన వెంటనే సొల్యూషన్ మీకు పంపబడును.

ప్రస్తుతపు లిట్‌క్విజ్ వీక్లీ కాపీ అడిగి, ఉచితంగా పొందండి.

ఏజంట్లు క్యాష్ రసీదులు, ఎంట్రీ ఫారములు లిట్‌క్విజ్ వీక్లీ ఈ ఏజెంట్ల వద్ద లభిస్తున్నవి:

మద్రాసు స్టార్ న్యూస్ ఏజన్సీ, 186, బ్రాడ్వే కార్నర్.

విజయవాడ శ్రీనివాస ఏజన్సీస్, ఏలూరు రోడ్డు, గవర్నరుపేట.

హైదరాబాద్: సెవెన్ సీస్, (షాప్ నెం. 48180) ఏస్, బషీరాబాగ్ ప్యాలెస్ గార్డెన్స్.

# రు. 4 లకు 9 కూపనులు

గుబురులా ఒకటి రెండుచెట్లు...అయితేనేం చల్లటిగాలి ప్రాణానికి ఎంతో హాయిగా వున్నది!

డ్రైవరుబాబు అడిగిన అడ్డమైన ప్రశ్నలన్నిటికీ వోపిగ్గా సమాధానం చెబుతున్నాడు.ట

వాటిసారాంశం: ఏదైనా బస్సు హ్యాదరాబాద్ వెళ్తే ది కనబడితే దాంట్లో అతగాడు వెళ్లి రిలీఫ్‌ను పెట్టుకువస్తాడు అది వస్తేనే ప్రయాణీక మహాశయులకు మోక్షం!

గో...హిందా...

భక్తజనులారా!...వివరికి వారు దారి చూచుకుందురు...సీట్లమీద పడుకుందురో లైటువేసుకొని తువ్వాలులు పరిచి చిల్లర డబ్బులతో పేకాడుకుందురో' — ఎవరో భక్తాగ్రేశరుడు అరిచాడు!

'షుమారు ఎంతసేపు పడుతుందంటారు?'

'గంటపట్టవచ్చు... రెండు గంటలు పట్టవచ్చు...నాలుగు గంటలు పట్టవచ్చు... లేదా తెల్లవారవచ్చు!' డ్రైవర్ బాబు ఉవాచ.

'భోజనకాలే ... భగవన్నామస్మరణా ... గోహిందా!'

సత్యం లోపలకు ఎక్కాడు. సీత సీటు ఎదురు సీట్లో సీతతో మాటలు కలిపేటందుకు అన్నట్లుగా కూర్చున్నాడు.

'మనం ఎప్పుడు ఇక్కడనుంచి వెళ్లగలిగేది...ఆపైన వున్నవాడికే తెలుసుట!'

'యిప్పుడెలా మరి!'

'బస్సులో కునికిపాట్లు పడటమే!'

'అయ్యో!...ఛీ! ఛీ! ఇవాళ లేచినవేళ మంచిదిగాదు ..మా తమ్ముడినీ తీసుకు వచ్చినా బాగుండేది ... నే నే వ ద్ద ని ఉంచేశాను!'

'రక్షించావు, సీత!' అనుకున్నాడు సత్యం.

'మీరు సత్యంగారు గదా!' అన్నది అతడి మొఖంలోకి తదేకంగా చూస్తూ.

సత్యం షాక్ కొట్టినట్లుగా కలవరపడ్డాడు.

'మీకెలా తెలుసు?' అన్నాడు వంగి వంగిగా.

'నేను రామ్మూర్తి చెల్లెల్నండి!' అన్నది నవ్వుతూ.

# మాయ

ఇప్పుడు తెలిసింది సత్యానికి...ఆ అమ్మాయిని ఇదివరకు ఎక్కడ చూసింది... రామ్మూర్తి చంద్రం మిత్రుడు...చంద్రంతోటే తను ఒకటి రెండుసార్లు వాళ్లింటికి వెళ్లాడు!

'అయితే మీరూ చం దం పెళ్లికేనా? రామ్మూర్తిగారేరి?' ... ఉత్సాహంగా అడిగాడు.

లేదండి...నేను అర్జంటుగా వెళ్లవలసి విజయవాడకు బయిల్దేరాను...రేపేగదూ చంద్రంగారి పెళ్లి... అన్నయ్యకు ఏదో పని ఉన్నదల్లే వున్నది...బయిల్దేరలేదు!'

అంత మిత్రుడైన రామ్మూర్తి చంద్రం పెళ్లికి రాకపోవటం సత్యానికి విచిత్రంగానే అనిపించింది.

'మీ పేరు శారద గదూ?'

'అవునండీ!'

శారద శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది — కన్నార్పకుండా మ[redacted]డు కే చూస్తున్నది.

సత్యమూ శారదను కన్ను లార్పకుండా చూస్తున్నాడు — ఎంత అందమైన దా మొఖం?

'బయట చల్ల గాలిలో నిల్చుందాం పదండి !'

ఉలిక్కిపడింది శారద...ఏదో మగతలో నుంచి ఊడిపడ్డట్లుగా కళ్లు రెపరెపలాడించింది. కలవరపాటుగా సత్యం మొఖంలోకి చూడసాగింది.

'క్రిందకు దిగుదామండి !'

'పదండి !'

ఇద్దరూ క్రిందకు దిగారు.

ఆ వాతావరణం చాలా హాయిగా వున్నది సత్యానికి...పండు వెన్నెల...చల్లటి గాలి...పక్కనే ఓ అందమైన పడతి...

కాని—తెలిసిన అమ్మాయి అనుకుందేటప్పటికిల్లా ఇదివరకటిలా ఊహించుకోలేకపోయాడు ఆ అమ్మాయిని... ప్రేగా మాట్లాడ లేకపోతున్నాడు.

దూరంగా కళ్లు పక్కకుతిప్పి చూశాడు.

సన్నగా, పొడుగ్గా, ఆ వెన్నెల్లో మంచు బొమ్మలా మెరిసిపోతోంది...

..మోకాల్లో నిలంరాళ్ళ గొలుసు...

'కాస్త అలా నడుద్దామా అండీ...'

'మొత్తానికి చంద్రంగారు పెళ్ళి చేసుకుంటున్నారు!' అన్నది.

రెండడుగులు సత్యం వెనుకగావ...

'ఎంత వుచ్చుకుంటున్నారు కట్నం!'

'తెలియదండీ!' ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూడసాగాడు. ఆమె మాటల్లో విరుపు అతడికి అర్థం కాలేదు. 'కనీసం పదిహేను వేలు ఉండకపోతుందంటారా?'

నవ్వి వూరుకుంది శారద.

ఇద్దరూ చాలా చిన్నగా నడుస్తున్నారు.

ఇద్దరినీ మౌనం తెరలా అడ్డుపెడుతోంది.

'...కాస్సేపు ఇక్కడ కూర్చుందామా అండీ!' అన్నది ఓ వంతెన గట్టును చూస్తూ—ఓ పదినిముషాల తరువాత!

అప్పటికే వాళ్ళు బస్సు దగ్గరనుండి ఓ ఫర్లాంగు దూరం నడిచారు.

'అలాగే!...'

జేబురుమాల పరిచాడు. శారదా జేబురుమాల విడదీసి వేసింది.

ఇద్దరూ కూర్చున్నారు ఆ వంతెన మీద.

ఆ వంతెన క్రిందగా ఎండిపోయిన చిన్న కాలువ...అంతా నిశ్శబ్దంగా వున్నది...ఏదో టాక్సీ దూసుకుపోయింది...

పక్కన ఎక్కడో నక్క ఏడుపు...

అటువైపు చూశాడు.

కాలువ పక్కగా సమాధులు కనపడ్డాయి. చుట్టుపక్కల ఎక్కడా ఊరు లేకపోయినా అక్కడ సమాధులుండటం చూచి ఆశ్చర్యపోయాడు సత్యం. అట్టే చూస్తూ ఉండిపోయాడు

అందులో మధ్యగా ఎత్తుగా వున్న—నల్లబడిపోయి, సగం విరిగిపోయిన సమాధి మీద ఓ గద్ద వాలివున్నది.

—శారద పక్క పాపిడి తీసింది. జడ వదులుగా అల్లుకున్నది...

'అసలు సమాధులు ఎందుకు కడతారు?' శారద ప్రశ్నకు ఉలిక్కిపడ్డాడు సత్యం.

ఒక్కక్షణం ఆగి, ఆమె వైపు చూస్తూ, 'జ్ఞాపకం అలా వస్తున్నది!'

శారద నిట్టూర్పు విడిచింది.

'చచ్చినమనిషి చెదకుండా కప్పేస్తోందని?' అన్నది జాలి పడుతున్నట్లుగా.

సత్యం మాట్లాడలేకపోయాడు.

'పూర్వంనుంచీ ఇలాంటివే కొన్ని ఆచారాలు — మనుష్యుల్ని సమాధుల్లా కప్పేస్తున్నాయి కదూ...ఆ సమాధుల మీద రాబందులూ వాలుతున్నాయి!'

విస్మితంగా శారద మొఖంలోకి ఆ వెన్నెల్లో చూడసాగాడు.

నవ్వింది శారద బరువుగా.

'ఛ! ఎందుకీ వెధవ కబుర్లు...మరింకేదైనా మంచివి మాట్లాడుకుందాం చెప్పండి!'

ఆమె నవ్వితే బాగుంటుందనిపించింది సత్యానికి. ఆ బుగ్గల్లో సొట్టలు...ఎందుకూ నవరత్నాలే ఏరుకోవచ్చు ఈ వెన్నెలలో...

తనూ శారదా...బోటు షికారు ... ఆమె తల తన ఒళ్లో అందేలా ఆకాశంలో మేఘాలు ... గాలిలో తేలిపోతున్న ఆమె పమిటే పడవ తెరచాప...

'ఇదివరకెప్పుడన్నా చంద్రం గారితో మా యింటికి వస్తుండేవారు...ఈ మధ్య అసలు రావడమేలేదు!' కళ్ళల్లోకి చూస్తూ అడుగుతున్నట్లే అనిపించింది సత్యానికి.

'ఏదండీ ... ఆఫీసులో పని ఎక్కువయింది...అది పుస్తె కట్టిన పెళ్ళాం కంటే గూడా గుదిబండ అయిపోయింది !' హాయిగా నవ్వాడు.

ఆ వెన్నెల్లో మీద మల్లెలు కురుస్తున్నట్లే అనిపిస్తోంది.

'అంటే పుస్తె కట్టిన పెళ్ళాం ఓ పెద్ద గుదిబండ అనా మీ ఉద్దేశ్యం ?' ఫక్కున నవ్వింది.

సత్యమూ తేలిగ్గా, హాయిగా నవ్వాడు.

'పెళ్ళయితేగాని నిజం తెలియదు...నలుగురూ అనే మాటనే నేనూ అన్నాను!'

'—శారదా! నీవే నాకు తోడయితే ఆ సామెత వచ్చి అబద్ధమని నిరూపిస్తాను గూడా—' అని లోపలే అనుకున్నాడు.

శారదా సత్యం మాటలకు నవ్వింది.

హైద్రాబాద్ వైపుకు వెళుతున్న కారును అందరూ కలిసి ఆపినట్లున్నారు... జనం మూగారు...కొద్ది నిముషాల తరువాత డ్రైవర్ను తీసుకొని కారు బయల్దేరింది.

శారద వైపుకు చూచాడు సత్యం...

దూరంగా...సమాధుల మీదగా ఇంకా వెక్క ఏడుపు వినిపిస్తూనే వున్నది...

'నాకు ఆ ఏడుపు వింటుంటే భయమేస్తున్నది!' అన్నది శారద.

'బస్సు దగ్గరకు వెళ్దామా ?' ఆమె మొఖంలోకి చూస్తూ అన్నాడు.

అలాగే ఆమె మొఖంలోకే చూస్తూ వుండిపోయాడు.

శారదే తనదైతే...

—మనస్సంతా ప్రఫుల్లమయింది.

'బి. ఏ. పాసయితే ... ఇంకా చదువుతారా?' అడిగాడు.

'దొరికితే ఉద్యోగం చేయాలని వున్నది ...కాని, రాబందులంటే నాకు భయం !'

అధాట్టుగా తలెత్తాడు.

'అంటే మీ ఉద్దేశ్యం ?'

'ఉద్దేశ్యాలేమున్నది...నా అందం నన్ను నాశనం చేస్తుందేమోనని భయంగా వున్నది!' గిరుక్కున మొఖాన్ని పక్కకు తిప్పుకున్నది.

'ఎందుకనుకుంటున్నారు మీరు అలా అని!' దొంగలా భయం భయంగా అడిగాడు —తనను అపార్థం చేసుకోవటం లేదుగదా, శారద!

ఒక్కక్షణం ఆమె తటపటాయించింది. నిట్టూర్పు విడుస్తూ, 'ఎవరిదాకాను ఎందుకు? చంద్రంగారే నామీద ఓ రాబందై వాలబోయారు!'

'శారదా!' ఆవేశంగా ముందుకు వంగాడు సత్యం. 'ఏమిటి మీరంటున్నది ?'

'నిజం! మా అన్నయ్య మిత్రుడిగా ఆయనను గౌరవించాను ... చనువుగా తిరిగాను...విద్యావంతుడిగా అభిమానించాను... మంచి మనస్సు ఉన్నవాడని ప్రేమించాను... నన్ను నన్నుగా గౌరవిస్తారని ఆశించాను...'

'ఏమైంది?' విభ్రాంతిగా ఆమె మొఖంలోకే చూస్తూ వుండిపోయాడు సత్యం.

'—ఆయనా ఓ మామూలు మనిషిలా ప్రవర్తించాడు!'

'అంటే!'

ఆమె కంఠానికి దుఃఖం అడ్డు పడింది. తల బరువుగా అటూ యిటూ ఊపింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రుమన్నాయి.

'వద్దు పోనీయండి ... నన్ను గతాన్ని మర్చిపోనివ్వండి ... ఇప్పుడవన్నీ వద్దు!' నూతిలోనుంచి మాటలు వినబడ్డట్టుగా వినబడుతున్నాయి.

మంచు బొమ్మలాంటి ఆమె కరిగి నీరైపోతునట్లే అనిపిస్తోంది.

'ఏమైనా అసభ్యంగా ప్రవర్తించాడా?'

తల అడ్డంగా ఊపింది. 'అంతవరకూ అదృష్టవంతురాలినే నేను... నన్ను నేను రక్షించుకోగలిగాను!'

'మరి...?'

చెప్పలేదు శారద. చటుక్కున లేచి నిలబడింది.

'ఏమైంది శారదా ... ఏంజరిగింది ... చెప్పండి ప్లీజ్!' బుజాలు పట్టుకొని ఆమె కళ్లల్లోకి చూస్తూ అడగాలనిపించింది.

సత్యమూ లేచి నిలబడ్డాడు.

'చెప్పండి...ఏమైంది.'

'నేను లేందే బ్రతకలేనన్నారు ... నన్ను విడిచి ఒక్క క్షణం ఉండలేనన్నారు...నేను తన సర్వస్వం అన్నారు ... నేనే తన న్నారు...' ఆమెకు దుఃఖం ఆగలేదు.

'మరి మిమ్మల్నెందుకు వివాహం చేసు కోవటం లేదు?...ఒక్క అడుగు ముందుకు వేశాడు సత్యం.

'నేను కట్టుకున్న ఆశా సౌధాలు ... వెలిగించుకున్న దీపాలు రప్ మన్నాయి ... ఆయనగారికీ నాకూ నడుమ యిరవై వేల రూపాయల కట్నం అడ్డుగోడలు కట్టి వేసింది...ఇనప తెరలను దించి వేసింది!'

'ఓరి రాస్కెల్...అంత బుద్ధిహీనంగా ప్రవర్తించాడా?'

దూరంగా ఇంకా నక్క ఏడుస్తూనే వున్నది.

—ఎందుకు అంత ఆస్థి వుంచుకొని కట్నం కోసరం కక్కుర్తిపడటం ... శారద అందం ముందు ఆ కట్నపు విలువ ఎంత?

'ఛీ! ఛీ!...'

# మాయ

'మా సంగతి తెలుసు ... మా స్థితి గతులు తెలుసు ... అంతదాకా ఎందుకు మా అన్నయ్య మనస్సు తెలుసు ... వాడు నయాపైసా కట్నం పుచ్చుకోలేదు...నాకూ నయాపైసా కట్న మివ్వడని తెలుసు ... అన్నీ తెలిసి ఆయన నాతోనూ, నా మనస్సు తోనూ ...' చటుక్కున మొఖం తిప్పు కున్నది.

సత్యానికి ఆవేశమొచ్చింది.

నరాల్లో రక్తం ఉరకలు పరుగులతో పారసాగింది. అతడు ఊగిపోతున్నాడు ...

'నీవేం బాధపడబోకు శారదా!...ఇంతలో దిగులుపడవల్సిన అవసమేమీ లేదు ... నీ వనుకుంటున్నట్లుగా అందరూ రాబందులు గాదు...నేనున్నాను... నేనున్నాను శారదా... మనం చంద్రదంలా మేడల్లో ఉండలేక పోవచ్చు... కార్లల్లో తిరగలేక పోవచ్చు ... విమానాలు ఎక్కలేక పోవచ్చు...కానీ, మంచి మనుష్యుల్లా, నిర్మలమైన మనస్సులతో స్వర్గంలోలా మనుకున్నదాంట్లోనే ఉండ గలుగుతాం... పూలపల్లకీలలో తిరగ గలుగు తాం...' అతడి ఛాతి ఎగిరెగిరి పడుతోంది. అతడు ఆమె ముందుకు వచ్చేశాడు.

శారద వింతగా సత్యం మొఖంలోకి చూడసాగింది.

ఆమె అందాన్ని సత్యం కళ్ళతో త్రాగే స్తున్నాడు.

ఆమె అందంలో... లీనమై పోసాగాడు. ఆమెలో కరిగిపోసాగాడు. పండువెన్నెల్లో దేవకన్యలా మెరిసిపోతున్న ఆమె ముందు నిలబడి తనని తాను తమాయించుకోలేక పోతున్నాడు.

'నిజం శారదా!...మన భావి జీవితమంతా ఓ నందనోద్యానవనమే ... మనకు ప్రతిదీ పూలబాటే... ప్రతిక్షణం స్వర్గమే... నీవు ఊఁ అంటే...మన వివాహాన్ని నిముషాల మీద జరిపించే పూచీ నాది...!'

ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అతడి మొఖం మీదగా వేడిగా జారిపోతున్నాయి.

'క్ష మిం చం డి ... మీరు ఆవేశపడు తున్నారు ...' ఒక్కక్షణమాగింది; 'నాకు మ్యాచ్ సెటిల్ అయింది...బెజవాడలోనే!' అన్నది ఎటో చూస్తూ — ఒక్క అడుగు వెనక్కువేసింది.

సత్యం అధాట్టుగా తూలి పడ బోయాడు.

అతడి నెత్తిన ఏదో రాయి విరిగి పడ్డట్లయింది...నిభాయించుకోలేక పోతున్నాడు.

తలంతా బరువెక్కింది కళ్ళముందు వెన్నెల నల్లరంగును ఫులుము కుంటోంది.

శారద దూరంగా... దూరంగా...మరింత దూరంగా జరిగిపోసాగింది...

తను అగాధంలోకి జారిపోతున్నాడు... చుట్టూ చీకటి ... రాళ్ళు ... ముళ్ళు ... గోతులు...దొర్లిపోతున్నాడు.

సమాధాలు...రాబందులు...

చుట్టూ ఎక్కడా ఇళ్ళులేవు...అయినా సమాధులు ... రాబందులు ... నక్కలు ... ఏడ్పులు...సమాధులు...రాబందులు...సమాధులు...వాటిమీద రాబందులు...

సత్యానికి చటుక్కున వాళ్ళ నాన్న గుర్తుకు వచ్చాడు.

పెళ్ళి కావాల్సిన ఇద్దరు చెల్లెళ్ళు గుర్తుకు వచ్చారు.

తన పెళ్ళితో— తన చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు ముడిపెట్టుకు కూర్చున్న తండ్రి కోరికే గుర్తుకు వచ్చింది...

—ఇంకా నయం, తను అన్న మాటలు వింటూనే ఆమె 'ఊఁ' అనలేదు!

అతడు అగాధంలో నుండి సమాధుల

మీదగా లేస్తున్నాడు... ●



# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## వారణాసిలో నరమాంసభక్షకుడైన సాధువు!

శరీరం భయంతో ముడుచుకుపోయే సంఘటన ఒకటి వారణాసిలో జరిగిందట. గంగానది ఒడ్డున రక్తపు మరకలు చూసిన పోలీసులు అనుమానంతో ఆ మరకల వెంట పోయేసరికి కాస్త దూరంలో ఓ మొండెం దొరికిందట. మరి కాస్త దూరం వెళ్లేసరికి ఓ గుడిశ కనబడిందట. ఆ గుడిసె లోపలకు వెళ్లి చూస్తే ఒక సీసాడు పచ్చి నెత్తురు, చక్కగా వేయించిన మనిషి లివరు (కాలేయము) వున్నాయట. పాతికేళ్ళ వయస్సుండి, సాధుగారుగా చలామణి అవుతున్న ఏ మహానుభావుడు అమాయకుడైన ఒక్కో మనిషిని పట్టి, విడిగా తెచ్చి, చంపి, అతని లివరు తిని, రక్తం తాగుతున్నాడట. పెరటో అనుమానం మీద ఒకచోట త్రవ్వితే ఓ తల దొరికిందట. మరి కాస్త దూరంలో నరికేసిన కాలొకటి నో చెట్టుకు వ్రేలాడుతోందట. వారికి దొరికిన మొండెము, తల, ఒకకాలూ వల్ల ఆ శవం ఒక కుష్ఠురోగిదని పోలీసు తీర్మానించింది. ఈ నరమాంస భక్షకుడైన సాధుగారు యిలా చాలామందిని గుటుకాయి స్వాహా చేస్తుండుండాలని పోలీసు విశ్వసిస్తోంది. అతికష్టం మీద పోలీసులు ఆ నరమాంస భక్షకుణ్ణి పట్టుకున్నారట.




## ఆరోగ్యసూత్రాలు!

జపాన్‌లో కల్లా మిక్కిలి వృద్ధుడైన జపాన్ టకాశా అనే ఆయన ఫిబ్రవరి ఒకటవ తేదీన తన 108వ ఏట చనిపోయారట. ఆయన 1863 డిసెంబరు ఏడవ తేదీన జన్మించారట. నేను ఎన్నడూ మద్యం సేవించలేదు. పొగ అతిగా త్రాగలేదు. పెందలకడనే లేవడం, పెందరాళే పడుకోవడం, ఏ విషయాన్ని గురించి కూడా ఎక్కువగా ఆలోచించి బుర్ర పాడు చేసుకోకుండా వుండడం—ఇవే నా ఆరోగ్య రహస్యాలు అంటుండే వారట ఆయన—

## కావాలనుకున్నప్పుడు పెరగనిదీ, అక్కర్లేదనుకున్నప్పుడు తగ్గేదీ ఏది?

సునాయాసంగా చేసుకునే గర్భస్రావాల వల్లా గర్భనిరోధకసామగ్రి హాయిగా దొరకడంవల్లా దేశంలో పుట్టుకలు దారుణంగా పడిపోతున్నాయని, ఇది దేశ అభ్యుదయానికే భయంకరమైన గొడ్డలిపెట్టు అవుతుందని తూర్పుయూరపు ప్రభుత్వం భయపడుతున్నదట. గర్భం ధరించిన వారిలో సుమారు 60 శాతమైనా (హంగేరీలో) గర్భస్రావం చేసుకుంటున్నారని, సోవియట్ యూనియన్‌లో కూడా అంతే వుంటుందని, బల్గేరియాలో 100కి 44 మందని, జకోస్లోవేకియాలో 36 శాతం, పోలండులో 23 శాతం గర్భిణీస్త్రీలు గర్భస్రావం చేయించుకుంటున్నారని అధికార వార్తలన్నాయి. రుమేనియా వంటి దేశాలు గర్భస్రావం నేరంగా పరిగణించి, చట్టాన్ని మరికాస్త పకడ్బందీ చేశాయట. దేశానికి ఏది కావాలన్నా వస్తుంది కానీ, కావాలని ఎంత మొత్తుకున్నా ప్రజలు గమ్మున పుట్టుకుని రారుకదా! సత్యంఖలు ఏతత్.




## ఆత్మహత్యలు—అతివల ఆధిక్యత

ఆత్మహత్యల ద్వారా చావును పెరుకోవడంలో స్త్రీలదే పైచేయి అని బెంగళూరు పోలీసుకమీషనర్ వీరభద్రయ్య అన్నారట. 1971 లో జరిగిన 272 ఆత్మహత్య కేసులలో 166 మంది స్త్రీలు, 105 గురు పురుషులు, ఒక చిన్నపిల్ల వున్నారట. ఆత్మహత్య చేసుకునే వారిలో విషం త్రాగే పద్ధతి చాలా మంది అనుసరిస్తున్నట్టు కూడా ఆయన అన్నారట. గత ఏడులో 101 మంది ఆడవారు, ఒక చిన్నపిల్ల, 48 మంది పురుషులూ విషం త్రాగి మరణించారనీ, 25 మంది పురుషులు, 35 మంది స్త్రీలు నీళ్లలో దూకడం ద్వారా ఆత్మహత్యలు చేసుకున్నారని, 27 మంది పురుషులు, 20 మంది స్త్రీలు ఉరిపోసుకొని చనిపోయారని, తొమ్మండుగురు స్త్రీలు ముగ్గురు పురుషులూ నిప్పంటించుకుని చనిపోయారని కూడా ఆయన నివేదించారట.




## ప్రభుత్వోద్యోగి అయిన పిల్లి!

ప్రభుత్వ రికార్డులను శక్తివంచన, ఉత్సాహలోపం లేకుండా కొరికి సర్వనాశనం చేస్తున్న ఎలుకలను అరికట్టడానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఓ కొత్త మార్గాన్ని అవలంబించిందట. మధ్యప్రదేశ్ రెవెన్యూ మాన్యువలు పుస్తకంలో రెవెన్యూ రికార్డ్సు పుస్తకాల భద్రపరచుట అనే విషయంలో ఆ పనికోసం ప్రతి ప్రభుత్వ ఆఫీసులోనూ పిల్లులు అవసరం అని సూచించిందట. ఈ సూచనను అమలు పరుస్తూ గత పదేళ్ళుగా బేతుల్ జిల్లా కలెక్టరేటులో ఓ పిల్లికి వుద్యోగం యిచ్చి పోషిస్తున్నారట. ఈ పిల్లి పోషణకు నెలకి కేవలం మూడురూపాయలు ఖర్చవుతోందటంతే— అయ్యో అసలే నిరుద్యోగ సమస్యతో సతమతమవుతూంటే ఆ పుస్తకాలను రక్షించే వుద్యోగంలో పిల్లి దూరిస్తే యిహ బ్రతికేదెలా!!

# వర్ధమాన తార లీలారాణి



నందినీ ఫిలింస్ వారి 'అత్తలు—కోడళ్లు' చిత్రంలో రాజబాబు సరసన ఒక కొత్త అమ్మాయి నటించింది. ఆ నటి పేరు లీలారాణి.

అయిదడుగులా మూడు అంగుళాల పొడుగు, పొడుగుకు తగ్గ శరీర సౌష్ఠవం, మంచి వాయిస్, తీర్చి దిద్దిన కళ్లు, విశాలమైన ఫాలభాగం, లీలారాణికి దేముడిచ్చిన వరాలు. సంభాషణోచ్చారణలో స్పష్టత, మాడ్యులేషన్ యీమెకు వున్నాయి. ఏ పాత్రకయినా న్యాయం చేకూర్చగలదని యీమె నటించిన 'నిండుదంపతులు', వింతసంసారం' చిత్రాలు నిరూపించాయి.

ఆమె అనేక నాటకాల్లో విభిన్న పాత్రలను పోషించి, బహుమతులు, సత్కారాలు పొందింది.

క్రయిమ్ చిత్రాల్లో మీరు ధరిస్తున్న పాత్రలపై అభిప్రాయం ఏమిటి? అని అడిగాను. నటి అన్న తర్వాత ఫలానా పాత్ర అని భీష్మించుకుని కూర్చుంటే ఎలా? వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకుంటే, మళ్లీ వస్తాయా? ఇచ్చిన ప్రతి వేషానికి దర్శకుని ఆజ్ఞానుసారంగా న్యాయం చెయ్యడానికి ప్రయత్నిస్తూనే వున్నాను ప్రజల ఆశీస్సులు, పరిశ్రమ దీవెనలు, పత్రికేయుల విమర్శలు నాకు కలకాలం వుంటే, త్వరలోనే ఒక స్థానాన్ని ఆక్రమించుకోగలననే ఆశ వుంది

'1972 ప్రారంభమే నాకు ఆశాజనకంగా కనిపిస్తూ వుంది. అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ అధినేత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు వారి కలర్ చిత్రంలో నాకు చక్కటి పాత్ర నిచ్చారు. నా నట జీవితంలో యిదొక నూతన అధ్యాయాన్ని ప్రారంభించగలదనే నమ్మకం నాకు వుంది. నటసమ్రాట్ నాగేశ్వరరావుగారి ప్రేయసిగా నటించే అదృష్టం నాకు వస్తుందని కలలో కూడా వూహించలేదు.' ఇంతకంటె సంతోషమైన విషయం మరొకటి వుండగలదా చెప్పండి? అంది లీలారాణి.

'నేను ఒక నాటకంలో కృష్ణుడుగా నటించబోతున్నాను కూడా.' 'అమ్మమాట' చిత్రంలో నాకు వాణిశ్రీ అక్కయ్య ఎన్నో సలహాలను చెప్పి, నా నటనకు మెరుగులు దిద్దింది. ప్రజలు నాపై అభిమాన వర్షాన్ని కురిపించి, వెండితెరపై నన్ను ఆదరిస్తారని ఆశిస్తూ, ఆంధ్ర సచిత్ర వారపత్రిక ద్వారా నా ధన్యవాదాలను తెలియ చేసుకుంటున్నాను.

—ఇంటర్వ్యూ : శ్రీనివాస్

# ఒకవారం విపరీతం

## రాజకీయాల్లో జోస్యం !

రాజకీయాలలో జోస్యం పనికిరాదని నెహ్రూగారు ఒకసారి అన్నారంటారు వారి సూచన ప్రకారం ఒక చట్టం కూడా వచ్చిందంటారు! ఇది నిజమేమో తెలీదు కాని పత్రికలలో జరగబోయేదేమిటో చెప్పే వారికి కొదువలేదు.

ఈ మధ్య మదర్ల్యాండ్ పత్రికలో స్వామిమదనానంద్ అనే తాంత్రికుడి జోస్యం గురించి ఒక వార్త ఉంది. ఈస్వామిగారన్నారట— 1 మళ్లీ ఇంకో యుద్ధం తథ్యం, 2 ఈసారి చైనా, పాకిస్తాన్‌లు రెండూ రంగంలోకి దూకవచ్చు, 3 నిక్సన్ తిరిగి అధ్యక్షుడు కాడు 4 రాష్ట్రశాసనసభ ఎన్నికలలో కొత్తకాంగ్రెసు అంత బాగా గెలవకపోవచ్చు 5. 1975కి పాకిస్తాన్ అనే దేశమే ఉండదు 6 1985 నుంచి హైందవ భావాలు ప్రపంచంలో బాగా పాకిపోతాయి

తాంత్రిక స్వామిమదనానంద్ గారి ప్రత్యేకత ఏమిటి? వారు ఇంతకిముందే సరిగ్గా చెప్పినజోస్యాలు ఇవి(ట)— 1 శ్రీయుతులు నెహ్రూ, కెన్నెడీ, లాల్‌బహదూర్‌శాస్త్రిగారల మరణాలు ఎప్పుడు సంభవించేదీ చెప్పారుట 2. 1971 లో కొత్తకాంగ్రెసుకి పార్లమెంటులో వచ్చేసీట్ల సంఖ్యని తూచినట్లు చెప్పారట 3 మొన్న జరిగిన భారత—పాక్ యుద్ధం నవంబరు 28 డిసెంబరు 4 తేదీలమధ్య మొదలవుతుందన్నారట డిసెంబరు 3 మొదలయిందియుద్ధం'

## టిక్కెట్టుకోసం తిప్పలు

మధ్యప్రదేశ్‌లోని రాయ్‌సిన్ నియోజక వర్గం నుంచి రాష్ట్ర శాసనసభకు కొత్తకాంగ్రెసు అభ్యర్థిగా పోటీచేయడానికి పార్టీ టికెట్టు కోసం ధనులాల్ అనే ఆయనఢిల్లీవచ్చి సమాచారం సేకరిస్తే, లిస్టులో తన పేరులేదట రాజధానిలో ఆ పార్టీనాయకులతో తన విషయం వాదించడానికి,వారిని కలుసుకోడానికి ఆయన తన వద్దవున్న డబ్బంతా ఖర్చుపెట్టేసి, మూడురోజులు తిండిలేకుండా గడిపి, చాణక్యపురిలో మధ్యప్రదేశ్ భవన్ ప్రాంతంలో రోడ్డు పక్కన స్పృహతప్పి పడిపోయారట ఆయన్ను వెల్లింగ్టన్ ఆసుపత్రిలో చేర్చారట—ట్రూపేట్రియాట్.

## తిరగబడ్డ దొంగ!

బెంగుళూరులో ఫిబ్రవరి మూడవ తారీఖు తెల్లవారురూమున నాలుగ్గంటలకు గోవిందరాజు అనే ఒకతను నలుగురితో కలిసి స్టేషను గూడ్సుషెడ్ పరిసర ప్రాంతాలనుంచి ఇనుపగొట్టాలను తస్కరిస్తుండగా రైల్వేకాపలా రక్షక్ వెంకటస్వామిరాజు మూసే వాళ్లని తరుమబోయాడట. దాంతో ఆ నుగురూ పారిపోతే గోవిందరాజు మాత్రం తన వృత్తివిద్యకు అడ్డొచ్చిన వెంకటస్వామిరాజుమీద తిరుగబడ్డాడట. ఆత్మరక్షణార్థం వెంకటస్వామిరాజు తుపాకీపాల్చి, అతన్ని చంపవలసి వచ్చిందట ●

# సినిమా

## నిర్మాతలకి చలం సమాధానం

'బుల్లెమ్మ—బుల్లోడు' ఘనవిజయాన్ని సాధించింది! నటుడు చలంను శ్రీరమణ చిత్ర ఆఫీసులో కలిసి అభినందించాను. నేను వెళ్ళిన సమయంలో అయిదుగురు నిర్మాతలు అక్కడకి వచ్చి, 'మీరెంత అడిగినా యిస్తాము, మా పిక్చరు చేసి పెట్టండి' అని అడగడాన్ని విన్నాను. చలం వాళ్ళకు యిచ్చిన సమాధానాన్ని విని విస్తుపోయాను. 'మంచి కథవుండి, వెరైటీ పాత్ర నాకు లభిస్తేనే చేస్తాను. ఎక్కువ చిత్రాలను అంగీకరిస్తే, ఏ ఒక్క దానికి సరయిన న్యాయం చెయ్యలేక, ప్రజలు నాపై కురిపిస్తున్న అభిమానాన్ని అనవసరంగా పోగొట్టుకోవలసి వస్తుంది' అని చలం వినయంగా జవాబిచ్చారు. ఆయన చెప్పిన మాటల్లో సత్యంవుందని అందరూ ఒప్పుకోక తప్పదు.

## వెరైటీ పాత్రలు!

మీరు ఎన్ని చిత్రాలను ప్రస్తుతం అంగీకరించారు? విభిన్నమైన పాత్రలు ఆ చిత్రాల్లో మీకు లభించాయా? అని ప్రశ్నించాను. 'ప్రస్తుతం అయిదు చిత్రాలకు సంతకం చేసాను. ఒక పాత్రకు మరొక పాత్రను ఏమాత్రం సంబంధంలేని కథలే దొరకడం నా అదృష్టం' అన్నారు చలం ఆయన అంగీకరించిన సంస్థ లేవిటో మీకు తెలియజేస్తాను

'మనసు — మాంగల్యం' చిత్రాన్ని నిర్మించిన కె. కుటుంబరావుకు (ఉత్తమ చిత్ర) ఒకటి (రాజమండ్రిలో ఒప్పందం జరిగింది) తాతినేని ప్రకాశరావుగారికి ఒక చిత్రం చెయ్యాలి. ప్రముఖ వ్యాపారస్తుడు, పంపిణీదారుడు అయిన సుందరలాల్ నహాతాకు ఒకటి; 'పవిత్ర హృదయాలు' నిర్మాత సి. ఎస్ రాజుకు ఒకటి, 'నా తమ్ముడు' చిత్రాన్ని సమర్పించిన కన్నయ్య ఒకటి, నేను చేస్తానని అంగీకరించాను, అన్నారు ఆంధ్రా దిలీప్.

## 'ఊరికి ఉపకారి'

'సుందరలాల్ మూవీస్ బ్యానర్‌మీద ఎస్. మోహనరెడ్డి నిర్మించే చిత్రంలో నటించడానికి ఒప్పుకున్నాను. ఈ చిత్రం పేరు 'ఊరికి ఉపకారి'. దర్శకుడు కె. ఎస్. ఆర్. దాసు. సంగీతాన్ని సత్యం, ఛాయను అన్నయ్య నిర్వహిస్తారు' అన్నాడు చలం. ఆ చిత్రంలో నాయికగా ఆరతి అనే నూతన నటి చలంకి జంటగా నటిస్తోంది.



'మానవుడు—దానవుడు'లో అక్కా తమ్ముళ్ళుగా కృష్ణకుమారి, శోభన్‌బాబు.

## 15 ఏండ్ల కృషి!

హిందీ చిత్రసీమలో దిలీప్‌కుమార్ చిత్రానికి ఎంత మోజున్నదో, తెలుగు రంగంలో ఆంధ్రా దిలీప్ చిత్రానికి అంత



'బీదలపాట్లు'లో నాగేశ్వరరావు.



కొత్తం పసిఫాతు' చిత్రానికి నాగేష్‌పై క్లాప్ కొడుతున్న పి. ఏ. పి. సుబ్బారావు.

ప్రేక్షక తీర్చుడింది. 15 యేండ్ల కృషి చేటికి ఫలించింది.

తనపై ప్రజలు చూపిస్తున్న అభిమానాన్ని అభివృద్ధి చేసుకునేందుకు శాయశక్తులా కృషి చెయ్యగలనని అన్నారు చలం.

## కేరళకు అక్కినేని— వాణిశ్రీల పయనం!

నటసామ్రాట్ నాగేశ్వరరావు, మేటినటి వాణిశ్రీలు ఫిబ్రవరి 18న కేరళకు పయనం అవుతున్నారు ఎందుకో తెలుసా?

అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌వారి అవుట్ డోర్ షూటింగులో పాల్గొనడానికే. పేపి, ఆలప్పూర్ ప్రాంతాలవద్ద ప్రకృతి సౌందర్యంతో విలసిల్లే ప్రదేశాలలో

## సినిమా

ఆట పాటలతో తేలియాడడానికై వెళ్తున్నారు. అక్కినేని, వాణిశ్రీలతోబాటు గుమ్మడి, ఆదినారాయణ మొదలైనవారు యీ షెడ్యూలులో పాల్గొంటారు. ఫిబ్రవరి 29 వరకు సాగే యీ షూటింగులో నాలుగు పాటల చిత్రీకరణ, క్లయిమాక్స్ చిత్రీకరణ జరుగుతుంది 'మల్లెపువ్వు' రూములో కూడా షూటింగు వుంటుంది.

## మార్పు చేర్పులు!

ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన 'విజేత'కు సినిమాకు అవసరమయిన మార్పు చేర్పులను నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు; కవి ఆచార్య ఆత్రేయ చేసారు.

ప్రతి మనిషికి నిత్యజీవితంలో ఎదురయ్యే సజీవ పాత్రలతో, అడుగడుగునా హృదయాన్ని కదలించే సంఘటనలతో, విశిష్టమైన పాత్ర పోషణతో, ఈస్ట్‌మన్ కలర్‌లో నవరస భరితంగా తయారవుతున్న ఆ సమ్మోహనల సాంఘికంలో కె. వి. మహాదేవన్ సంగీతం, ఆచార్య ఆత్రేయ కలం, సెల్వరాజ్ ఛాయాగ్రహణం పోటాపోటీగా పనిచేస్తున్నాయని తెలుస్తూంది. 'బాక్సాఫీస్ ఫేమ్' ఆదుర్తి, బహుముఖ ప్రజ్ఞావంతుడు దుక్కిపాటిగార్ల కాంబినేషన్‌లో యీ చిత్రం ప్రేక్షక జనరంజకంగావుండి తీరుతుంది.

అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ప్రొడక్షన్ 2'లో నాగేశ్వరరావు, గుమ్మడి, పద్మనాభం, నాగయ్య, రాజబాబు, అల్లు రామలింగయ్య, రమేష్‌బాబు, వాణిశ్రీ, అంజలీదేవి, ఎస్వీ రంగారావు (గెస్టు) ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. అన్నపూర్ణా విడుదల.

## కొత్త గాయకుని పరిచయం!

ప్రముఖ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు తమ రెండవ చిత్రంద్వారా ఒక కొత్త నేపథ్యగాయకుడ్ని పరిచయం చేస్తున్నారు. ఇటీవల ఆ గాయకుడూ, మధురగాయని సుశీలతో ఒక యుగళగీతాన్ని పాడాడు. దాశరథి వ్రాసిన ఆపాటను మధుసూదనరావుగారు రామకృష్ణచే పాడించి, ఆ పాటను పాత్రికేయులకు వారి ఆఫీసులో టేప్‌పై వినిపించారు. ఆ గాయకుడి పేరు రామకృష్ణ. హైదరాబాదు వాస్తవ్యుడు. వయస్సు 22 సంవత్సరాలు వుంటాయట. 'నైటింగేల్ ఆఫ్ ది సౌత్'గా పరిగణింపబడుతున్న సుశీలకు దీటుగా పాటయొక్క పల్లవిని వ్రాస్తున్నాము

'వయసే ఒక పూలతోట
వలపే ఒక పూలబాట' ఆ పెద్ద

పాటను చేమంతా విని ఘంటసాలగారే అనుకున్నాము. తీరా మధుసూదనరావుగారు ఆ గొంతు రామకృష్ణది అని చెప్పారు. భావయుక్తంగా, లయబద్ధంగా, రాగరంజి

## సినిమా డైరీ

- ఘనతా ప్రొడక్షన్స్ వారి 'కాలం మారింది' షూటింగు ఫిబ్రవరి 9 నుండి 11 వరకు సినిమాలో జరిగింది కె. విశ్వనాథ్ దర్శకుడు.
- అన్నపూర్ణా కంబైన్స్ వారి రెండవ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు
- సుందరం మూవీస్ వారి 'ఊరికి ఉపకారి' చిత్రానికి కె. ఎస్. ఆర్. దాసు దర్శకుడు.
- విజయలక్ష్మీ మూవీస్‌వారి 'అమ్మమాట' ఫిబ్రవరి 25న అనిల్ ప్రభాస్ ద్వారా విడుదల చేస్తారు వి. రామచంద్రరావు దర్శకుడు.
- 'బుల్లెమ్మ—బుల్లోడు' ఫేమ్ చలం ఫిబ్రవరి 7న కలకత్తా వెళ్లారు.
- సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ యీ సంవత్సరం రెండు చిత్రాలను నిర్మించదలిచారు. శ్రీ సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు శోభన్ బాబు కథానాయకుడు.
- ఫిబ్రవరి 6న వాణీమహల్‌లో చిరంజీవి డి. వి. రమణయొక్క కూచిపూడి, భరతనాట్య ఆరంగేట్రం జరిగింది పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య అధ్యక్షత వహించారు 'పెట్టకొంకెను, కూతమనము' అని వి. రమణ నిరూపించాడు.




# మద్రాసు
# న్యూయార్క్
# మద్రాసు
# రు. 4815 మాత్రమే!

మీరు వేలలో డబ్బు ఆదాచేసుకోండి,
నేరుగా న్యూయార్కుకు ప్రయాణము చేయండి!
14 రోజులంత తక్కువ కాలము లేక 120 రోజులంత ఎక్కువ కాలము గడపండి. వయస్సు అర్హతయు లేక గ్రూపులలో వెళ్లాలనే నిర్బంధము లేదు. ఈ అవకాశము సంవత్సరమంతా ఉంటుంది. మీ దగ్గరలోనున్న ఎయిర్-ఇండియా ఆఫీసును లేక మీ ట్రావెల్ ఏజెంటును సంప్రదించండి. నేడే.

| మొదలయ్యే స్థలము | విలాస ప్రయాణపు ధర్లు, న్యూయార్కుకు మరియు తిరుగు ప్రయాణమునకు |
| --- | --- |
| బొంబాయి | రు. 4125 |
| న్యూ ఢిల్లీ | రు. 4125 |
| కలకత్తా | రు. 4875 |
| మద్రాసు | రు. 4815 |

**ఎయిర్-ఇండియా**

మీకు డబ్బు పొదుపు చేకూర్చే ఎయిర్ లైన్స్



'ఇల్లు—ఇల్లాలు' సెట్లో నాయికా, నాయకులతో దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి.

తంగా పాడగలశక్తి రామకృష్ణకు వుందని తేలింది. ఈ గాయకుడికి వుజ్వల భవిష్యత్తు వుందని ఘంటాపథంగా చెప్పవచ్చు.

## అదృష్టవంతుడు!

# సినిమా

ఇంతవరకు శోభన్, కృష్ణ హీరోలుగా నటించే చిత్రాలను డైరెక్ట్ చేస్తున్న ఒక యువదర్శకుడికి ఎన్టీరామారావు నాయక పాత్రను పోషించే చిత్రానికి దర్శకత్వం నిర్వహించే అవకాశం వచ్చిందంటే, అతన్ని అదృష్టవంతుడు అనాలి. ఆ దర్శకుడు పేరు పి. చంద్రశేఖరరెడ్డి. అతనికి అవకాశాన్ని కలిగించిన నిర్మాత పేరు ప్రేరాజా.

## ఎన్టీఆర్—నాయకుడు!

త్రివేణి ప్రొడక్షన్స్ కలర్‌లో నిర్మిస్తున్న 'బడిపంతులు' చిత్రంలో తాతగా, బాధ్యతగల తండ్రిగా బడిపంతులుగా ఎన్టీరామారావు నటిస్తున్నారు. ఆయన ధర్మపత్నిగా అంజలీదేవి, వారి కుమారులుగా రామకృష్ణ, కృష్ణంరాజు కనిపిస్తారు. రామకృష్ణకు జయంతి జోడయితే, కృష్ణంరాజుకు విజయలలిత యీడైంది. ప్రధాన పాత్రలను నాగభూషణం అల్లురామలింగయ్య, రావికొండలరావు, రాజబాబు, సాక్షి రంగారావు, రాధాకుమారి ధరిస్తారు. ఈ చిత్రానికి డి. వి. నరసరాజు రచనను, మహదేవన్ సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, కృష్ణారావు కళను, దయాసాగర్ సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు

## కొత్త అమ్మాయికి అవకాశం!

ఎన్టీఆర్‌కు ఒక కుమార్తె వుంది ఆ పాత్రకు కొత్త అమ్మాయిని పెట్టాలని నిర్మాత, దర్శకుడు అభిప్రాయపడుతున్నారు ఉగాదిరోజున పాటల రికార్డింగు జరుగుతుంది,

## విధివంచితురాలు

## కృష్ణకుమారి

'నీకు నా అన్నవారు లేరా' అని శోభన్ ప్రశ్నించాడు కృష్ణకుమారిని ఆమె నవ్వి 'అందరూ వున్నారు అయిన వాళ్ళుండీ కూడా వాళ్ళకు కాని దాన్ని ఎవరికీ లేని దాన్ని విధివంచితురాలిని' అని బాధగా నిట్టూర్చింది కృష్ణకుమారి.

విధి వంచితురాలవడం వల్లనే తన స్వంత తమ్ముడిని నోరారా పిలవలేని పరిస్థితి యేర్పడింది 'అక్కా' అని పిలవనా, అంటాడు శోభన్ ఆ మాట విని నిర్ఘాంతపోయింది చరచర గదిలోకి వెళ్ళిపోయింది. ఏమిటమ్మా, ఆమె ప్రవర్తన అని శోభన్ విస్తుపోయాడు ఈ అనురాగాను బంధాల బాంధవ్యం ఉషశ్రీవారి 'మానవుడు —



'మేనకోడలు'లో రేణుక, జమున.

దానవుడు'లో డాక్టర్ వేణు, నర్సు సీత పాత్రల్లో కనిపిస్తుంది.

## అక్కా తమ్ముళ్ల అనురాగం!

అక్క అనురాగం కోసం తపించే డాక్టర్‌గా శోభన్, తమ్ముడి దగ్గరే నర్సుగా పనిచేసే టీనరాలు సీతగా కృష్ణకుమారి నిజమైన అక్కాతమ్ముళ్లా అనిపించేంత సహజంగా ఆ పాత్రలకు రూపకల్పన చేసారట.

చిత్రాతిచిత్రమైన సన్నివేశాలతో సహజత్వానికి దగ్గరగా నిర్మితమవుతున్న యీ చిత్రానికి చిన్నపరెడ్డి కథకుడు, నిర్మాత. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారయ్యే 'మానవుడు—దానవుడు' ఛాయాగ్రాహకుడు సుఖదేవ్‌కి తన ప్రతిభా విశేషాలను చాటి చెప్పే అవకాశాన్ని కలిగింది శోభన్ (రెండు) విభిన్న మనస్తత్వాలు కలిగిన పాత్ర పోషణ యీ చిత్రంలోని ప్రత్యేకత.

## బీదలపాట్లు నాయకుని కథ!

'దీనా ఏక్కా ప్రాణాలకూ విలువ లేదనే విషయం నాకు తెలిసింది డబ్బు వున్న వాడికే గౌరవం అని కూడా అర్థమైంది. కాని డబ్బే లోకం అంటే నేను ఒప్పుకోను. మంచికి ప్రాధాన్యత ఎప్పుడూ వుంది సజ్జనులను లోకం ప్రేమిస్తుంది ఆదరించి గౌరవిస్తుంది పేదరికం కారణంగా నాలో పుట్టిన క్రోధ ద్వేషాలు సత్పురుష సంగమం వల్ల ఎలా క్షీణించి సంస్కార సంశుద్ధి చేసిందన్న సత్యాన్ని నా కథ చెప్తుంది నీతి, నిజాయితీలను తప్పకుండా మానవసేవే మాధవ సేవగా భావించే వారికెప్పుడూ మేలే జరుగుతుంది అని నా కథ చూస్తే తెలుస్తుంది.' ఈ కథా నాయకుడే 'బీదలపాట్లు' చిత్ర నాయకుడు

## లక్కినేనికి క్రొత్త రికార్డు!

'బీదలపాట్లు' చిత్రంలో అక్కినేనికి నాట్యం లేదు శృంగారం లేదు డ్యూయెట్ పాటలు లేవు. ఒక బాధ్యతగల వ్యక్తిగా, ఒక మేయరుగా, బీదల పాలిట పెన్నిధిగా నాగేశ్వరరావు జీవించినట్లు నటించి, చిత్రం ఆద్యంతం తన నటనా వైదుష్యంతో ప్రేక్షకులను రంజింప చేస్తారు. విఠలాచార్యకు అక్కినేని సహవాసం లాభదాయకంగానే వుంటుంది 'బీదలపాట్లు' విజయం నటసామ్రాట్ నట జీవితానికి మరొక రికార్డును సంపాదించి పెడుతుంది విఠలాచార్య ప్రెస్టేజ్‌ని, నిలబెట్టడానికి చిత్రంలో పాల్గొన్న నట సాంకేతిక వర్గం తమ సంపూర్ణ సహకారాన్ని యిచ్చిందని చిత్రం చూసినప్పుడు, మీరే ఒప్పుకుంటారు. మార్చిలో అన్నపూర్ణ విడుదల.



'గూడుపుఠాణి'లో కృష్ణ, శుభ.

## 'కాలం మారింది' ప్రారంభమైంది!

మమత ప్రొడక్షన్స్ తలపెట్టిన 'కాలం మారింది' షూటింగు ఫిబ్రవరి 9న వీనస్ స్టూడియోలో ఉదయం గం. 8—58 ని.లకు ప్రారంభమైంది.



రక్షణనిధికోసం ప్రధాని ఇందిరాగాంధికి నటుడు చలం చెక్కుని అందజేస్తున్నప్పుడు తీసిన చిత్రం.

మొదటి షాటుకు లక్ష్మీ ఫిలింస్ శివరామ కృష్ణయ్య క్లాప్ కొట్టగా, నిర్మాత డి. వి. ఎస్. రాజు స్విచ్ ఆన్ చేశారు. వాహినీ పిక్చర్స్ అధినేత, దర్శకుడు బి. ఎన్. రెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. మొదటిరోజు షూటింగులో చంద్రమోహన్, రావికొండలరావు, పొట్టిప్రసాద్ పాల్గొన్నారు. శ్రీరాముడి గెటప్‌లో శోభన్ విచ్చేసాడు.

'కాలం మారింది' ప్రారంభానికి వెండితెర అతిరథ మహారథులు, ప్రాతికేయులు, పుర ప్రముఖులు విచ్చేసి నిర్మాతలు ప్రకాశం, హనుమంతరావులకు, దర్శకుడు విశ్వనాథ్‌కు శుభాకాంక్షలందచేసారు. చిత్రంలోని నటీనటులందరూ వచ్చారు.

* * *

ఈ చిత్రానికి బొలిముంత రచన్ను, రాజేశ్వరరావు సంగీతాన్ని, సత్యం కూర్పును, కళాధర్ కళను, సత్తిరాజు ప్రొడక్షన్ను, గోపాలకృష్ణ సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ముఖ్య పాత్రలను శోభన్, శారద, ఎస్వీ రంగారావు, అంజలీదేవి, సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, గీతాంజలి, చంద్రమోహన్, సాక్షి రంగారావు, పొట్టిప్రసాద్, బేబీ గౌరి పోషిస్తున్నారు. ఈ చిత్రం ద్వారా అశోక్‌కుమార్ అనెడి కొత్త ఛాయాగ్రాహకుడు లభ్యమవుతున్నాడు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని కె. విశ్వనాథ్ నిర్వహిస్తున్నారు.

## అక్కినేని — శివాజీ కాంబినేషన్!

అంజలీ పిక్చర్స్ వారి 'పరదేశి' చిత్రంలో అక్కినేని, శివాజీ కలిసి నటించారు. ఆ తర్వాత యీ మహానటులిద్దరినీ కలిపి ఏ నిర్మాత చిత్రం తీయలేదు. మళ్ళీ నడిగర్ తిలగాన్ని, నట సామ్రాట్‌ని అంజలీ పిక్చర్స్ కంబైన్స్ 'భక్త తుకారాం' చిత్రంలో కలిపారు.

భక్త తుకారాంగా నాగేశ్వరరావు, ఛత్రపతి శివాజీగా శివాజీ గణేశన్, తుకారాం అర్ధాంగిగా అంజలీదేవి నటించే యీ భక్తిరస ప్రధానమైన చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు, తుకారాంను కేవలం

## సినిమా

పుండరీకభక్తుడిగానేగాక సంఘ సంస్కరణాభిలాషిగా, ప్రజా సంక్షేమకుడిగాకూడా చూపిస్తారు.

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమయ్యే 'భక్త తుకారాం'కి ఆచార్య ఆత్రేయ రచన్ను, ఆదినారాయణరావు సంగీతాన్ని నిర్వహిస్తారు. ఏప్రిల్‌లో హైదరాబాదు సారథిలో షూటింగు ప్రారంభమవుతుంది. లక్ష్మీ ఫిలింస్ విడుదల.

## అ, అలకలయిక!

అక్కినేని, అంజలీదేవి కాంబినేషన్‌లో ఎన్నో చిత్రాలు విజయవంతమైవున్నాయి. చాలకాలం తర్వాత అంజలీ, నాగేశ్వరరావులు భార్యా భర్తలుగ నటించడం యీ చిత్రంలోని ప్రత్యేకత.

—శ్రీనివాస్

## మీకు తెలుసా?

జాతీయ రక్షణనిధికి అక్కినేని నాగేశ్వరరావు 10 వేలు యిచ్చారు.

దేశ రక్షణనిధికి నటుడు చలం రు 27,290 లు (బుర్రెమ్మ బుల్లోడు మొదట ప్రదర్శన వాటా) విరాళంగా యిచ్చారు.

జగపతి రాజేంద్రప్రసాద్, ఏ. వి. సుబ్బారావు, విఠలాచార్య, రవీంద్రా కృష్ణమూర్తి తలకొక 5 వేలు యిచ్చారు.

సురేష్ మూవీస్ తరపున రామానాయుడు 10 వేలు సమర్పించారు

ప్రముఖ పంపిణీ సంస్థలయిన నవయుగ, లక్ష్మీ చెరొక 10 వేలు యిచ్చారు. అన్నపూర్ణా ఫిలింస్ 5 వేలు సమర్పించారు

నటి సావిత్రి 32 వేల రూపాయల చెక్కును, రక్షణనిధికోసం యిచ్చారు.

నటీమణులు వాణిశ్రీ, జమున, జయలలితా, శారద తలకొక 5 వేలు యిచ్చారు.



బాల గాయని అన్యుతగొంచరోవా.

## అవీ ఇవీ:

### బాల గాయకురాలు

ఈ అమ్మాయి వయస్సు 3 ఏళ్ళు పేరు అన్యుత గొంచరోవా వోల్గోగ్రాడ్ నివాసి ఏడాది వయస్సు దాటినప్పటినుంచే పాటలు పాడటం మొదలు పెట్టింది రెండేళ్ళు నిండేసరికె చాలా రష్యన్ జానపద గీతాలు ఆధునిక గీతాలు చక్కగా పాడసాగింది

ఆమెకు మంచి తాళజ్ఞానం వుంది చక్కని జ్ఞాపకశక్తి విన్న ప్రతిపాటను లయతప్పకుండా జ్ఞాపకం పెట్టుకుని పాడుతుంది ఇంట్లోనూ తన స్నేహితుల మధ్య ఆ పాటలు పాడుతూవుంటుంది. ఈమెలోని ఈ అసాధారణ ప్రతిభను, కంఠమాధుర్యాన్ని, సంగీత విద్వాంసులు గుర్తించి ఆమెకు ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు అయితే వయస్సుకు తగ్గ మోతాదులోనే నేర్పుతున్నారు అన్యుత తల్లి వోల్గో గ్రిపోవోద్క్రెజ్ సంస్థలో ఉద్యోగి. ఆమె పియానో బాగా వాయిస్తుంది తల్లి పియానో వాయిస్తూ వుంటే దానికి తగినట్లుగా అన్యుత పాటలు పాడుతూ వుంటుంది.

### వివాహం

శ్రీ సంజీవి మూవీస్ నిర్మాత ఎస్. శంకరరెడ్డి తమ ద్వితీయకుమార్తె చి॥ ఉమామహేశ్వరిని మూచుమర్రి వాస్తవ్యులు స్వర్గీయ జావటినాగిరెడ్డి కుమారుడు చి॥ వెంకటరెడ్డికి యిచ్చి ఫిబ్రవరి 3వ కొనిదాలలో (కర్నూలుజిల్లా) వివాహం జరిపించారు. మద్రాసునుండి పలువురు వెండితెర ప్రముఖులు వివాహానికి హాజరై వధూవరులను ఆశీర్వదించారు.

# పుస్తకాలు

పిది ఎట్లావున్నా అందం చెడకుండా ఎత్తుగడలో ముగింపులో వెలితి కన్పించకుండా కవి రాసుకొచ్చారు.

ఈ నవల ఇదివరకు ఆంధ్రజ్యోతి, సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా వచ్చింది ముందు ముందు ఇతోధికమైన రచనలు ఇంకా చక్కనివి చేసి, ఆంధ్ర పాఠకులను ఆకర్షింప చేయగలరని ఆకాంక్ష

వెలమటుకు జాస్తి అనిపిస్తుంది—జాస్తిగూడా.

—పునర్వసు

## శృంగార శాకుంతలము

పిల్లలమర్రి పినవీరభద్రకవి ప్రతులకు ఎమ్. శేషాచలం అండ్ కో, మదరాసు, క్రౌనుపుటలు 232 వెల సాధారణ రు 2—50 లైబ్రరీ ఎడిషన్ రు 4—25

ఎమెస్కోవారి సంప్రదాయ సాహితులలో పదిరెండవ సంప్రదాయ సాహిత్య ప్రచురణ యిది అటు తెనుగు మహాభారతంలోని కథ, ఇటు కాళిదాసు మహాకవి సంస్కృత శాకుంతలంలోని కథ యథేచ్ఛగా స్వీకరించి కొన్ని కొత్త చేర్పులతో మార్పులతో పినవీరభద్రకవి స్వతంత్రంగా రచించిన కావ్యమిది కావ్య ధోరణిలో రచించిన శృంగార శాకుంతలంలో కవి చేసిన మార్పులన్నీ సముచితంగా లేవు మేనకా విశ్వామిత్రుల ప్రేమ శృంగార వర్ణనం, కణ్వముని శిష్యుని ముఖతః వెలువరింపజెయ్యడం సముచితమే అని వాచవి శర్మలు, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారంటున్నారు కాని కాళిదాసు చేసిన మార్పులతో పరిశీలిస్తే ఇది సముచితంగా లేదు కథాకథనంలో గాని, ఔచిత పోషణలోగానీ పిల్లలమర్రికవికి అంత నిశిత దృష్టి లేదని ఇంకా కొన్ని ఉదాహరణలియ్యవచ్చును

సంపాదకులు వేర్వేరు ప్రతులుచూచి, ఎన్నో పాఠాలు చక్కగా ఉన్నాయి అయితే 'దారితప్పిన పడిన గోత్రధరు చందమునన్' అన్న మూడవ ఆశ్వాసం 118 పద్యంలో, గోత్ర అన్నపదానికి భూమిఅన్న అర్థం లేదనుకుని, 'భూవిభరు చందమునన్,' అన్న పాఠమే స్వీకరించామని వ్రాశారు. కాని గోత్ర అన్నపదానికి భూమి అన్న అర్థం కూడా ఆంధ్ర వాచస్పత్యంలో కనిపిస్తున్నది. ఇటువంటప్పుడు వావిళ్ల—అకాడమీ ప్రతుల పాఠాలు సరికావడం సముచితం కాదు

—శాస్త్రి

## ఉద్యోగపర్వాలు

రచయిత: కేళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ, ప్రకాశకులు యం శేషాచలం అండ్ కో, మచిలీపట్నము. వెల రు 2—50.

ఉద్యోగపర్వాలు అన్న పేరుతో వున్న హాస్యప్రధానమైన యీ 136 పేజీల పుస్తకంలో ఉద్యోగం రాని వాని బాదరబందీలు మొదలు, వుద్యోగంలో ఎదుగూ బొదుగూ లేని వారి కష్టనష్టాలు, అడ్డన్నీ తుంచుకు, జయించుకు, దున్నుకుపోయి జయం పొందాలంటే కావాల్సిన చిట్కాలు, పట్టాల్సిన నోములవరకూ వీలైనంత మేరకు చక్కగా చిత్రింపబడ్డాయి వాస్తవికతలో ఏనుగురావులా దున్నుకుపోయే వాళ్ళొక్కో కనబడరు విరుద్యోగి తన వుద్యోగంలోంచి పైమెట్లకు ఎక్కి వెళ్ళిపోడంతో అంతమయిన యీ రెండయిదుల పది విభాగాలలో హాస్యంపాలు వ్యంగ్యంపాలు కన్నా ఓ మెట్టు ఎక్కువ

కొన్నిచోట్ల జోకులను విప్పదీసి, బోధ చేయటం వల్ల అవి కాస్త చప్పబడినా, కొన్నిచోట్ల హాస్యానికి పునరుక్తి కలిగినా, కొన్నిచోట్ల దివినుంచి భువికి దిగి వచ్చిన దేవుళ్ళ కధను తికమక పరచినా, మొత్తానికి యీ పుస్తకం చదువ నాట్టే విసిగించదు. కథనంలో హాస్యం చొప్పించాలని చేసిన ప్రయత్నాలు కొన్నిచోట్ల ఎక్కువయినట్లనిపిస్తుంది.

మొత్తం మీద 'ఉద్యోగపర్వాలు' ఓ మంచి పుస్తకం తన వూహాశక్తికి చక్కని పని కలిగించి, కథను హాస్యపు వుచ్చులలోనూ, వ్యంగ్యం పగ్గాలలోనూ బిగించి, గట్టిగా పేని, అల్లినందుకు రచయితను మెచ్చుకోవాలి.

## రాక్షసి...! నీ పేరు రాజకీయమా!

రచయిత ఆదివిష్ణు. వెల రు 2—50. ప్రకాశకులు యం శేషాచలం అండ్ కో.

సిటీకాని, ప్రాంతనడానికి వీల్లేని తిమ్మాపురం పురప్రభువు రామదాసు తన చిన్నతనంలో సీత అనే ఓ అమ్మాయిని మనాయసంగా వలలో వేసుకుని, అవసరం తీరాక, తప్పించుకు పోతాడు తాను పట్టిన నోమే తన కొడుకు చిరంజీవి సుమతి అనే వో అమ్మాయితో వస్తే సరికి గతం గుర్తొచ్చి ఊహా మథనపడిపోతాడు తన గత జీవితాన్ని తల్చుకుని, సిగ్గుపడినట్లు తన పదవిని, ధనకనక వస్తువాహనాలనూ త్యజించి, వో కుటీరంలోకి మకాం మార్చేస్తాడు నా ఆస్తి కావాలంటే మాత్రం నీవు సుమతిని తప్పక పెళ్ళి చేసుకో వలసి వుంటుంది అని కొడుక్కి ప్రకటిస్తాడు, సీతని కలుసుకుని తాను సొంతం మారిపోయినట్లూ, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నట్లూ ఎరుకపరుస్తాడు ఆమె నమ్మినట్లు కనబడదు మరోసారి ఆమెను కలసి, తన పశ్చాత్తాపం విషయం తెలియజేదామని వెళ్ళేసరికి ఆమె చనిపోయుంటుంది తన కళ్ళు తెరిపించిన ప్రసాదం 'మా అక్కయ్య ... సీతక్క చనిపోయింది' అని చెప్తుంటే అతన్ని వారించి, 'నాయనా ప్రసాదం, సీత నీకు అక్క కాదు నిన్ను కన్నతల్లి బాబూ, ఇదిగో నేను. నేను నీ తండ్రిని నేను నీ తండ్రిని' అని చెప్పేస్తాడు, టూకీగా

ఈ కథ కాదు నవలలో బొత్తిగా రాజకీయం కనబడదు. చిరంజీవి కాలేజీ ఎన్నికలను రాజకీయాల్లో ఉద్యోగాలలోంచి చూసి చదవమని చదుపరినట్టుంటుంది రామదాసు ఏడాదికో స్వాముల వారిని పిలిచి, భక్తిశ్రద్ధలుట్టిపడేలాగ తాను గుండు గీయించుకోడం, తద్వారా ప్రజలనా కట్టుకోడం వంటివి, తాననుకున్నవి సాధించడానికి దొంగగుండె నొప్పిని 'అభినయించడం వంటివి సహజత్వానికి దూరంగా వుండడం వల్లనే కాస్త ఎబ్బెట్టుగా కనుపిస్తాయి.

రచనా విధానంలో సందర్భానుసారంగా కాకుండా హాస్యమూ వ్యంగ్యమూ ఎక్కువగా వుపయోగించినందువల్ల విషాద సన్నివేశాలు, బరువైన సంఘటనలు పేలవంగా వున్నాయి

నవల్లో రాజకీయంగాని, రాక్షసత్వం గాని లేకపోయినా, రచనా విధానంలోని నేర్పువల్ల యీనవల చదువరిని విసిగించదు.

—సాంబశివుడు



బ్రిటన్‌లోని సెయింట్ జాన్ అంబులెన్స్, నర్సింగ్ కాడెట్స్‌కి కొత్త కమాండెంట్ ఛీఫ్‌గా వచ్చిన రాకుమారి ఆనీ. ఇంతకు ముందు ఈ పదవిని రాకుమారి మార్గరెట్ నిర్వహించారు.

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.**
**Chief Editor : S. Sambhu Prasad.**




ముగ్గురు మహిళలు. మూడు పూర్తిగా వేరైన అవసరములు. కనుక మూడు వేరైన ఉతికే పొడర్లు కావాలా? "అవ్వే అవసరము లేదు." అంటారు మా పరిశోధనా సాంకేతిక నిపుణుడు. "ఆ మూడు అవసరములను ఒకే ఉతుకు పొడరు ద్వారా తీరుద్దాము."
దాని ఫలితము:

# క్రొత్త త్రివిధోపయుక్తమైన డెట్

- క్రొత్త డెట్ హెచ్చు తెల్లని పొడరు—దుస్తులను అతి తెల్లగా ఉతుకుటకు మేలు రకపు పదార్థము.
- క్రొత్త డెట్ బట్టలను అదనముగా శుభ్రపరచే శక్తి గలది. అంటివున్న మట్టిని కూడ వదలించి, రంగు బట్టలను ప్రకాశవంతముగా చేస్తుంది.
- క్రొత్త డెట్ యిచ్చే సమృద్ధియైన నురుగులో ఒక ప్రత్యేకమైన మృదువుగా చేయు పదార్థముంది. అది బట్టలకు ఎంతో నిరపాయమైనది మరియు చేతులకు ఎంతో మృదువుగా ఉంటుంది!

**5 క్రొత్త సైజులు : డెట్ 200, 400, 600, 800, 1000**



Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA